# ఆ బాధ ఎప్పుడూ లేదు

## -ఇషా తల్వార్

**మం**చి ఎత్తు, ఆకర్షణీయమైన శరీర సౌష్టవం, అందమైన ముఖం...హావభావాలు పలికించగల విశాలమైన కళ్ళు, అన్నింటికీ మించి అద్భుతమైన డ్యాన్స్ ప్రతిభా...ఇవేవీ ఇషాతల్వార్‌ను బాలీవుడ్, టాలీవుడ్ ఆకర్షించ లేకపోయాయి. ఇషాలో ఉన్న ఈ ప్రత్యేకతలన్నింటినీ మాలీవుడ్ గుర్తించింది. స్టార్ హీరోయిన్ పట్టం కట్టి అందలం ఎక్కించింది. మంచి మంచి సినిమాలు చేస్తూ మాలీవుడ్‌లో పేరుతెచ్చుకున్నంత పేరును బాలీవుడ్, టాలీవుడ్‌లలో కూడా తెచ్చుకోవాలని ఉవ్విళ్ళూరుతున్న ఇషా తల్వార్‌తో...





**'రాజా చెయ్యి వేస్తే' విజయాన్ని ఎంజాయ్ చేస్తున్నారా?**

తెలుగులో రెండవసారి విజయాన్ని చవిచూస్తున్నాను.

**సినిమాలో బైక్ రైడింగ్ సీన్ గురించి....**

ముందు బైక్ రైడింగ్ అంటే చాలా తేలిక, ఈజీగా చేసేయొచ్చు అనుకున్నాను. అంత తేలికగా అనిపించలేదు. ఇరవై నిమిషాల పాటు ప్రాక్టీస్ చేసి మరీ చేయవలసి వచ్చింది. ముందు పెద్ద బైకు ఇచ్చారు. దాన్ని డ్రైవ్ చేయడం నా వల్ల కాదు అంటే మరో చిన్న బైక్ ఇచ్చారు. ఏదో విధంగా మేనేజ్ చేసేశాను. కానీ సినిమాలో బైక్ రైడింగ్ చాలా బాగుందని అంటే సంతోషమనిపిస్తోంది.

**తెలుగులో చాలా గ్యాప్ తీసుకుని చేసినట్టున్నారు?**

వాస్తవానికి 'గుండెజారి గల్లంతయ్యిందే' తరువాత తెలుగులో చాలా ఆఫర్లు వచ్చాయి. ఈ సినిమా తరువాత మాలీవుడ్‌లో వరుసగా ఒప్పుకోవడంతో గ్యాప్ వచ్చిన మాట నిజమే! లేటుగా వచ్చినా లేటెస్టుగానే వచ్చానుగా! తెలుగులో నా రెండవ సినిమాను ఇంతగా ఆదరిస్తున్న తెలుగు ప్రేక్షకులకి నా థాంక్స్!

**మీ గురించి....**

నాన్న బాలీవుడ్‌లో ప్రొడ్యూసర్, అమ్మ హౌస్ వైఫ్. నా చదువు అంతా ముంబాయిలోనే సాగింది. సినిమాల్లోకి వచ్చే ముందు ప్రత్యేకించి డ్యాన్స్ నేర్చుకున్నాను. చిన్నతనం నుంచీ డ్యాన్స్ అంటే ఇష్టమే కానీ, ప్రత్యేకించి శిక్షణ తీసుకోలేదు. మోడల్‌గా పలు ఉత్పత్తులకు చేశాను. సినిమా అవకాశం వాటి ద్వారానే వచ్చింది. మొట్టమొదట చేసింది బాలీవుడ్‌లోనే! ఆ సినిమా పెద్దగా సక్సెస్ కాలేదు. ఆ సినిమా చేస్తున్న సమయంలోనే మాలీవుడ్ నుంచి పిలుపు వచ్చింది. అక్కడ వరుసగా సినిమాలు చేస్తున్నాను.

**మాలీవుడ్‌లో భాష ఇబ్బంది కాలేదా?**

మొదటి సినిమా సమయంలో ఇబ్బంది పడ్డాను. ఆ తరువాత ట్యూటర్‌ని ఏర్పాటు చేసుకుని భాష నేర్చుకున్నాను. అక్కడ నా సినిమాలకు నేనే డబ్బింగ్ చెప్పుకుంటున్నాను. తెలుగు కూడా బాగానే వస్తుంది. కానీ డబ్బింగ్ చెప్పే స్థాయిలో మాత్రం భాష రాలేదు.

**బాలీవుడ్‌లో అవకాశం రావడం లేదన్న బాధ లేదా?**

సినిమా అవకాశాలు రాకపోయినా, ఖాళీగా ఉన్నా బాధ పడేదాన్నేమో! దక్షిణాదిన నన్ను అందరూ ఇంతగా ఆదరిస్తుంటే వేరొకచోట రావడం లేదని ఎందుకు బాధపడాలి. నన్ను అభిమానించే వాళ్ళే నా వాళ్ళు!

**మీ దృష్టిలో గ్లామర్‌గా కనిపించడం అంటే?**

చిట్టిపొట్టి డ్రస్‌లు వేసుకుంటే అదే గ్లామరనుకోను. మన వ్యక్తిత్వంలోనూ, పర్సనాలిటీలోనూ గ్లామర్ దాగి ఉంటుంది. మాలీవుడ్‌లో నా మొదటి సినిమాలోనే ముస్లిం యువతిగా బురఖాలో కనిపించాను. సినిమా అంతా అలాగే కనిపిస్తాను. అయినా సరే నేను చాలా అందంగా కనిపించానని విమర్శకులు సైతం మెచ్చుకున్నారు. పాత్రకు అవసరమైనంత వరకూ గ్లామర్‌గా కనిపించడానికి నాకు ఎలాంటి అభ్యంతరం లేదు. అది కూడా పరిమితులకు లోబడే కనిపిస్తాను. నా పరిమితి దాటి కనిపించమంటే మాత్రం నేను ఒప్పుకోను.

**సినీరంగానికి వచ్చి ఇన్నిసంవత్సరాలైనా, ఎక్కువ సినిమాలు చేయకపోవడానికి కారణం?**

రాశి కన్నా వాసి ముఖ్యం. ఎన్ని సినిమాలు చేశామనేదానికన్నా ఎంత మంచి సినిమాలు చేశాను అన్నదే నాకు ముఖ్యం. అందుకే సెలక్టివ్‌గా ఎంచుకుని చేస్తున్నాను.

-బి.కె

## సరదాగా

### చిలక జోస్యం

చిలకజోస్యం చెప్పేవాడి మీద మండిపడు తున్నాడు సర్వేశ్వరరావు, "ఏంటండీ, మీరు, మీ జ్యోతిషమూనూ! త్వరలో నేనొక ఇంటివాడిని అవుతానని అన్నారు. సంవత్సరం తిరిగినా పెళ్ళి కాలేదు సరికదా, అప్పులెక్కువై ఉన్న రెండు ఇళ్ళలో ఒక ఇల్లు అమ్మేశాను" అంటూ అరుస్తు న్నాడు.

"మరింకేమండీ, ఇప్పుడు మీరు ఒక్క ఇంటి వారే కదా! నా జ్యోతిషాన్ని తిడతారేం?" అంటూ ఎదురుతిరిగాడు చిలక జోస్యుడు.

### ఒక ప్రశ్న?

నందనవనం అపార్ట్‌మెంట్స్, పేరుకు తగ్గట్టే ఆ అపార్ట్‌మెంట్స్ పరిసరాలు నిజంగా నందన వనమే! ఆరోజు రిపబ్లిక్‌డే సందర్భంగా జాతీయ జెండా ఎగురవేసి, ఏవో కొన్ని వినోద కార్య క్రమాలు ఏర్పాటు చేసుకున్నారు పిల్లలూ, పెద్దలూ! సాయంత్రమైంది. పోలీస్‌జీపు అపార్ట్ మెంట్స్ మెయిన్‌గేట్ దాటి లోపలికి వచ్చింది. ఇన్ స్పెక్టర్ నేరుగా లిఫ్ట్ ఎక్కి ఐదో ఫ్లోర్ చేరుకున్నాడు. ఒక ఫ్లాట్ ముందు జనం తొంగి తొంగి చూడటం కనిపించిందతనికి! ఆ ఫ్లాట్ దగ్గరకి వెళ్ళి, తప్పు కోండి అంటూ సిబ్బందిసహా లోపలికి వెళ్ళాడు. అప్పటికే ఫోరెన్సిక్ వాళ్ళు ఫింగర్‌ప్రింట్స్, అవీ తీసుకుంటున్నారు. లోపల బెడ్‌మీద ఓ అమ్మాయి శవం పడిఉంది. బెడ్‌కిందంతా రక్తం చారికలు కట్టి ఉంది. చనిపోయిన అమ్మాయి పేరు దివ్య. ఆ అమ్మాయి, మరో ముగ్గురు అమ్మాయిలు రమ్య, దివిజ, హారికలతో కలిసి ఆ ఫ్లాట్‌లో అద్దెకు ఉంటోంది. నలుగురూ సాఫ్ట్‌వేర్ కంపెనీలో జాబ్ చేస్తున్నారు. దివ్య చనిపోయినపుడు మీరెక్కడు న్నారు? అడిగాడు ఇన్‌స్పెక్టర్ ముగ్గురినీ. 'నేను కంపెనీ పనిమీద ముంబై వెళ్ళాను, ఇంతకు ముందే వచ్చాను' చెప్పింది రమ్య. 'నాకు కొంచెం అనారోగ్యంగా ఉండటంతో డాక్టర్ రాసిచ్చిన మందులు వేసుకుని నేను నా రూంలో పడుకుని ఉన్నా'నని చెప్పింది దివిజ. 'నేను మునిసిపాలిటీ ఆఫీసుకు వెళ్ళి ఇంటిపన్ను కట్టి వచ్చా'నని చెప్పింది హారిక. వెంటనే కానిస్టేబుల్స్‌ని పిలిచి హారికను అరెస్ట్ చేయమన్నాడు ఇన్‌స్పెక్టర్. దివ్యను హత్య చేసింది హారికే! అని చెప్పాడు. ఇంతకీ హారికే దివ్యను హత్య చేసిందని ఇన్‌స్పెక్ట ర్‌కు ఎలా తెలిసింది? జరిగిన క్రైమ్‌లో ఇన్‌స్పెక్టర్‌కి దొరికిన ఆధారం ఏంటి? ఛేదించండి?

### సమాధానం

సంఘటన జరిగింది జనవరి 26న. ఆరోజు పబ్లిక్ హాలిడే! ఏ ప్రభుత్వ కార్యాలయమూ పని చేయదు. మరి హారిక ఆరోజున మునిసిపాలిటీ ఆఫీస్‌లో ఇంటిపన్ను ఎలా కట్టింది? ఈ ఆధారం తోనే దివ్యను హత్య చేసింది హారిక అని ఇన్ స్పెక్టర్ తేల్చేసి అరెస్ట్ చేశాడు.

Jayadev

# అడపా దడపా నవ్వుల్స్





22

## ఆరోగ్య దేవతలు మన నర్సులు

**కళ్ళల్లో కరుణ రసం, నిలువెల్లా సేవాభావం వారి నైజం. బతుకుపై ఆశలు సన్నగిల్లుతున్న వేళ బంధాలకు అతీతంగా మనలో విశ్వాసం నింపి బతుకుపై ఆశ పుట్టించి స్వస్థత చేకూర్చే ఆరోగ్య దేవతలు మన నర్సులు. మే 12వ తేదీ ప్రపంచ నర్సుల దినోత్సవం సందర్భంగా ఓ లుక్...**

8

### నవ్యవీక్లీ-నాటా కథల పోటీ ఫలితాలు

నవ్యవీక్లీ-నాటా సంయుక్తంగా నిర్వహించిన కథ-కవితల పోటీలో విజేతలైన వారి వివరాలు...

72

### ఇంటర్వ్యూ

చికుబుకు చికుబుకు రైలే అదిరెను దీని స్టైలే....అనే పాటలో తన డాన్స్‌తో అందరినీ అలరించి సంచలనం సృష్టించిన 130 చిత్రాల బహుభాషా నటి గౌతమి ఇంటర్వ్యూ...

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



**ముఖచిత్రం: సమంత**

ఫొటో: గోపీకృష్ణ


**రచనలు, కథలు పంపవలసిన చిరునామా**

*నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్-33.* **email: navyaweekly@andhrajyothy.com**





### సీ వ్యూ హోటల్

ఆ ఏడుగురూ చిన్నప్పటి నుంచీ స్నేహితులు. నలభైవపడిలో పడ్డారంతా. సరదాగా లంచ్‌కి వెళ్దామన్నారు. ఎక్కడికి వెళ్దామంటే 'సీ వ్యూ హోటల్'కి అన్నారు. ఎందుకంటే... అక్కడ సర్వ్ చేసే అమ్మాయిలు బాగుంటారని సంబరపడ్డారు.

ఏభై పడికి చేరుకున్నారు ఏడుగురూ. లంచ్‌కి మళ్ళీ అదే 'సీ వ్యూ హోటల్'కే వెళ్దామన్నారు. ఎందుకంటే...అక్కడ ఫుడ్ బాగుంటుంది. అలాగే నిఖార్సయిన మందు దొరుకుతుందన్నారు.

అరవయ్యవ పడికి చేరుకుంది మిత్రబృందం. లంచ్‌కి 'సీ వ్యూ హోటల్'కే వెళ్దామంది. దానికి కారణం... ఆ హోటల్‌లో అల్లరీ, హడావుడీ ఉండదు. ప్రశాంతంగా ఉంటుంది. పైగా పేరుకి తగినట్టుగా సముద్రాన్ని చూస్తూ లంచ్ చేయొచ్చన్నారు.

డెబ్బయ్యో పడిలో పడ్డారు. లంచ్‌కి 'సీ వ్యూ హోటల్'కే వెళ్దామన్నారు. ఎందుకంటే...ఆ హోటల్‌లో ఎక్కడికక్కడ ఎలివేటర్లున్నాయన్నారు. అంతే కాదు, వీల్‌ఛైర్స్ కూడా అందుబాటులో ఉంటున్నాయంటూ చెప్పుకున్నారు.

ఎనభయ్యవపడిలో పడ్డారంతా. అయినా 'సీ వ్యూ హోటల్'కే లంచ్‌కి వెళ్దామన్నారు. ఎందుకంటే... మళ్ళీ అలాంటి హోటల్ చూస్తామో! చూడమో! అలాగే అలాంటి ఫుడ్ తింటామో! తినమో అందుకని అనుకున్నారు.

### సూపర్

**"ఈ** సినిమాలో మీది డ్యూయల్‌రోల్ సార్! తండ్రీ కొడుకులుగా మీరు యాక్ట్ చెయ్యాలి." హీరోకి చెప్పాడు డైరెక్టర్.

"తండ్రీ కొడుకులుగా యాక్ట్ చెయ్యాలంటే రెండు సార్లు మేకప్ వేసుకోవాలి." అన్నాడు హీరో.

"అక్కర్లేదుసార్! కొడుకుగా మీరు మేకప్ వేసుకుంటే చాలు! తండ్రిగా మీ నేచురల్ గెటప్పే సూపర్." చెప్పాడు డైరెక్టర్.

●●●

అది ఐదో తరగతి క్లాస్ రూం. టీచర్ అడిగిందిలా.

"మీలో ఎవరైనా ప్రాణాపాయస్థితిలో ఉన్న ఎవరినైనా కాపాడారా?"

"నేను కాపాడాను మేడం, మా అక్క కూతుర్ని నేను కాపాడాను." చెప్పాడు రాము.

"గుడ్! ఎలా?"

"ఎలా అంటే...మా అక్క వేసుకునే బర్త్‌కంట్రోల్ మాత్రలు దాచేశాను."

**-వైనతేయ**

w m w w

నవ్య

సంపుటి: 13 సంచిక: 11

18-5-2016

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



## మొదటి పేజి

# ఆకులో ఆకునై! పువ్వులో పువ్వునై!

ఒరేయ్! ఈసారైనా నువ్వు తప్పకుండా తోటసంబరానికి రావాలి. వస్తే నీ పెళ్ళి అయిపోయినట్టే! అని అక్క ఫోన్ చేయడంతో వాళ్ళూరుకి వెళ్ళేందుకు సిద్ధమయ్యాడతను. గత రెండేళ్ళుగా తల్లి పోరు భరించలేకపోతున్నాడు. నేను ఉన్నప్పుడే ఆ మూడుముళ్ళూ వేస్తే చూడాలని ఉందిరా అంటూ గోల చేస్తోందామె. మూడుముళ్ళు వెయ్యడం ఈజీ అనుకుంటోంది. ఆడపిల్లలే లేరు. ఉన్నారనుకుంటే... వాళ్ళ గొంతెమ్మ కోరికలకు అంతూపొంతూ లేదు. పెళ్ళిచూపులకు వెళ్ళిన ఫ్రెండ్సంతా నెత్తి మొత్తుకుంటున్నారు. ఏంటి! బయల్దేరుతున్నావా? మళ్ళీ అక్క దగ్గర నుంచి ఫోన్. బయల్దేరుతున్నాను అన్నాడతను. బయల్దేరాడు. విజయనగరం జిల్లాలో ఎక్కడో మారుమూల గ్రామం. పేరు పంతులుగారితోట. బస్సు దిగితే అదిగో! అదే పంతులుగారి తోట అన్నారంతా. బ్యాగు భుజాన్న వేసుకుని బయల్దేరాడతను. ఊరిలోనికి ప్రవేశించాడో లేదో చల్లనిగాలి శరీరాన్ని నిమిరింది. హాయి అనిపించింది. అలాగే స్వచ్ఛమైన గాలి గుండెలకు అందింది. తెలియని ఆనందం కలిగింది. దారి పొడుగునా ఇరువైపులా వేప, మర్రి, రావి, తురాయి, గన్నేరు చెట్లు స్వాగతించినట్టనిపిస్తే సంతోషం కలిగింది.

ఒరేయ్! ఇటు ఇటు! అని అక్క పిలుస్తోంటే నీడపట్టుగా ఉండే తోటలోకి నడిచాడతను. ఓ చెట్టు కింద ఈజీఛైర్లో కూర్చుని పేపర్ చదువుతూ బావ కనిపించాడు. ఆడుకుంటూ పిల్లలు కనిపించారు. కొమ్మల మీద ఆరేసిన బట్టలు, వాటి దిగువున రెండు బ్యాగులూ కనిపించాయి. ఏంటిదంతా? అయోమయంగా చూశాడతను. తోటసంబరం ఈ రోజు నుంచే ప్రారంభం. ఈ ఉత్సవం తొమ్మిది రోజులు జరుగుతుంది. ఈ తొమ్మిది రోజులూ ఊరు ఊరంతా తోటలోనే ఉంటుంది. ఇక్కడే స్నానాలు, ఇక్కడే భోజనాలు, ఇక్కడే పడకలు అంది అక్క. అతని భుజమ్మీది బ్యాగు అందుకుంది. అదిగో! అక్కడ గుబురుగా నందివర్ధనం మొక్కలు ఉన్నాయి చూడు! అదే మగాళ్ళ బాత్రూం. వెళ్ళి స్నానం చేసిరా! టిఫిన్ చేద్దువుగాని అంది. వెళ్ళాడతను. మొక్కల కింద స్నానం అనుకున్నాడు కాని, కాదు. అక్కడ ఏకకాలంలో పది మంది కాలకృత్యాలు తీర్చుకునేందుకు సరైన ఏర్పాట్లు ఉన్నాయి. కావాల్సినంత నీరు. దిమ్మదిరగ స్నానం చేసి వచ్చాడు. వేడి వేడి నేతి పెసరట్టూ ఉప్మా టిఫిన్ పెట్టింది అక్క. మహా రుచి అనిపించాయి. ఫిల్టర్ కాఫీ ఇచ్చింది. అద్భుతంగా బాగుంది. కాఫీ తాగుతున్నప్పుడే గుంపులు గుంపులుగా యువతులు నవ్వుతూ కనిపించారు. సీతాకోకచిలుకల్లా ఉన్నారు.



ఎవరే వీళ్ళంతా? అడిగాడతను. పెళ్ళికూతుళ్ళు అంది అక్క. పేర్లేమిటో తెలుసా? బంతి, చామంతి, గులాబీ, మల్లె, సన్నజాజి... అంది. పూలపేర్లే ఆ పిల్లల పేర్లు. వాళ్ళు చేసుకోవాల్సిన వారి పేర్లు కూడా ఎంచక్కా మామిడి, సపోటా, దానిమ్మ, జామ... అని ఉంటాయి. ఉండాలి. పేరు మార్పిడి తప్పదిక్కడ. తోటలో తిరుగుతూ పిల్లా పిల్లాడు ఒకరికొకరు నచ్చారనుకో, పెళ్ళి చేసుకుందాం అని ఓ నిర్ణయానికి వచ్చారనుకో! ఆ ఇద్దరూ వారి పెళ్ళిరోజు నాడు ఇక్కడ ఓ మొక్కను నాటాలి. వారి పెళ్ళిరోజే మొక్క పుట్టిన రోజు అవుతుంది. ఆ పుట్టినరోజును ప్రతి ఏటా ఆ భార్యాభర్తలు ఘనంగా జరపాలి. అలా నాటిన మొక్కలే చెట్లయి పువ్వులూ, కాయలూ కాస్తూ ఇక్కడ ఇంత తోటయింది అంది అక్క. మట్టినీ, మొక్కనీ దేవతల్లా చూడాలంటారు పంతులుగారు. పచ్చని మొక్కల్లో తిరగాలంటారు. తిరిగితే ఏ అనారోగ్యం లేకుండా నిండు నూరేళ్ళూ బతుకుతారంది అక్క.

చెట్టు పేరూ, పువ్వు పేరూ పెట్టుకుని ఇద్దరూ ఒక్కటవ్వడం, పెళ్ళిరోజూ, మొక్క పుట్టినరోజూ ఒక్కటవ్వడం, ఆకుపచ్చని లోగిలిలో చిలుకా గోరింకల్లా తిరగడం, తొమ్మిది రోజులు సంబరం చేసుకోవడం... అంతా వింతగా అనిపించినా బాగుందనుకున్నాడతను. మామిడి అని నామకరణం చేసుకున్నాడు. తోటలో పువ్వుల మధ్య తిరగసాగాడు. అతన్ని చూసి, ఓ బంతి నవ్వింది. చేయి జాచి చేర రమ్మంది. అతను ఆమెను అందుకున్నాడు. అందుకుని, ఓ మొక్కకు తనని తండ్రిని చేయబోతున్న పంతులుగారికి మనసులోనే నమస్కరించాడు.

నవ్య




## సైనికుడా వందనం!!

ఆర్మీ, నేవీ, ఎయిర్‌ఫోర్స్ సైనికులు పగలూ రాత్రీ తేడా లేకుండా సరిహద్దుల్లో రక్షణ విధులు నిర్వర్తిస్తుంటారు. ఎంతోమంది సైనికులు దేశరక్షణ కోసం ప్రాణాలర్పిస్తున్నారు. మరి వారి కుటుంబ సభ్యుల పరిస్థితేంటి? ఇలాంటి ఆలోచనే జితేంద్రకు వచ్చింది. అందుకే 17 సంవత్సరాలుగా యుద్ధంలో, అంతఃకల్లోలాల్లో మరణించిన సైనికుల కుటుంబాలకు తనకు చేతనైనంతలో ఓదార్పునిస్తున్నాడు జితేంద్ర.

గుజరాత్ రాష్ట్రం సూరత్‌లో సెక్యూరిటీ గార్డుగా పనిచేస్తున్నాడు జితేంద్రసింగ్. మధ్యతరగతి కుటుంబం. అతడి తండ్రి ఆర్మీలో సైనికుడిగా ఉండేవాడట! మనసులో కోరిక ఉన్నప్పటికీ కుటుంబ పరిస్థితుల దృష్ట్యా ఆర్మీలోకి వెళ్ళలేకపోయాడు జితేంద్ర. కార్గిల్ యుద్ధంతో అతడిలో అంతర్మథనం మొదలైంది. అతడి ఆలోచనలు యుద్ధంలో చనిపోయినవారి కుటుంబాల మీదికి మళ్ళాయి. కొడుకులను పోగొట్టుకున్న ఆ కుటుంబ సభ్యులు పడే ఆవేదన గురించి ఆలోచించాడు. వారికోసం ఏదో ఒకటి చేయాలనుకున్నాడు. వెంటనే రంగంలోకి దిగాడు. యుద్ధంలో ప్రాణాలర్పించిన వీర సైనికుల అడ్రస్‌లు, ఫోన్ నెంబర్లు సేకరించి ఉత్తరాలు రాయడం ప్రారంభించాడు. "ఇప్పటికీ కొన్ని కుటుంబాలు తమ ఇంటి సభ్యుడిని పోగొట్టుకుని, ఆ నిజాన్ని జీర్ణించుకోలేక, అంధకారంలో బతుకుతున్నారని అంటాడు జితేంద్ర. దేశం కోసం ప్రాణాలర్పించిన ఆ వీర జవాన్ల కుటుంబాలకు కాస్తంత ఓదార్పు నివ్వడం మనందరి బాధ్యత కాదా?" అని ప్రశ్నిస్తున్నాడు. ఇప్పటికే మూడువేల ఉత్తరాల దాకా రాశాడు. అతని దగ్గర దాదాపు 20 వేల సైనికుల అడ్రస్‌లు ఉన్నాయి. ఈ కార్డులు రాయడానికి ఎవరి దగ్గరా పైసా తీసుకోడు. తన సొంత ఖర్చుతోనే వారికి కాస్తంత ఓదార్పునిస్తున్నాడు. కార్డులు అందుకున్న వారు కొంతమంది అతన్ని కలుసుకోవాలని ఉందని, మాట్లాడాలని ఉందని ఫోన్లు చేస్తుంటారని అంటున్నాడు జితేంద్ర. నేను బతికున్నంతవరకు కార్డులు రాస్తూనే ఉంటానని చెబుతున్నాడు. దేశ రక్షణకై ప్రాణాలర్పించిన వారి కుటుంబాల కోసం ఆలోచిస్తూ, వారికి కాస్తంత ఓదార్పు మాటలు చెబుతున్న జితేంద్రకు హ్యాట్సాఫ్ చెప్పాల్సిందే!+





## మెయిల్ బాక్స్

### కళ్ళనీళ్ళు రప్పించిన నాన్నకు ముద్దు

మొదటిపేజీ 'నాన్నకు ముద్దు' నన్ను చాలా కలచివేసింది. ఈ రోజుల్లో పిల్లలు మమ్మీ, డాడీ అని పిలుస్తూ తండ్రి ఒళ్లో కూర్చుంటున్నారు గానీ, మా టైమ్‌లో నాన్నగారండీ అని పిలిచే వాళ్ళం. అమ్మ దగ్గరున్న చనువు నాన్నగారి దగ్గర ఉండేది కాదు. ముద్దు సంగతి దేవుడెరుగు అసలు, పొరపాటున నాన్నగారిని ముట్టుకోనిచ్చేవాళ్ళు కాదు. మా పెళ్ళిళ్ళు జరిగాక ఎదుట నిలిచి మాట్లాడటం జరిగింది. అంతకు ముందంతా అమ్మ లేదా బామ్మ గారి సిఫార్సుతో చెప్పించేవాళ్ళం. నాన్నగారు పోయే ముందర 84 సంవత్సరాల వయసులో బాగా జ్వరం వచ్చిందని నుదుటిమీద చెయ్యి వేస్తే వద్దమ్మా అని ముట్టుకోనివ్వలేదు. నేను కూడా ఇలాగే నాన్నగారు పోయేక ఆయన మీద పడి ఏడ్చి ఇలాగే నుదుటిమీద ముద్దు పెట్టుకోవడం జరిగింది. అది గుర్తుకువచ్చి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి మొదటి పేజీ చదువుతుంటే.

*-లత కందికొండ, అశోక్‌నగర్, హైదరాబాద్-20*

### కాశీయాత్ర పెద్ద నవల కావాలి

కంఠుగాడి కాశీయాత్ర చాలా బాగుంది. నాలాగా కాశీ వెళ్ళలేని వారికి కళ్ళకు కట్టినట్టుగా రాస్తున్నారు. ఇది ఒక పెద్ద నవలగా రూపాంతరం చెందే అవకాశాలు ఉన్నాయి. రచయిత శర్మగారికి ధన్యవాదాలు.

*-విజయలక్ష్మి, హైదరాబాద్*

### అరణి రామాయణం ఓ మాస్టర్‌పీస్

అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్టు అతి సామాన్యులకు సైతం అర్థమయ్యేలా రామాయణం రాస్తున్నారు రచయిత అరణి. అమోఘం. నవ్య వీక్లీలో అరణి రామాయణం ఒక మాస్టర్ పీస్. కొరివితో తల గోక్కోవద్దంటూ విభీషణుడు చేసిన హిత వచనాల్ని ఆయన ధర్మనిరతి భవిష్యత్ దర్శనం చేసిన వైనంతోపాటు రావణుని మూర్ఖత్వాన్ని గురించి చేసిన వివరణ భేష్, భ్రేవో! శైలితో పాటు పదాల అల్లికల లిటరల్ బొనాంజా అదుర్స్! అరణికి అభినందన కుసుమాలు.

*-యు.చిట్టిబాబు, న్యూపాల్వంచ, ఖమ్మంజిల్లా*

### మధుబాబు గ్రేట్

సీరియల్స్ పోటీపడి చదివిస్తున్నాయి. డేర్‌డెవిల్ 26 భాగాలతో క్రైమ్ థ్రిల్లర్‌గా ఉంది. మధుబాబు గ్రేట్. బాచి కార్టూన్లు బాగున్నాయి. ఆదికవి వాల్మీకి ప్రణీతము ఆనాడు. అరణి రామాయణం ఈనాడు ఎంతో సరళం! వ్యర్థ పదం ఒక్కటంటే ఒక్కటి ఉంటే ఒట్టు. పద గారడీకి పదును పెట్టాలి. ఈజీగా ఉంటోంది.

*-బొడ్డపాటి రాజేశ్వరమూర్తి, చిలకలపూడి కృష్ణాజిల్లా*

### బామ్మలూ మీకు జోహార్లు

బామ్మలు మనవళ్ళనే మించిపోతున్నారని తెలియజేసింది సెలబ్రిటీ బామ్మల కథనం. క్యాన్సర్‌ను జయించడమే కాక తన స్నేహితురాలు పెట్టిన పరుగుపోటీలో విజేతలగా నిలిచి బహుమతి మొత్తాన్ని క్యాన్సర్ రోగుల సంక్షేమానికి ఉపయోగిస్తానని ప్రకటించిన హరిట్టీ థాంప్సన్, డాక్టర్ భక్తియాదవ్ త్యాగ గుణాల్లో తమకు ఎవరూ సాటిరారని నిరూపించుకున్నారు. ఎన్నికల్లో గెలిచి ప్రజాసేవలోనూ తమకు సాటి ఎవరూలేరని నిరూపించాలి. నూరేళ్ళ వయసులో అద్భుతాలు చేస్తున్న బామ్మల్ని చూసి నేటి యువత నేర్చుకోవాల్సింది ఎంతైనా ఉంది.

*-సరికొండ శ్రీనివాసరాజు, హైదరాబాద్*



తిరుపతిలో మే 1వ తేదీ జరిగిన సభలో 'కథా స్రవంతి'ని ఆవిష్కరించిన ఆంధ్రప్రదేశ్ ఉప సభాపతి మండలి బుద్ధప్రసాద్. ఆయనతోపాటు చిత్రంలో వల్లూరి శివప్రసాద్, పెనుగొండ లక్ష్మీనారాయణ తదితరులు ఉన్నారు.

## హెపటైటిస్ కట్టడి హోమియోతోనే సాధ్యం

**హెపటైటిస్** అనగానే అందరికీ హెపటైటిస్ బి గుర్తుకువస్తుంది. కానీ అదొక్కటే కాదు అందులో చాలా రకాలున్నాయి. హెపటైటిస్ అంటే కాలేయంలో కణాలు వాచిపోయి ఫైబ్రోసిస్, సిర్రోసిస్‌కు దారితీస్తుంది. దీంతో కాలేయ పనితీరు మెల్లగా తగ్గి ప్రాణాంతకంగా మారుతుంది. ఈ వ్యాధి వచ్చిన తర్వాత శాశ్వత పరిష్కారాన్ని చూపే చికిత్స ఇతర వైద్యవిధానాలలో లేదు. కానీ హోమియో వైద్యంలో అద్భుతమైన చికిత్స ఉంది.

**ఇవీ కారణాలు :** ఎక్కువ మందితో సెక్సువల్ కాంటాక్ట్స్ పెట్టుకోవడం, అపరిచితుల నుంచి సేకరించిన రక్తం అంటే హెపటైటిస్ వైరస్ ఉన్న రక్తాన్ని ఎక్కించడం, స్వలింగ సంపర్కం, ఒకరు వాడిన సిరంజీలు మరొకరు వాడటం వల్ల కూడా హెపటైటిస్ వచ్చే అవకాశం ఉంటుంది. తల్లి గర్భవతిగా ఉన్నపుడు ఈ వ్యాధి సోకినట్లయితే కడుపులోని బిడ్డకు కూడా సంక్రమించే అవకాశం ఉంటుంది.

**లక్షణాలు :** ఆకలి లేకపోవడం, వాంతి వస్తున్నట్లుగా ఉండటం, ఒళ్లంత నొప్పులు, మూత్రం పచ్చగా రావడం జరుగుతుంది. తరువాత నెమ్మదిగా కామెర్లు మొదలవుతాయి. దీంతో పాటు చర్మంపై దద్దుర్లు కనిపిస్తాయి. హెపటైటిస్ బి వ్యాధి చాలా ఆలస్యంగా బయటపడుతుంది. కొన్ని సందర్భాలలో సంవత్సరాల తర్వాత బయటపడవచ్చు. దీన్ని క్రానిక్ ఇన్‌ఫ్లమేషన్ ఆఫ్ లివర్ లేదా క్రానిక్ హెపటైటిస్ అంటారు. వీరిలో కామెర్ల వ్యాధి తగ్గకుండా అలాగే ఉంటుంది.

**హోమియో చికిత్స :** హెపటైటిస్ బి, సి వైరస్‌లు కాలేయంలో మల్టిపుల్ అయ్యే అవకాశం ఎక్కువగా ఉంటుంది. దీన్ని రెప్లికేషన్ అంటారు. ఈ రెప్లికేషన్ అయ్యే పద్ధతిని హోమియోపతి మందుల ద్వారా అడ్డుకోవచ్చు. అంతేకాకుండా పెరిగిన వైరల్ లోడ్‌ను రోగనిరోధక వ్యవస్థ ద్వారా సమర్థంగా అడ్డుకోవచ్చు.

## హెర్పిస్ సమస్య మళ్లీ కనిపించదు

**పురుషాంగంపై** వచ్చే నీటి పొక్కులను కొంత మంది నిర్లక్ష్యం చేస్తుంటారు. కాని వాటి వల్ల జరిగే నష్టం అంతా ఇంతా కాదు. దాంపత్య జీవితంపై దాని ప్రభావం పడటమే కాకుండా మానసికంగా కోలుకోలేని విధంగా చేస్తుంది. ఆ లైంగిక వ్యాధి పేరు హెర్పిస్.

ముందుగా పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలి ఎర్రగా పుండు పడుతుంది. ఇటువంటి సమయంలో తగు చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు. ఈ వ్యాధి తగ్గినట్లే తగ్గి రోగనిరోధక శక్తి తగ్గినపుడు మళ్లీ కనిపించవచ్చు. స్త్రీలలో కూడా యోని మీద చిన్న చిన్న పొక్కులలాగా వచ్చి ఎర్రగా మారి విపరీతమైన నొప్పి రావడానికి ఆస్కారం ఉంటుంది.

**వ్యాధి నిర్ధారణ :** హెపటైటిస్ వైరస్‌ను గుర్తించేందుకు హెచ్‌బీఎస్ ఏజీ అనే పరీక్ష , హెపటైటిస్ వైరల్ లోడ్, పీసీఆర్ టెస్ట్ వంటి పరీక్షలు వ్యాధి నిర్ధారణలో ఉపయోగపడతాయి. వ్యాధిని లక్షణాలను బట్టి గుర్తించవచ్చు.

**హోమియో చికిత్స**

హెర్పిస్ సింప్లెక్స్ వంటి లైంగిక వ్యాధుల నివారణకు హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది. హోమియో చికిత్స మూలకారణాన్ని తొలగించే విధంగా ఉంటుంది. సాధారణంగా హెర్పిస్ తగ్గినట్టే తగ్గి మళ్లీ వస్తుంది. అయితే హోమియో చికిత్స అనంతరం వ్యాధి మళ్లీ తిరగబెట్టడం ఉండదు. రోగనిరోధక వ్యవస్థను పెంచడం ద్వారా రోగనివారణకు సరియైన మార్గం ఏర్పడుతుంది. ఏమైనా అనుభవజ్ఞులైన హోమియో వైద్యుని దగ్గర చికిత్సతీసుకుంటే హెర్పిస్ వ్యాధిని సమూలంగా తరిమేయవచ్చు.

**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych), P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106



## ఆటిజంకు అద్భుతమైన వైద్యం

**మానసిక** ఎదుగుదల సక్రమంగా ఉన్నప్పుడే పిల్లల్లో సంపూర్ణ అభివృద్ధి కనిపిస్తుంది. అయితే కొందరు పిల్లల్లో మానసిక ఎదుగుదల లోపిస్తుంది. తోటి పిల్లలతో ఆడుకోలేకపోతారు. భాషాభివృద్ధి బాగా కుంటుపడుతుంది. తన తోటి పిల్లలతో ఆడుకోవాల్సిన దశలో ఒంటరిగా ఉండిపోతారు. శారీరకంగా ఆరోగ్యంగా ఉన్నట్లు కనిపించినా మానసిక లోపం కారణంగా తీవ్రమైన ఇబ్బందులు పడుతుంటారు. ఈ సమస్యను ఆటిజం అంటారు.

**లక్షణాలు ఇలా ఉంటాయి**

వస్తువులను పట్టుకోలేకపోతారు. ఒక చేతిలో నుంచి మరో చేతిలోకి వస్తువులను తీసుకోలేకపోతారు. ఆటిజం లక్షణాలు మొదటి మూడు సంవత్సరాల్లో బయటపడతాయి. కొందరిలో మాత్రం పుట్టినప్పటి నుంచి కనిపిస్తాయి. మరి కొందరిలో పుట్టినప్పుడు బాగానే ఉన్నా 18నుంచి 36 నెలల కాలంలో ఆకస్మాత్తుగా లక్షణాలు బయటపడతాయి. తమ వయస్సు వారితో స్నేహం చేయలేకపోతారు. తమ ఆసక్తులను ఇతరులతో పంచుకోలేరు. ఇతరుల ఫీలింగ్స్ అర్థం చేసుకోలేకపోతారు.

**హోమియో చికిత్స**

మానసిక ఎదుగుదల సక్రమంగా లేని పిల్లలకు హోమియో చికిత్స ఇప్పించడం ద్వారా ఎదుగుదల సక్రమంగా జరిగేలా చేసే అవకాశం ఉంది. ఆటిజంతో బాధపడుతున్న పిల్లలను వదిలేయకుండా హోమియో వైద్యుల దగ్గరకు తీసుకెళ్లి చికిత్స ఇప్పించడం ద్వారా ఆరోగ్యవంతమైన జీవితం గడిపేలా చేయవచ్చు. పిల్లల బిహేవియర్‌లో మార్పులు తీసుకువచ్చి ఏకాగ్రత నిలిపేలా చేయడంలో హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది. మెదడులో రసాయన సమతుల్యత నిలిచేలా చేయడంలో హోమియో మందులు బాగా పనిచేస్తాయి. అయితే పిల్లలను తొలిదశలోనే గుర్తించి చికిత్స ఇప్పించడం అవసరం.

## సంతానలేమికి చక్కని పరిష్కారం

**దంపతులు** ఎటువంటి గర్భనిరోధక పద్ధతులు పాటించకుండా ఏడాది కాలంగా శృంగారంలో పాల్గొంటున్నప్పటికీ సంతానం కలగనట్లయితే సంతానలేమి ఉన్నట్లుగా భావించాలి.

**శుక్రకణాల లోపం :** శుక్రకణాలు ఉత్పత్తి అవుతుంటాయి. కానీ తక్కువ సంఖ్యలో, అబ్‌నార్మల్‌గా ఉంటాయి. దీన్ని అలిగోస్పెర్మియా అంటారు. శుక్రకణాలు ఉత్పత్తి లేకపోవడాన్ని అజూస్పెర్మియా అంటారు.

**వెరికోసిల్ :** వెరికోసిల్ సమస్య ఉన్న పురుషుల్లో సంతానలేమి సమస్య కనిపిస్తుంది. బీజాలపై నరాలు ఉబ్బి కనిపిస్తుంటాయి.

**రెట్రోగ్రేడ్ ఎజాక్యులేషన్ :** శృంగారంలో పాల్గొన్నప్పుడు వీర్యం బయటకు రాకుండా వెనక్కి వెళ్లిపోతుంది. అంటే బ్లాడర్‌లోకి వెళుతుంది.

**హార్మోన్స్ :** పిట్యూటరీ గ్రంధి నుంచి ఉత్పత్తి అయ్యే హార్మోన్స్ చాలా తక్కువ ఉన్నట్లయితే వీర్యకణాల ఉత్పత్తి తగ్గిపోతుంది.

**జెనెటిక్స్ :** క్రోమోజోముల సంఖ్యలో తేడా ఉండటం వంటివి కూడా సంతానలేమికి కారణమవుతాయి.

**మందులు :** కొన్ని రకాల మందులు శుక్రకణాల ఉత్పత్తిపై, పనితీరుపై ప్రభావం చూపెడుతాయి. అంగస్తంభనలు తగ్గడానికి కారణమవుతాయి.

**నిర్ధారణ ఎలా?:** సెమన్ అనాలసిస్ పురుషుల్లో సంతానలేమి నిర్ధారణ కోసం చక్కగా ఉపయోగపడుతుంది. ఇందులో వీర్యకణాల సంఖ్య, వాటి కదలికలు, ఆకృతి తెలుసుకోవచ్చు.

**చికిత్స ఎలా ఉంటుంది?:** సంతానలేమికి కచ్చితమైన కారణం తెలుసుకుని చికిత్స అందిస్తే సంతానసాఫల్యం తప్పక కలుగుతుంది. వీర్యకణాల లోపం ఉంటే హోమియో మందులు తీసుకోవడం ద్వారా వీర్యపుష్టి కలుగుతుంది. వీర్యకణాల కదలికలు పెరుగుతాయి. హార్మోన్ల సమస్యలు సైతం హోమియో చికిత్సతో తొలగిపోతాయి. అంగస్తంభనలు లేకపోవడం వంటి సమస్యను హోమియో మందులు దూరం చేస్తాయి.

ADVT

## నవ్య వీక్లి - నాటా సంయుక్తంగా నిర్వహించిన

# కథలు కవితల పోటీ ఫలితాలు

నవ్యవీక్లి-నాటా సంయుక్తంగా నిర్వహించిన 10 కథలు, 20 కవితల పోటీకి అనూహ్యంగా రచయితలూ, కవులూ స్పందించారు. వర్ధమాన రచయితలూ కవులతో పాటు లబ్ధప్రతిష్టులైన వారు కూడా ఈ పోటీలో ఉత్సాహంగా పాల్గొన్నారు. వీటిని నవ్య సంపాదకవర్గంతో పాటు ముగ్గురు ప్రముఖ రచయితలూ, ముగ్గురు ప్రముఖ కవులూ న్యాయనిర్ణేతలుగా వ్యవహరించి చదివారు. బహుమతి కథలనూ, కవితలనూ ఎంపిక చేశారు. కథకు రూ. 10,000 చొప్పున 10 కథలకు లక్షరూపాయలు బహుమతిగా చెల్లించాలి. అయితే ఆ స్థాయి కథలు రానందున ఆ మొత్తాన్ని కథకు రూ. 5000 చొప్పున 20 కథలకు అందజేయడం జరిగింది. బహుమతి కథలతో పాటు సాధారణ ప్రచురణకు 118 కథలు ఎంపిక చేశారు. సాధారణ ప్రచురణకు కవితలను స్వీకరించలేదు. ఈ కథలూ, కవితలూ వీలువెంబడి నవ్యవీక్లిలో ప్రచురితమవుతాయి. వీటి ప్రచురణ గురించి ఉత్తర ప్రత్యుత్తరాలకు తావు లేదు. విజేతలైన రచయితలకూ, కవులకూ అభినందనలు. పోటీలో పాల్గొన్న వారందరికీ ధన్యవాదాలు.

-సంపాదకుడు

## రూ. 5,000 బహుమతి పొందిన కథలు

1. జస్ట్‌లాజిక్ - శ్రీధర
2. సిజరింగు - నక్కావిజయ రామరాజు
3. మాతృత్వం ఒక చేదుజ్ఞాపకం - జియోలక్ష్మణ్
4. నాతిచరామి - గొర్లి శ్రీనివాసరావు
5. మంచుతల్పం - సలీం
6. మీల్స్‌టికెట్ - ప్రభాకర్ జైని
7. ప్రేమా! నీ పేరే అమ్మ - మన్నెం శారద
8. పిచ్చుక్క - శరత్‌చంద్ర
9. సమాంతర రేఖలు - సి.ఎస్.రాంబాబు
10. మనసిస్తే - ఎం.వెంకటేశ్వరరావు
11. గోచర - సింహప్రసాద్
12. కరదీపికలు - కన్నెగంటి అనసూయ
13. ప్రశ్నార్థకాలు - అరిపిరాల సత్యప్రసాద్
14. మరింత జీవనం - వి.రాజారామమోహనరావు
15. ఈశ్వరానుగ్రహం - పొత్తూరి విజయలక్ష్మి
16. మాధవసేవ - ఎమ్వీ రామిరెడ్డి
17. ఆ ఇంట్లో ఒకరోజు - సాయి బ్రహ్మానందం గొర్తి
18. నీ ఆశయాల నీడలో - గుమ్మడి రవీంద్రనాథ్
19. మా ఊరి మట్టివాసన - మల్లాది రవిశంకర్
20. ఆత్మావలోకనం - శ్రీమతి సోమంచి వాగ్దేవి

## రూ. 1,000 బహుమతి పొందిన కవితలు

1. ఒక రోజు - చలపాక ప్రకాష్
2. హోప్.... ఒక మెలకువ - ఆవాల శారద
3. అక్షరాల్లేని పుస్తకం - ఈతకోట సుబ్బారావు
4. చెట్టు వీలునామా - విపంచి
5. ఆనవాలు - సిరికి స్వామినాయుడు
6. కవిత్వమై - మందరపు హైమావతి
7. అంతర్వాహిక - మానాపురం రాజాచంద్రశేఖర్
8. నేర్చుకోవాలనుకున్నప్పుడల్లా వీధి అరుగుపై - పి.అమరజ్యోతి
9. చెడబుట్టినాళ్ళను నరికేస్తా! కడుపుకోత కోర్చుకుంటా - రావులపాటి వెంకట రామారావు
10. నిరంతరం... అనంతం - రామా చంద్రమౌళి
11. సముద్రంలో రాత్రి - ర్యాలి ప్రసాద్
12. ప్రకృతి ప్రసాదించిన వరాలు - దూసి శ్రీరామమూర్తి
13. చిరునవ్వుల సంచిక - ఎస్.సుమిత్రాదేవి
14. దారి తప్పిపోయింది - నారాయణమూర్తి తాతా
15. పన్నగపు దోమతెర - బదరీనాథ్ జి.యస్.
16. అతడు... నా 'స్వ' యాసిస్సు - స్వర్ణ
17. కవలలు - ఎల్.ఆర్.స్వామి
18. మధ్యాహ్నం వచ్చిన వాన - ఎ.వి.రెడ్డి శాస్త్రి
19. నిశ్శబ్దం - చందుపట్ల రమణకుమార్‌రెడ్డి
20. మనిషిని మనిషిలా చూస్తే మహోదయమే- - హైమవతీ సత్య

# సాధారణ ప్రచురణకు ఎన్నికైన కథలు

1. చీకటి శాపం - మంత్రవాది మహేశ్వర్
2. (అ)క్రమ బంధం - ఆదోని బాషా
3. ప్రాణి - సర్వజిత్
4. శవం దారుణ హత్య - మొలుగు కమలాకాంత్
5. గోమాత వచ్చిందమ్మా - అలపర్తి రామకృష్ణ
6. దుమ్ము - అలపర్తి రామకృష్ణ
7. వేళ్ళు - బి.వి.ఎస్. ప్రసాద్
8. కొత్త పరిమళం - కాండ్రేగుల శ్రీనివాసరావు
9. గోవుదారి - దాట్ల దేవదానం రాజు
10. గోదావరి పిలుస్తోంది - దాట్ల దేవదానం రాజు
11. కొత్తదారి - అనంత పద్మనాభరావు మోచర్ల
12. సగటు మనిషి - అంగర వెంకట శివప్రసాదరావు
13. మాతృదేవోభవ - ఇంద్రగంటి నరసింహమూర్తి
14. ప్రియమైన మిత్రుడికి ప్రేమతో - డాక్టర్ ఎం.సుగుణరావు
15. అందుకే అలా చేసా - వారణాసి ప్రసాదరావు
16. పది దీపాలు - జీవిత
17. విపులాచ పృథ్వీ - నందిరాజు పద్మలతా జయరాం
18. స్వరాజ్యం - సింహప్రసాద్
19. స్వార్థం లేని సేవ - శ్రీమతి ప్రభా సుబ్బారావు
20. వెయ్యిరూపాయలనోటు - రంగారావు పెయ్యేటి
21. ప్రాణం చెట్టు - ఈతకోట సుబ్బారావు
22. తెలివంటే నాదే...: - చింతా జగన్నాథరావు
23. పిచ్చి డాక్టరమ్మ - డా. చెళ్లపిళ్ల సూర్యలక్ష్మి
24. ఏరు దాటాక - విరించి
25. పరిభ్రమణం - దాసరి శిరీష
26. శతమానంభవతి - శారదా అశోకవర్ధన్
27, సుబ్బరాజు మళ్ళీ వచ్చేరు - శివ్రాజు
28. నింద - పెద్దింటి అశోక్‌కుమార్
29. నీకోసమె నే జీవించునది - జి.ఎస్.లక్ష్మి
30. ఓ తండ్రి వ్యధ! - పెబ్బిలి హైమావతి
31. సొంత ఇల్లొక మమతల వల్లరి - అరిగే రామారావు
32.. డార్లింగ్ ఫోనెత్తు - ఆదెళ్ళ శివకుమార్
33. ఇలాక్కూడా జరుగుతుందా - వి.వి.కూర్మారావు
34. ఇటువంటివాళ్ళు కూడ ఉంటారా - దూరి వెంకటరావు
35. వరద - సరికొండ రవీంద్రనాథ్
36. కుటుంబావధానం - వారణాసి రాహుల్
37. సర్వే జనాం సుఖినోభవంతు - పోలాప్రగడ జనార్దన రావు (జెన్ని)
38. తొలిశ్వాస - జయంతి వెంకటరమణ

39 నిష్ణాతుడు - పి.ఎస్.నారాయణ
40. పాత సామాను - పినిశెట్టి శ్రీనివాసరావు
41. ఓ అమ్మ కథ - శ్రీదేవి పెయ్యేటి
42. పూలబ్బాయి - అనపర్తి సీతారామ్
43. నాన్నమ్మకు ప్రేమతో - శ్రీమతి పి.వి.శేషారత్నం
44. ఈ రోగానికి మందులేదు- ప్రఫుల్ల చంద్ర
45. స్వామి కార్యం - మేడా మస్తాన్‌రెడ్డి
46. అయినవాళ్ళు - ప్రతాప రవిశంకర్
47. సాధ్యమా - లక్ష్మీరాఘవ
48. నిరీక్షణ - జియోలక్ష్మణ్
49. వ్యక్తిత్వం - దర్భా పట్టాభి
50. జ్యోతి ఎక్కడ? - విహారి
51. ఈ తరం అమ్మాయి - చంప
52.. రోల్‌మోడల్స్ - పి.వి.డి.ఎస్.ప్రకాష్
53. సిసలైన ప్రేమకై - అంబల్ల జనార్దన్
54. కళారంజని - గరిమెళ్ళ నాగేశ్వరరావు
55. సెలక్షన్ - మణి వడ్లమాని
56. టిట్‌ఫర్ టాట్ - ఎం.సూర్యప్రసాదరావు
57. దిశమార్చిన ప్రత్యూష పవనం - అత్తలూరి విజయలక్ష్మి
58. బహుమతి - పుట్టగంటి గోపీకృష్ణ
59. చదివినోడి కన్న.... - డా.ఎం.పురుషోత్తమాచార్య
60. తాప-త్రయం - భీమరాజు వెంకట రమణ
61. అమ్మతనం - అనూరాధ (గంటి సుజల)
62. సీతమ్మపాదం - వాణిశ్రీ
63. అమ్మ దొరికింది - కె.బి.కృష్ణ
64. ఎందుకో... - వేద మయూరం
65. గత్తరు చిత్రం - వారాల కృష్ణమూర్తి
66. పరిపూర్ణం - తటవర్తి నాగేశ్వరి
67. శ్రీకాంత వాసము - ఐతా చంద్రయ్య
68. మాయమై పోలేదు - డా. కె.మీరాబాయి
69. పిచ్చుకమ్మ విలాపం - ముసునూరి సుబ్బయ్యచౌదరి
70. ధరణి - కొమరగిరి అనంత ప్రమీలా రాణి
71. పిల్లర్ - కె.రాజేశ్వరి
72. అరుగుల బడి - గోగినేని మణి
73. చదివించిరి నను గురువులు - తులసి బాలకృష్ణ
74. సాక్షి - సి.యమున
75 ప్రశ్నే సమాధానం - బోడపాటి రమేష్
76. అనవతరం - శైలజా మిత్ర
77. ప్రయాణంలో పదనిసలు - ఆనంద్‌రావ్ పట్నాయక్
78. మనసా వాచా - వాలి హిరణ్మయీదేవి
79. జీవన సంధ్య - షేక్ అహమద్ బాష

80. నీలితెర - సన్నిహిత్
81. ఆత్మీయ వైద్యం - రాచమళ్ళ ఉపేందర్
82. మాంగల్యం తంతు నానేన - దేవరకొండ గంగాధర రామారావు
83. పుండు - వెల్దండి శ్రీధర్
84 నిధి చాలా సుఖమా?!? - పారుపూడి వెంకట సత్యనారాయణ
85. నాగి - గంధం యాజ్ఞవల్క్యశర్మ
86. గెలుపెవరిది - సోమవరపుల నాగేంద్రప్రసాద్
87. పునాది - శ్రీమతి రాఘవ. టి
88. ఎందుకంటే - తుల్లి రాజగోపాల్
89 కార్చిచ్చుపై కన్నీటివాన - వి-రాగి
90. మ్రొక్కు - జొన్నలగడ్డ రామలక్ష్మి
91. పాపాలే శత్రువులు - కె.కె.రఘునందన
92. పార్వతీశం గారడీ-రామనాధం పేరడీ - కొల్లిపర హితేష్
93 ఒక చిన్నోడి దుఃఖం - చొప్పదండి సుధాకర్
94. చిదంబర రహస్యం - ఆకెళ్ల వెంకట సుబ్బలక్ష్మి
95. అసలైన కొడుకు - తటవర్తి నాగేశ్వరి
96. పాప నవ్వింది - శ్రీమతి డేగల అనితాసూరి
97. పంతులుగారి మేడ - ఎల్.ఆర్.స్వామి
98. వేకువ - మీనాక్షీ శ్రీనివాస్
99. అంతర్వాహిని - శ్రీమతి కె. వాసవదత్త రమణ
100 ఎగిరిపోతే ఏం బాగోదు - యన్.కె. నాగేశ్వరరావు
101 అమ్మ - శీరం నారాయణస్వామి
102. ఆనందరావు మూతి - ప్రతాప వెంకట సుబ్బారాయుడు
103. పరిపూర్ణం - ఎనుగంటి వేణుగోపాల్
104. నాన్నారికి.... ప్రేమతో - సి. సీతారామమోహనరావు
105. నడుస్తున్న నాలుగో తరం - నందుల వెంకటేశ్వరరావు
106. బిందువులో సింధువు - కె.జె.ఎస్.రామారెడ్డి
107. పరిష్కారం - చాడా వెంకట శాస్త్రి
108. పోలీసు మామయ్య - రాచపూటి రమేష్
109. బొమ్మ చెప్పిన జోస్యం - శ్రీ ఉదయిని
110. నాన్నకు ప్రేమతో - భమిడిపాటి గౌరీశంకర్
111. అ'నైతికం' - పి.చంద్రశేఖర ఆ.జాద్
112. అనగనగా కథ కాదు ఇది - డా. గురజాడ శోభా పేరిందేవి
113. మానస వీణ మధుగీతం- పి.వి. భగవతి
114. మట్టి - జాస్తి రమాదేవి
115 సేద్యం-వైద్యం-నైవేద్యం- ఎన్.తారకరామారావు
116. వైకల్యం - మెట్టు మురళీధర్
117. కోల్పోయిన జీవితం - యలమర్తి అనురాధ
118. థేమ్స్‌వొద్దు-గోదావరే ముద్దు-డి.ఆర్.ఇంద్ర

# ఈశ్వరానుగ్రహం

పొత్తూరి విజయలక్ష్మి

**"పురాణ కాలక్షేపమా? ఏవిటి కిషోర్ మీరనేది? ఈ రోజుల్లో అవన్నీ ఎవరు వింటారు? ఆశ్చర్యంగా ప్రశ్నించాడు శ్రీకాంత్.**

**"విన్నవాళ్ళే వింటారు. వచ్చిన వాళ్ళే వస్తారు. అయినా నేనేం దసరా నవరాత్రుల్లోనో, పండగ రోజుల్లోనో, న్యూ ఇయర్ డే రోజునో పెట్టమనడం లేదుగా. అందరం ఖాళీగానే ఉన్నాం. ఆయన మళ్ళీ మళ్ళీ రారుగా! అందుకే ఇప్పుడే పెడదాం?" కిషోర్ కంఠంలో ఏదో పట్టుదల.**

అది గ్రహించాడు శ్రీకాంత్. కిషోర్ చాలా నెమ్మదైనవాడు. ఎవరి జోలికీ వెళ్ళడు. తనేమో తన లెవలేమో. అంతేకాదు. గత మూడేళ్లుగా ఈ అసోసియేషన్‌లో ట్రెజరర్‌గా పని చేస్తున్నవాడు. అతను అడిగితే కాదనడానికి మనసొప్పడం లేదు. అలా అని సరే అనేస్తే అవతల తను పదిమందికి సమాధానం చెప్పుకోవాలి. ఇబ్బందిగా ఉంది పరిస్థితి.

కిషోర్ పట్టుపడుతున్నాడంటే ఏదో కారణం ఉండే ఉంటుంది. అదేవిటో తెలిస్తే తన పని సులువు అవుతుంది. అందుకే అతన్నే అడిగేశాడు.

'ఏమిటి విషయం? హఠాత్తుగా ఈ నిర్ణయం తీసుకున్నారంటే ఏదో కారణం ఉండే ఉంటుంది. మీకు అభ్యంతరం లేకపోతే చెప్పండి" అన్నాడు ఆదరంగా.

కిషోర్ ఇబ్బందిగా కదిలాడు. తన ఆలోచనలు, తను చేసే పనులు ఎంతోమందికి హాస్యాస్పదంగా ఉంటాయి. పరాయి వాళ్ళెందుకు, భార్యే ఎగతాళి చేస్తుంది! చాదస్తం మనిషి మీరు. ఎప్పుడో రాతి యుగంలో పుట్టాల్సిన మనిషి పొరబాటున ఇప్పుడు పుట్టేశారంటూనే ఉంటుంది.

సంసారం సామరస్యంగా సాగాలంటే సర్దుకు పోవటం తప్పనిసరి కాబట్టి అటు భార్యకిష్టమైన రీతిలో నడుచుకుంటూనే కొంతసమయం తన కోసం తన సంతోషం కోసం కేటాయించుకుంటాడు. తనకు నచ్చిన పనులు చేసి ఆనందం, తృప్తి పొందుతాడు.

అందులో భాగమే ఇప్పుడీ ప్రయత్నం. నెల రోజుల కిందట చిన్ననాటి స్నేహితుడు ఇల్లు కట్టుకుని గృహ ప్రవేశం నువ్వు వస్తేగానీ వీల్లేదంటే, కుటుంబ సమేతంగా కలకత్తా నించి విజయవాడ వెళ్లాడు. ఫంక్షన్ అయిపోయింది. మర్నాడు భార్య మంగళగిరికి వెళ్ళి చీరలు కొనుక్కోవాలని ప్రోగ్రాం వేసింది. పొద్దున్నే వెళ్ళి మధ్యాహ్నానికి రావొచ్చంది.

నువ్వు వెళ్ళు, నేను రాను అన్నాడు. ఈ మనిషిని తీసుకుని షాపింగ్‌కి వెళ్ళేకంటే ఒంటరిగా వెళ్ళడమే సుఖం అని ఆవిడ వెళ్ళిపోయింది.



ఫ్రెండ్ నడిగి తను ఒక టాక్సీ తెప్పించుకున్నాడు. ఎక్కడికి వెళ్తారు సార్ అని అడిగాడు డ్రైవరు. 'క్రిష్ణాతీరం వెంట ఎక్కువ జనం లేని చోట్లకి తీసుకువెళ్ళు. చీకటి పడేదాకా తిప్పి తీసుకురా. నీ ఇష్టం ఎక్కడికి తీసికెళ్తావో మరి!" అనేసి కారెక్కాడు. డ్రైవర్ తలూపి కారు స్టార్ట్ చేశాడు. ఊరు దాటి చిన్న చిన్న ఊళ్ళల్లోంచి సాగింది వారి ప్రయాణం. క్రిష్ణానదిని పలకరిస్తూ సాగుతోంది.

మార్గశిరమాసం ప్రారంభం. వాతావరణం ఆహ్లాదంగా ఉంది. పంట చేలు కోతలకి వచ్చి ఉన్నాయి. కిషోర్ మనసు గాల్లో తేలిపోతోంది. మధ్యలో ఓ చిన్న ఊళ్ళో ఆపి పాక హోటల్లో మినపట్టు తిని కాఫీ తాగాడు. రోడ్డు పక్కనే ఉన్న చెరువులో పిల్లలు ఈతకొడుతుంటే ఆపి దిగాడు.

వాళ్ళు, సార్! మీరు డబ్బులిస్తే తామరపూలు తెచ్చి ఇస్తాం అంటే అలాగే అన్నాడు. వాళ్ళు పోటీలు పడి కోసుకొస్తే వద్దనకుండా అన్నీ కొన్నాడు.

పదకొండు గంటలు దాటుతుండగా ఒక చిన్న ఊరు. అంతదూరాన క్రిష్ణమ్మ. ఆ ఒడ్డునే ఒక ఆలయం కనిపించింది.

అదేం గుడి? అని అడిగాడు. 'నేనూ ఎప్పుడూ వెళ్ళలేదు సార్. శివాలయమో, రామాలయమో అయి ఉంటుంది అన్నాడు డ్రైవర్. 'గుడి తీసుంటుందా?' మరో ప్రశ్న వేశాడు.

'ఏమో సార్, మూసేశారేమో. వెళ్ళి చూద్దామా?' అన్నాడు డ్రైవర్.

'పద వెళ్దాం' అన్నాడు కిషోర్. కారు అటు మళ్ళింది.

గుడి దాకా రోడ్డు ఉంది. తారు రోడ్డు కాకపోయినా బాగానే ఉంది. అర కిలోమీటరు దూరంలో ఉంది క్రిష్ణానది. రేవు గుడి పక్కనే ఉన్న నీళ్ళు మాత్రం అంతదూరాన పారుతున్నాయి. గుడి చిన్నదే. ఇటీవలే తెల్లసున్నం కొట్టించినట్టుంది. గుడి ముందు తెల్ల పెయింటుతో ముగ్గులు వేసి ఉన్నాయి. చిన్న నందీశ్వరుడి విగ్రహం. ఇది శివాలయం అని తెలియజేస్తోంది.

అక్కడే గుడి వాకిలి దగ్గర కూర్చుని ఏదో చదువుకుంటున్న పూజారి వీళ్ళని చూసి ఆశ్చర్యపోయాడు. ఆ వెంటనే ఆయన ముఖంలో ఆనందం.

# నవ్యవీక్లి- నాటా సంయుక్త నిర్వహణలో బహుమతి పొందిన కథ

'రండి బాబూ రండి' అంటూ లేచి ఉత్తరీయం భుజాన వేసుకున్నాడు.

'ఏం ఆలయం పూజారి గారూ?' అని అడిగాడు కిషోర్.

'అన్నపూర్ణా సమేత కాశీ విశ్వేశ్వరాలయం. చాలా మహిమ గల స్వామి. కోరిన తడవుగానే భక్తుల కోరికలు తీర్చే స్వామి. అర్చన చేయించమంటారా?' అని అడిగాడు. సంకోచించాడు కిషోర్.

'కొబ్బరికాయ, పూజ సామాగ్రి ఏమీ తేలేదు' అన్నాడు.

'ఫర్వాలేదు. చేయించమంటే చేయిస్తాను' అన్నాడు పూజారి. తను దారిలో కొన్న తామరపూలు ఇచ్చి అర్చన చేయించాడు. పళ్ళెంలో యాభై రూపాయల నోటు వేశాడు. ఆ నోటును భద్రంగా అక్కడే ఉన్న హుండీలో వేశాడు పూజారి. మీకు తొందర పనులేమీ లేకపోతే స్థల పురాణం వింటారా బాబూ!" ఆశగా అడిగాడు.

భార్య వెంట ఉంటే చీవాట్లు పెట్టేదే. ప్రస్తుతం ఆ బాధ లేదు కాబట్టి సరే అన్నాడు. అతనికి అటువంటివి ఇష్టమే. చెప్పండి అన్నాడు స్థిమితంగా రాతి స్థంభానికి ఆనుకుని కూర్చుని.

పూర్వం త్రేతాయుగంలో రామచంద్రుల వారు సీతాన్వేషణ చేస్తూ ఈ ప్రాంతానికి వచ్చారట. దుఃఖంతో మునిగి ఉన్న ఆ స్వామిని చూసిన శివుని మనసు ద్రవించిపోయిందట. మానవ రూపంలో వచ్చి ఈ పవిత్ర క్షేత్రంలో శివుని ప్రతిష్ఠ చేసినట్లైతే నీ బాధలు తీరుతాయని సెలవిచ్చారట, అంటూ స్థల పురాణం చెప్పాడాయన. శ్రద్ధగా విన్నాడు కిషోర్. జేబులోనించి యాభై రూపాయలు తీసి ఆయనకి ఇచ్చాడు. శ్రద్ధగా అందుకుని కిషోర్‌ని ఆశీర్వదించాడు.

సరే అనక తప్పలేదు కిషోర్‌కి.

పూజారి గారింటికి చేరారు. మంచినీళ్ళు ఇచ్చి వంట ప్రయత్నం ప్రారంభించింది ఆయన ఇల్లాలు. వరండాలో నవారు మంచం వాల్చి కూచోబెట్టాడు. పక్కనే అరుగుమీద కూర్చున్నాడు. బోలెడన్ని కబుర్లు చెప్పుకున్నారు. పూజారి పేరు కాశీపతి.

తన జీవితం గురించి వివరంగా చెప్పాడాయన. తాత తండ్రి కూడా ఆ గుళ్ళోనే అర్చకులుగా పని చేశారు. కాశీపతికి ఒక కొడుకు. ఒక కూతురు. కొడుకుని ఈ వృత్తిలోకి దింపటం ఇష్టం లేక హైదరాబాద్ పంపించాడు. అక్కడ చిన్న ఉద్యోగం చేసుకుంటూ ఇక స్థిరపడతాడనుకుంటున్న సమయంలో అనారోగ్యం పాలై చనిపోయాడు.

కూతురు కొడుకు కంటే పెద్దది. పెళ్ళి చేశాడు. అల్లుడు గాలి వాటం మనిషి. దురలవాట్లు. కొంత కాలం సంసారం వెలగబెట్టి భార్యని నాలుగేళ్ళ కొడుకుని వదిలేసి ఎటో వెళ్ళిపోయాడు. ఓ ఏడాది పాటు వెతికించి ఇక వెతకలేక వదిలేశాడు. ఉన్నాడో పోయాడో తెలియదు. కూతురు గుంటూరులో ఉంటుంది. వంట పనులు చేసుకుంటూ పొట్టపోసుకుంటోంది. మనవడిని అక్కడికి దగ్గర్లోనే ఉన్న వేద పాఠశాలలో చేర్పించారు. విద్య, వసతి, భోజనం అన్నీ ఉచితమే అక్కడ. అంతా విని 'మరి మీకు జీవనం ఎలా? జీతం గానీ వృద్ధాప్య పెన్షన్‌గానీ వస్తాయా?' అని అడిగాడు కిషోర్.

ఏమీరావు. ఏవిటో ఇస్తాం ఇస్తాం అంటారు. ఆ కాయితం తీసుకురా. ఈ ధృవీకరణ పత్రం తీసుకురా అని సవాలక్ష ఆంక్షలు. ఆఫీసుల చుట్టూ తిరిగి తిరిగి విసిగిపోయి మానేశాను. ఉన్నది మేమిద్దరం. ఇక్కడ ఏడాదంతా ఏమీ ఉండదు

అప్పుడు గుడిలో పూజలు నిర్వహించిన కుర్రాడు మానవ ధర్మంగా నాకు ఏదో ముట్టచెప్పాడుగానీ అదే మూలకి? సరే ఏం చేస్తాం? అంతా ఈశ్వరేచ్ఛ.

ఏదో విధంగా కాలం గడుపుతున్నాం. అమ్మాయి ఆదుకుంటుంది. 'చెప్తుండగానే "వంటయింది. కాళ్ళు కడుక్కోండి. వడ్డిస్తున్నాను" అంది ఆయన భార్య. మాట్లాడుకుంటూనే భోజనం చేశారు. దొడ్లో పాదుకు కాసిన వంకాయ కూర, చింతకాయ పచ్చడి, చారు, మజ్జిగ.

చిన్నతనంలో అమ్మమ్మ ఇంట్లో తిన్న భోజనం గుర్తొచ్చింది కిషోర్‌కి. తృప్తిగా భోజనం చేశాడు.



'మీరెక్కడ ఉంటారు?' అని అడిగాడు. చెప్పాడు కిషోర్. ఇక వెళ్ళొస్తాం అన్నాడు. గుడి మూసేసి నేనూ వెళ్తాను అన్నాడు పూజారి.

"ఊళ్ళో దాకా దిగబెడతాం రండి" అన్నాడు కిషోర్. కారెక్కాడాయన.

'భోజనాల వేళ అవుతోంది. మీ భోజనం విషయం ఏమిటి? అని అడిగాడు.

'ఎక్కడో దార్లో తినేస్తాం' అన్నాడు కిషోర్. 'ఇక్కడెక్కడా ఏమీ దొరకవు. మీకు అభ్యంతరం లేకపోతే మా ఇంట్లో భోజనం చెయ్యండి" అన్నాడు పూజారి. డ్రైవర్ కూడా ఆయన్నే బలపరిచాడు. దగ్గర్లో ఏమీ బాగుండదు. మీరు తినలేరు అన్నాడు.

గానీ కార్తీకమాసంలో బాగా జనం వస్తారు. క్రిష్ణానదిలో స్నానం చేసి దేవుడికి అభిషేకాలు చేయించుకుంటారు. ఆ నెల రోజులూ వచ్చిన దక్షిణ, గ్రాసంతో ఏడాది గడిచిపోతుంది.

కానీ ఈ ఏడాది అనుకోకుండా అవాంతరాలు వచ్చాయి. కార్తీకమాసం మొదలవగానే మా దాయాది ఒకరు పోయారు. సూతకం. పనికి రాదు. గుంటూరు కబురు పెడితే మా అమ్మాయి వేరే అతణ్ణి పంపించింది. శుద్ధి స్నానం అయిన రెండ్రోజులకే మా తమ్ముడి కోడలు ప్రసవించింది. పురిటి పట్టింపు. పనికి రాదు. కార్తీకమాసంలో అలా జరగటం పెద్ద దెబ్బ.

డ్రైవర్‌కి కూడా వరండాలో వడ్డించింది ఆవిడ.

తినగానే ఏం వెళ్తారు? కాసేపు విశ్రాంతి తీసుకోండి అని మంచం మీద దుప్పటి పరిచాడు. నడుం వాల్చాడు కిషోర్. వెంటనే నిద్ర పట్టింది. ఒక గంట తర్వాత డ్రైవర్ నిద్ర లేపాడు. కాశీపతి కాఫీ తాగి వెళ్ళండి అన్నాడు. ఫర్వాలేదు దారిలో ఎక్కడైనా తాగుతాం అన్నాడు కిషోర్.

భోజనానికి వాళ్ళకి ఏమైనా ఇవ్వాలా వద్దా అని మధన పడ్డాడు. ధైర్యంచేసి పర్సులో నుంచి డబ్బు తీసి ఇవ్వబోతే ఆయన చేతులు జోడించాడు' వద్దు బాబు! ఇబ్బందులున్నాయి. కానీ అతిథికి అన్నం పెట్టి డబ్బు తీసుకునేంత కష్టంలో లేను" అన్నాడు. వెంటనే చెయ్యి వెనక్కి తీసుకున్నాడు కిషోర్.

'మీ రుణం తీర్చుకోలేం అన్నాడు. నేను చెప్పింది గుర్తుందిగా. అవసరం అయితే ఫోన్ చేస్తాను' అన్నాడు కాశీపతి.

'అలాగే తప్పకుండా. నా ఫోన్ నంబర్ జాగ్రత్తగా పెట్టుకున్నారుగా?' అన్నాడు కిషోర్. అక్కడి నించి బయలుదేరి మరో మార్గం మీదుగా విజయవాడ చేరాడు. మర్నాడు కలకత్తా వచ్చేశాడు. తన రొటీన్‌లో పడిపోయాడు.

హఠాత్తుగా ఒకరోజు మధ్యాహ్నం ఫోనొచ్చింది. 'అయ్యా నేను కాశీపతిని' అన్నాడు. అవతలినించి గభాల్న గుర్తు రాలేదు 'ఎవరండీ' అన్నాడు.

'మీరు కిషోర్‌గారేనా. ఆవాళ మా ఇంటికొచ్చారు' అనేసరికి గుర్తొచ్చింది. 'మీరా! బాగున్నారా?' అని యోగక్షేమాలు అడిగాను.

'మీరిక్కడికి వచ్చినప్పుడు గంగా సంగమం గురించి చెప్పాను కదా! మీకు ఇబ్బంది కాకుండా ఉంటే బయలుదేరి వద్దామనుకుంటున్నాను' అన్నాడు కాశీపతి.

'ఏం చెప్పాలో అర్థం కాలేదు కిషోర్‌కి. 'ఇది మీ నంబరేనా?' అని అడిగాడు.

'నాది కాదు గానీ మా వాళ్ళదే' అన్నాడు కాశీపతి. 'మీకు కాసేపట్లో ఫోన్ చేస్తాను అనేసి డిస్‌కనెక్ట్ చేశాడు కిషోర్.

వాళ్ళింటికి వెళ్ళినప్పుడు కాశీపతి ఒక విషయం ప్రస్తావించాడు. గంగా సంగమం కలకత్తాకి దగ్గరేనట కదా! అని అడిగాడు. 'ఏమో నేను వెళ్ళలేదు' అన్నాడు కిషోర్.

'పరమ పవిత్రమైన స్థానం. గంగానది సాగరంలో సంగమించే స్థానం. సర్వతీర్థాలూ ఒక ఎత్తు. గంగా సంగమం ఒక ఎత్తు అంటారు. ఎలా వెళ్ళాలో కాస్త కనుక్కుని చెప్తారా?" అన్నాడు కాశీపతి.

"అయ్యో దానికేం భాగ్యం?" తప్పకుండా! వస్తే మా ఇంటికి రండి" అన్నాడు.

"ఆ మాట పట్టుకుని ఇప్పుడు ఫోన్ చేశాడు. ఆయన్ని ఇక్కడికి రప్పించి గంగాసాగర్ పంపించటం అంటే మాటలు కాదు. ఏదో సాకు చెప్పి తప్పించుకుంటే సరిపోతుంది అనుకున్నాడు.

కానీ అలా చెయ్యడానికి మనసొప్పలేదు. తక్కువస్థితిలో ఉన్నవారు ఏ మాత్రం సంకోచించకుండా పెద్దవాళ్ళకి సాయం చేసేస్తారు. గొప్పవారికే ఆ సంకోచాలు. కిషోర్ కాస్త భిన్నమైన మనస్తత్వం కలవాడు కాబట్టి వెంటనే ఒక మనిషిని పిలిచి వివరాలడిగాడు.

అరగంట తరువాత కాశీపతికి ఫోన్ చేశాడు. వివరాలు కనుక్కున్నాను. మకర సంక్రాంతికి లక్షలాదిగా వస్తారుట. పొద్దున్నే వెళ్తే రాత్రికి గానీ మర్నాడు పొద్దునకి గానీ కలకత్తా వచ్చెయ్యచ్చుట అని చెప్పాడు.

'అవును. మకర సంక్రాంతి నాడు గంగా సంగమం స్నానం మహాపుణ్యం. ఆ వేళ్టికే వస్తాను. ఏ రైలెక్కి రావాలి? వివరంగా చెప్తే!' అని మొహమాట పడుతూనే అడిగాడు.

'అలాగే... వీలైతే ప్రయాణంలో వాడుకునేందుకు ఒక సెల్ ఫోన్ ఏర్పాటు చేసుకోండి. నాకు అందుబాటులో ఉంటారు' అన్నాడు.

కాశీపతి ఆనందం అంతా ఇంతా కాదు. గంగా సంగమం వెళ్ళాలనేది ఆయన జీవితాశయం. తండ్రి ప్రయత్నించి కూడా వెళ్ళలేకపోయాడు. అటువంటిది అనుకోకుండా తనకీ అవకాశం వచ్చింది.

అందుకే 'అలాగే బాబు గారూ! అంతదాకా ఈ నంబరుకే చెయ్యండి" అన్నాడు గద్గద కంఠంతో.

కిషోర్‌కి మనసు బరువెక్కింది. పాపం. ఎంత ఆనంద పడుతున్నాడు అనుకుని సీరియస్‌గా ప్రయత్నాలు ప్రారంభించాడు. విజయవాడలో ఉన్న ఫ్రెండ్‌తో మాట్లాడాడు. అతను మెయిల్‌లో స్లీపర్‌లో రిజర్వేషన్ చేయించాడు. జనవరి పదిన బయలుదేరి పదకొండు పొద్దున్న కలకత్తా జేరేలా... కాశీపతి గుడి బాధ్యత ఒక పద్నాలుగేళ్ళ కుర్రాడికి అప్పగించి, ప్రయాణానికి అన్నీ సర్దుకుని భార్యని గుంటూరులో కూతురి దగ్గర దించి విజయవాడ చేరాడు. అంతకుముందు ఊళ్ళో తెలిసిన వాళ్ళను అడిగితే వాళ్ళు వాడకుండా పక్కన పడేసిన సెల్ ఫోను ఒకటి ఇచ్చారు.

**అసలు దేవుడు ఉన్నాడా? భక్తులు పిలిస్తే వస్తాడా? ఆపదలో ఉన్న వారు కోరుకుంటే వారిని ఆదుకుంటాడా? ఇవన్నీ మనిషికి ఎప్పటినుండో ఉన్న ప్రశ్నలు. ఈ కథలో కలకత్తా వెళ్ళిన కాశీపతిని పిల్లలు కూడా ఇదే ప్రశ్న అడిగారు. గంగాసాగర దర్శనం కోసం వచ్చిన కాశీపతి ఆ పిల్లలకు ఏం సమాధానం చెప్పాడు? కిషోర్‌కి కాశీపతికి ఉన్న అనుబంధం ఏమిటి?**

విజయవాడలో స్టేషన్‌కి మనిషిని పంపించాడు కిషోర్ స్నేహితుడు. అతను కాశీపతిని కలిసి టికెట్ ఇచ్చాడు. రైలెక్కించి వచ్చాడు. ఆ విషయం కిషోర్‌కి ఫోన్ చేసి చెప్పాడు అతను.

టికెట్ డబ్బులు ఇచ్చేశారు ఆయన. వద్దన్నా వినలేదట అని చెప్పాడు. హౌరా స్టేషన్‌కి మనిషిని పంపించాడు కిషోర్.

కిషోర్ చాలీగంజ్ ఏరియాలో ఓ పెద్ద అపార్ట్‌మెంట్‌లో ఉంటున్నాడు. ఊరూ పేరూ తెలియని మనిషికి కేవలం ముఖపరిచయంతో ఇదంతా చేస్తున్నందుకు సణిగింది కిషోర్ భార్య. నీ మీద భారం ఏమీ పడదు. అంతా నేను చూసుకుంటాను అన్నాడు కిషోర్. ఆ బిల్డింగ్‌లో ఎవరింటి



# షాక్‌లో అంజలి

రాజోలు పిల్ల అంజలి టాలీవుడ్‌లో ఎలాగైనా పాగా వేయాలని చేస్తున్న ప్రయత్నాలు ఏవీ పెద్దగా ఫలితాన్ని ఇవ్వడంలేదు. 'సీతమ్మ వాకిట్లో సిరిమల్లె చెట్టు', 'గీతాంజలి' లాంటి హిట్ సినిమాల్లో నటించినా అంజలికి సరైన ఆఫర్లు మాత్రం రావడం లేదు. హీరోయిన్‌గా ఎటూ అవకాశాలు రావడం లేదు, పోనీ ఐటెంసాంగ్స్ అన్నా ప్రయత్నిద్దామనుకుంటే అవి కూడా సేమ్ టూ సేమ్! 'సరైనోడు' డివైడ్ టాక్ తెచ్చుకుని కూడా కలెక్షన్ల వర్షం కురిపిస్తోంది. ఈ సినిమాలో ఐటెంసాంగ్ చేసిన అంజలి గురించి మాత్రం ఎవరూ పట్టించుకోవడం లేదు. దాంతో అంజలి తీవ్రమైన షాక్‌లో ఉందట! తనకే ఇలా ఎందుకు జరుగుతోంది అనుకుంటూ తెగ బాధపడిపోతోందట కూడా!

కైనా అతిథులు వస్తే వాళ్ళ కోసం వసతి ఏర్పాటు ఉంది. అందులో ముందే బుక్‌చేసి ఉంచాడు. రాగానే కాసిని కాఫీ ఇచ్చి అక్కడికి తీసుకువెళ్దాం అనుకున్నాడు.

కిషోర్ భార్య లావణ్య. ఇద్దరు పిల్లలు. అనన్య, అభిజిత్. పన్నెండు, పదకొండు తరగతులు చదువు కుంటున్నారు.

కాశీపతి ఇంట్లోకి రాగానే ముందుగా కిషోర్ చేతులు పట్టుకుని కృతజ్ఞతలు తెలియచేశాడు. మా అమ్మాయి నీకిమ్మంది అని ఒక పేకెట్ లావణ్య చేతుల్లో పెట్టాడు. అరిసెలు, లడ్లు, జంతి కలు ఉన్నాయి అందులో. ఆయన మర్యాద, మాట తీరు నచ్చాయి లావణ్యకి.

ఉదయం పూట ఫలహారం అయ్యాక ఒక మనిషిని తోడు ఇచ్చి ఊళ్ళోకి పంపించారు. తిరిగి రాత్రి ఏడు గంటలకి వచ్చాడాయన. ఇంట్లోనే భోజనం ఏర్పాటుచేశారు.

మీ ఊళ్ళో గుడి మీ స్వంతమా? మీరక్కడే ఉంటారా? అని ఏనాడూ గుడి పూజారిని అంత దగ్గరగా చూడని పిల్లలు బోలెడన్ని ప్రశ్నలు వేశారు. ఆయన ఓపిగ్గా సమాధానాలు చెప్పాడు. దేవుడి కథలొచ్చా మీకు అని అడిగారు. చాలా వచ్చు ఆయనకి. చెప్పటం మొదలుపెట్టాడు. శ్రద్ధగా విన్నారు. ఇంకోటి, ఇంకొక్కటి అని కొసరుతుంటే ఇక చాలు పాపం ఆయన అలసిపోయారని కిషోర్ మందలించాడు. పిల్లలతో బాటు వాళ్ళిద్దరూ కూడా విన్నారు.

మర్నాడు పగటిపూట దక్షిణేశ్వరం వెళ్ళి కాళికాదేవి దర్శనం చేసుకువచ్చాడాయన. ఆ వేళ రాత్రికే క్యాంపుకి పంపించారు. గంగాసాగర్ వెళ్ళే యాత్రికుల కోసం కలకత్తాలో క్యాంపులు నిర్వ హిస్తారు. అక్కడ తెలిసినవాళ్ళుంటే కాశీపతిని వాళ్ళకి అప్పగించారు. రాజస్థాన్ నించి వచ్చిన యాత్రికుల బస్‌లో ఎక్కించారు కాశీపతిని. తెల్ల వారుజామున బయలుదేరింది బస్. నాలుగు గంటల ప్రయాణం. అక్కడ బస్ దిగి బోటు ద్వారా ప్రయాణం. ఒడ్డున దిగి మళ్ళీ బస్సెక్కి గంట ప్రయాణం. లక్షలాది మంది యాత్రికులు. అయినా బాగానే అయింది స్నానం. గంగా సంగ మంలో మకర సంక్రాంతినాడు స్నానం చేస్తే పున ర్జన్మ ఉండదు అంటారు. తృప్తిగా మునకవేశాడు కాశీపతి. ఆయన పదిహేనో తారీఖున తిరిగి వస్తాడు. పదిహేడు రాత్రి మెయిల్‌లో తిరుగు ప్రయాణం. పదహారున ఏదో సెలవు. పొద్దున పూట కాశీపతిగారి చేత పురాణప్రవచనం పెట్టించి నాలుగు మంచి ముక్కలు చెప్పించాలని కిషోర్ ఆలోచన. అదే శ్రీకాంత్‌తో చెప్పాడు. విషయం ఏమిటని శ్రీకాంత్ అడగటంతో కాశీ పతితో తన పరిచయం వగైరా వివరాలన్నీ టూకీగా చెప్పాడు.

అంతా విని చిన్నగా నవ్వేశాడు శ్రీకాంత్. 'ఆయనకి సాయం చెయ్యాలనుకుంటే ఇంత హడావిడి ఎందుకు? తలా కొంచెం వేసుకుని ఆయన చేతుల్లో పెడితే సరిపోతుంది" అన్నాడు.

కిషోర్ మొహం ఎర్రబడిపోయింది.

## సమంత బోర్ కొడుతోందట!



అవుననే అంటున్నారు సినీ జనాలు. సమంత చేతిలో ప్రస్తుతం మూడు భారీ సినిమాలు తప్ప మరో సినిమా లేదు. వీటిల్లో కూడా ఒకరిద్దరు హీరోయిన్లతో షేర్ చేసుకుంటోంది. మొత్తానికి సోలో హీరోయిన్‌గా ఒక్క సినిమా కూడా లేదు. దానికి కారణం ఆమె నటనే అంటున్నారు తమిళ తంబిలు. ఎప్పుడూ ఒకటే లుక్స్‌తో కనిపించడం, నటన అన్నది ప్రదర్శించకపోవడం వలనే సమంత అంటే జనా లకి బోర్ కొట్టేస్తోందట! ఈ కారణమే కాకుండా సమంత ఉంటే సినిమా హిట్ అన్న నానుడి కూడా వెనక్కి వెళ్ళిపోవడంతో సొంత ప్రచారానికి శ్రీకారం చుడుతోందట సమంత! ట్వీట్ల ద్వారా తన గొప్పతనాన్ని చాటుకునే ప్రయత్నం చేస్తోంది. ఎన్ని వేషాలు వేసినా మునుపటి వైభవం మాత్రం రాదంటున్నారు సినీజనాలు.

'ఆయనకి అంత ఖర్మేం పట్టలేదు. మీకలా అనిపించడంలో ఆశ్చర్యం ఏమీ లేదు. ఒకడిని చూస్తే పెట్టబుద్ధి వేస్తుంది. మరొకడిని చూస్తే మొత్తబుద్ధి వేస్తుంది అని సామెత చెప్పినట్లు కొంతమందిని చూస్తే మనందరికీ చులకన భావం.

ఆ మధ్య ఒక సినిమా నటుడిని తీసుకొచ్చాం. రానూపోనూ ఖర్చులు, హోటల్‌లో బస, అదిగాక నగదు ఇచ్చాం. ఆయన గారు వచ్చి ఆడవాళ్ళూ పిల్లలూ ఉన్నారని చూడకుండా కుళ్ళు జోకులు వేసి పోయాడు. ప్రతి ఏడూ ఎంతో కొంతమందిని ఆహ్వానిస్తున్నాం. సన్మానాలు చేస్తున్నాం. వాళ్ళంతా మేమింత పుచ్చుకుంటాం అని కచ్చితంగా చెప్తు న్నారు. మనం ఇచ్చుకుంటున్నాం" అన్నాడు ఆగ్ర హంగా.

శ్రీకాంత్‌కి కోపం వచ్చింది. "ఇది మరీ బావుం దండీ. వాళ్ళంతా పేరూ ప్రతిష్ఠ ఉన్నవాళ్ళు" అన్నాడు.

'ఈయనకి పేరు ప్రతిష్ఠ అంతగా లేకపోవచ్చు గానీ ప్రతిభ పుష్కలంగా ఉంది. ఆయన మాట్లాడు తుంటే మా పిల్లలూ మేము కూడా మైమరచి పోయి విన్నాం. అందుకే ఆయనచేత మాట్లాడిద్దా మనుకున్నాను. మీకు ఇష్టం లేకపోతే చెప్పండి. వేరే ఎక్కడైనా ఏర్పాటు చేయిస్తాను. అంతేగానీ ఒక పండితుడిని యాచకుడిగా భావించి పొర బాటు చెయ్యకండి" అన్నాడు.

శ్రీకాంత్ తలొంచుకున్నాడు. 'అబ్బే, నా ఉద్దేశం అది కాదండీ!' సర్ది చెప్పబోయాడు. 'పర్వాలేదు లెండి. ఇందులో మీ తప్పేం లేదు. రోజులే అలా ఉన్నాయి. అప్పుడెప్పుడో పూర్వకాలంలో రాజులు పండితులని గౌరవించేవారట. ఇప్పుడు అవన్నీ పోయాయి. పండితులంటే అందరికీ చులకనే. వారి ప్రతిభ గుర్తించటం దేవుడెరుగు. వయసు మళ్ళిన పండితులకు పించనులు ఇవ్వడానికే ఏడ్చిపోతున్నాయి మన ప్రభుత్వాలు" అన్నాడు కిషోర్.

"సర్లేండి. దేశాన్ని మనం బాగు చెయ్యలేము కదా! కాశీపతి గారి చేత మాట్లాడిద్దాం. ఎంత ఇద్దాం?" అసలు విషయంలోకి వచ్చాడు శ్రీకాంత్.

"రాజారావుగారితో మాట్లాడి మీరు నిర్ణయిం చండి" అన్నాడు కిషోర్. వాళ్ళ అసోసియేషన్‌కి రాజారావు ప్రెసిడెంటు. శ్రీకాంత్ సెక్రటరీ. మొత్తా నికి కాశీపతిగారి ప్రవచనం ఏర్పాటైంది. ఆ బిల్డిం గ్‌లో కింద ఒక హాలు ఉంది. అక్కడ ఇటువంటి కార్యక్రమాలు జరుగుతాయి. పొద్దున్న పదిన్నరకి అందరికీ ఆ సమాచారం అంద చేయబడింది.

పదిహేనో తారీఖు మధ్యాహ్నం తిరిగొచ్చాడు కాశీపతి. ఆయన మొహంలో చెప్పలేనంత ఆనందం. రాగానే కిషోర్ చేతులు పట్టుకున్నాడు. బాబుగారూ! మీ రుణం ఈ జన్మకి కాదు వెయ్యి జన్మలెత్తినా తీర్చుకోలేను. గంగా సంగమం యాత్ర చేయిం చారు. ఎన్నేళ్ళ నుండో అనుకుంటున్నాను. నా కోరిక తీరుతుందని కలలో కూడా అనుకోలేదు" అన్నాడు.

కిషోర్ మొహమాట పడిపోయాడు. 'నేను చేసింది ఏముందండీ?' అన్నాడు. తరువాత మర్నాడు తను ఏర్పాటు చేసిన ప్రోగ్రాం గురించి చెప్పాడు. కాశీపతి కంగారు పడిపోయాడు. 'అదేమిటి బాబూ? పెద్దల ఎదుట నేనేం మాట్లాడతాను? నాకేం వచ్చు?' అన్నాడు.

"ఏం ఫర్వాలేదు. ఆ వేళ నాకు స్థల పురాణం చెప్పారుగా. అదే చెప్పండి. మీ అనుభవాలు చెప్పండి" అన్నాడు.

కిషోర్ పిల్లలు తమ ఇంటికొచ్చినాయన కథలు బాగా చెప్తారని తమ ఫ్రెండ్స్‌కి చెప్పారు. ఆ పిల్ల లంతా అయితే మేమూ వస్తాం అన్నారు.

కాశీపతిని పదింటికే హాల్‌కి తీసికెళ్ళాడు కిషోర్.

మరికాసేపటికి రాజారావు, శ్రీకాంత్ వచ్చారు. పదిన్నరకి జనం రాక మొదలైంది. ఇరవై మంది దాకా వచ్చారు. అంతమందిని చూసి కాశీపతికి నోరెండి పోయింది. దేవుడిని తల్చుకుంటూ కూర్చున్నాడు.

కార్యక్రమం ప్రారంభం అయింది. శ్రీకాంత్ స్వాగతం పలికాడు. కిషోర్ కాశీపతిని సభకు పరిచయం చేశాడు. మరికొంతమంది వచ్చి కూర్చున్నారు. కాశీపతిగారు మాట్లాడతారు అన్నాడు.

కాశీపతి వేదికమీద కిందనే మఠం వేసుకుని కూర్చున్నాడు. 'వందే శంభుముపాపతిం అని ప్రార్థనతో ప్రారంభించాడు. ఏం చెప్పాలా అని సంకోచించినా కాశీపతికి మైకు అందుకున్నాక ఎక్కడా నట్టుపడలేదు. "మూడు తరాలుగా ఆ ఈశ్వరుడి సేవాభాగ్యం పొందిన వంశం మాది. మా తాతగారు, వారి పేరూ కాశీపతిగారే. మహా భక్తులు. మూడుసార్లు శివకోటి రాశారాయన. ఆయన మహాన్యాసపూర్వక ఏకాదశ రుద్రాభిషేకం చేస్తుంటే పరవశించిపోయేవారట అని పాత సంగతులు చెప్పాడు.




శివుని మహత్త్వం గురించి చెప్పాడు. మార్కండేయుడి కథ చెప్పాడు. శ్రోతలు లీనమైపోయి వినసాగారు. మధ్యమధ్యలో స్తోత్రాలు పద్యాలు అద్భుతంగా సాగిపోయింది. గంట క్షణంలా గడిచిపోయింది. చేతి వాచీ చూసుకున్నాడు కాశీపతి. సభవారు నాకు గంటన్నర సమయం కేటాయించారు. గంటసేపు అయిపోయింది. సభలో ఉన్న భక్తాగ్రేసరులు ఎవరైనా ఏదైనా ప్రశ్నించాలనుకున్నా, ఇంకేమైనా వినగోరినా చెప్పవలసినదిగా మనవి అన్నాడు.

శ్రోతల్లోంచి సోమేశ్వర్రావు లేచాడు. ఆయన వయసు డెబ్బై పైనే. కొడుకు దగ్గర ఉంటున్నాడు. "అయ్యా, నా చిన్నతనంలో మా ఊరి గుడి పూజారి గారు ఈశ్వరుని సువర్ణ మాలా స్తోత్రం పాడేవారు. మీకు వచ్చా అది" అని అడిగాడు.

"వచ్చు బాబుగారూ! శంకర భగవత్పాదులు రచించిన అద్భుతమైన స్తోత్రం అది" అన్నాడు కాశీపతి. 'వినిపించగలరా?' అడిగాడు సోమేశ్వర్రావు.

'మహద్భాగ్యంగా భావించి వినిపిస్తాను' అంటూ చేతులు జోడించి "ఇందులోని ప్రతిశ్లోకం అక్షర మాలలోని అక్షరాలతో ప్రారంభం అవుతుంది" అని వివరణ ఇచ్చి ప్రారంభించాడు.

**అథ కథ మసి మద్రసనాం త్వద్గుణ! లే శైర్వి శోధయామి విభో**

**సాంబసదాశివ శంభోశంకర! శరణం మే తవ చరణయుగం!"**

పావుగంట పైన సాగింది ఆ స్తోత్రం. మంత్రముగ్ధులైపోయారు శ్రోతలు.

సోమేశ్వర్రావు కళ్ళ వెంట ఆనంద బాష్పాలు. ఆయన ముగించగానే లేచి వెళ్ళి పర్సుతీసి కాశీపతి చేతుల్లో అయిదు వందల నోటు ఉంచాడు. ఆయనకు వినయంగా నమస్కరించాడు కాశీపతి. ఆయన పేరు అడిగి తెలుసుకున్నాడు.

"శివభక్తులు శ్రీ సోమేశ్వర్రావు గారు నన్ను ఆశీర్వదించి అయిదు వందల రూపాయిలు ఇచ్చారు. వారికీ, వారి కుటుంబానికీ ఆయురారోగ్య ఐశ్వర్యాలు ప్రసాదించవలసిందిగా ఆ పరమేశ్వరుడిని ప్రార్థిస్తున్నాను" అన్నాడు కాశీపతి.

అది చూసి మరికొంతమంది లేచారు. వంద, రెండొందలు ఎవరికి తోచింది వారు మొత్తానికి అందరూ ఎంతో కొంత ఇచ్చారు. చదివింపులు అయ్యాక మరో పది నిమిషాలు మాట్లాడి స్వస్తి వాక్యం పలికాడు కాశీపతి.

అసోసియేషన్ తరపున శాలువా కప్పి కవరు అందించాడు రాజారావు.

కార్యక్రమం ముగిశాక అందరూ కాశీపతిని అభినందించారు. చాలా బావుంది అన్నారు. కిషోర్‌కి ఎంతో తృప్తిగా అనిపించింది. ఇంటికొచ్చి భోజనం చేస్తుండగా కిషోర్‌కి ఫోన్ వచ్చింది. మరో తెలుగు అసోసియేషన్ వారు ఫోన్ చేశారు. ఏదో మంచి ప్రోగ్రాం పెట్టించారట కదా! ఆయన ఎవరు? ఎన్నాళ్ళుంటారు అని అడిగారు. మర్నాడు వెళ్ళిపోతున్నారు అని చెప్తే, ఇవాళ సాయంత్రం మాకు మంత్లీ మీటింగ్ ఉంది. అందులో మాట్లాడటానికి వీలవుతుందా అని అడిగారు. కాశీపతితో మాట్లాడి అలాగే తీసుకొస్తానని చెప్పాడు.

అక్కడా గ్రాండ్ సక్సెస్. అక్కడా చదివింపులు బాగానే వచ్చాయి. వాళ్ళు కొంత పైకం ఇచ్చి సత్కరించారు.

ఆ రాత్రి కిషోర్ ఇంట్లో భోజనాల సమయంలో పిల్లలు కాశీపతితో కబుర్లు మొదలుపెట్టారు.

"మరీ! మీరు చెప్పిన కథల్లో భక్తులు కష్టాల్లో ఉండి ప్రార్థన చేస్తే దేవుడు వచ్చాడని చెప్పారు కదా! ఆ రోజుల్లో దేవుడు నిజంగా వచ్చేవాడా?' అని అడిగాడు అభిజిత్.

'ఆ రోజుల్లోనే కాదు, ఏ రోజుల్లోనైనా వస్తాడు' చెప్పాడు కాశీపతి.

'అంటే ఇప్పుడు కూడా వస్తాడా?' ఆశ్చర్యంగా అనన్య.

'ఎందుకు రాడు? తప్పకుండా వస్తాడు.'

'మీకేమైనా అటువంటి ఇన్సిడెంట్స్ తెలుసా?'

'ఇంకేదో ఎందుకు బాబూ. మీ ఎదురుగానే ఉన్నానుగా నేను. ప్రతి ఏడు కార్తీకమాసంలో వచ్చే డబ్బు రాలేదు నాకు. డబ్బుకి బాగా ఇబ్బందిగా ఉంది. ఎవరినీ అడిగే అలవాటు లేదు. అడిగినా ఎవ్వరూ ఇవ్వరు. అయినా ఎదురుగా ఐశ్వర్య ప్రదాయకుడైన ఈశ్వరుడిని పెట్టుకుని ఇంకెవరినో ఎందుకు అడగటం? నీవే దిక్కు. నన్ను గట్టెక్కించే భారం నీదే అని మొరపెట్టుకున్నాను. మీ నాన్నగారు మా ఊరు రావడం, మా ఇద్దరి మధ్య పరిచయం ఏర్పడటం జరిగాయి. గంగా సంగమం గురించి చెప్తే, మా అమ్మాయి ప్రోత్సహించింది. దారి ఖర్చులకి నేనిస్తాను, వెళ్ళి రండి అంది. ఈ ఏడాది వద్దు, మరొకసారి వెళ్తాలే అన్నా. మనం మన ఇబ్బందులూ ఎప్పుడూ ఉండేవే. పైఏటికి ఆ కిషోర్‌గారు అక్కడుంటారో ఉండరో, వెళ్ళిరండి అని పట్టుబట్టింది. సరే అవకాశం వచ్చినప్పుడు కాదనటం ఎందుకు అని బయలుదేరాను.

నేను ఎన్ని రోజులుగానో కోరుకుంటున్న గంగా సంగమంలో స్నానం, అదీ మకర సంక్రాంతి నాడు జరిగినందుకే నా జన్మధన్యం అని తృప్తి పడుతూ ఉంటే ఇక్కడ అనుకోకుండా మీ నాన్నగారు ఈ కార్యక్రమం ఏర్పాటుచేశారు. ఖర్చులకు సరిపడా డబ్బు తీసుకుని బయలుదేరిన నేను చేతినిండా డబ్బుతో తిరిగి వెళ్తున్నాను. ఈ డబ్బు పొదుపుగా వాడుకుంటే కొంతకాలం గడిచిపోతుంది. ఈ యేడు క్రిష్ణా పుష్కరాలు. అప్పుడు మళ్ళీ నాకు దక్షిణలూ, దానాలూ సమకూరుతాయి. ఆ దైవ కృప ఎప్పుడూ భక్తుల మీద ఉంటుందనడానికి ఇంకేం నిదర్శనం కావాలి బాబూ! అన్నాడాయన చిరునవ్వుతో.

పిల్లలు ఆశ్చర్యపోయారు. కిషోర్, లావణ్య సంభ్రమాశ్చర్యాలకు లోనయ్యారు.

మర్నాడు రైలెక్కించడానికి కుటుంబం అంతా స్టేషన్‌కి వెళ్ళారు. మరోసారి కృతజ్ఞతలు తెలియజేసుకుని పుష్కరాలకు మా ఊరే రండి. అంత రద్దీ ఉండదు. ప్రశాంతంగా స్నానం, దైవదర్శనం చేసుకోవచ్చని ఆహ్వానించి రైలెక్కాడు కాశీపతి.

*సెల్:99490 59007*






## పెట్స్‌కి మాత్రమే!

అదొక లగ్జరీ హోటల్! అక్కడి రూమ్స్ చూస్తే బుల్లి బుల్లి మంచాలు, బుల్లి బుల్లి టేబుల్స్, అన్నీ బుల్లివే కనిపిస్తాయి. ఫుడ్ చూస్తే నోరూరక మానదు, కాని అది మనుషుల కోసం కాదు. వినోద కార్యక్రమాలు అలరిస్తాయి కానీ, అవీ మనుషుల కోసం కాదు. మరి ఇవన్నీ వేటికోసం అనుకుంటున్నారా? పెంపుడు పిల్లుల కోసమట! అసలు ఆ హోటలే మార్జాలాల కోసం!

ఇంగ్లాండ్‌లోని లార్డ్‌ఫోర్డ్‌షైర్‌లో లాంగ్‌క్రాఫ్ట్ పేరుతో లగ్జరీ హోటల్ వెలిసింది. అబి పర్సర్, మట్ పర్సర్ అనే ఇద్దరు ఈ హోటల్‌ను ప్రత్యేకంగా పెంపుడు పిల్లుల కోసం ఏర్పాటు చేశారు. వాటి కోసం స్పెషల్‌గా చేయించిన బుల్లి బుల్లి మంచాలు, న్యూట్రిషనిస్ట్ సలహాలతో తయారైన టేస్టీ టేస్టీ ఫుడ్ అందించడంతోపాటు, వాటి వినోదం కోసం కూడా ఏర్పాట్లు చేసింది హోటల్ యాజమాన్యం. పెంపుడు పిల్లులున్నవాళ్లు ఎంచక్కా వాటికి ఈ హోటల్‌లో రూం బుక్ చేసేసి, తమ పనులు చేసుకుని రావచ్చు. విహారయాత్రలకు వెళ్ళే వాళ్ళు కూడా వాటిని ఇక్కడ వదిలి వెళ్ళవచ్చు. అయితే లగ్జరీ హోటల్ కదా మరి! ఖర్చు కూడా ఎక్కువే ఉంటుంది.



## ట్రైన్ టు ది క్లౌడ్స్

మేఘాల్లో తేలిపోతున్నట్లు కలలు కనటం సాధారణం. కానీ నిజంగా అలా మేఘాల్లో తేలిపోతే... అప్పుడే మేఘాల్లో తేలిపోతున్నారా? అసలు అదేమిటా అని ఆరా తీస్తున్నారా? అయితే అర్జెంటీనా వెళ్ళాల్సిందే!

అర్జెంటీనా దేశం సల్టా నగరం నుంచి లా పోల్వోరిల్లా అనే ప్రదేశానికి వెళ్లే రైలు మిమ్మల్ని మేఘాల్లోకి తీసుకెళుతుంది. సముద్ర మట్టానికి 4 వేల మీటర్ల ఎత్తుకు తీసుకువెళ్ళే ఈ రైలును "ట్రైన్ టు ది క్లౌడ్స్" అని పిలుస్తారు. ప్రపంచంలోనే ఎత్తయిన రైలు మార్గం ఇదేనట! చూడముచ్చటైన వంతెనలు, గుహల్లోంచి ఈ రైలు దాదాపు 217 కిలోమీటర్ల దూరం ప్రయాణం చేస్తుంది. 4200 మీటర్ల ఎత్తులో ఉన్న ఈ ప్రదేశంలో మేఘాలు, స్వచ్ఛమైన గాలి, కాలుష్యం లేని చల్లటి వాతావరణం ఉంటుంది. పర్యాటకులు అక్కడ దిగి కాసేపు మేఘాల ఉనికిని, గాలిని, చల్లటి వాతావరణాన్ని ఆస్వాదించి, ఫోటోలు తీసుకుని అదే రైలులో బయలుదేరిన చోటుకు తిరిగి వెడతారు. రవాణా కోసం నిర్మించిన రైలు మార్గం ఇప్పుడు పర్యాటక కేంద్రంగా మారి సందర్శకులకు ఆహ్లాదకరమైన అనుభవాలను అందిస్తోంది.

## తిరిగి ఇచ్చేశాడు!



అదొక యూనివర్సిటీ లైబ్రరీ. పార్శిల్‌లో ఓ పుస్తకం వచ్చింది. లైబ్రరీకి పుస్తకాలు రావటం మామూలే కానీ ఇక్కడే ఉంది అసలు విషయం.

అమెరికాలోని ఓహియో రాష్ట్రంలో ఉన్న డేటన్ యూనివర్సిటీ లైబ్రరీకి జేమ్స్ ఫిలిప్స్ "హిస్టరీ ఆఫ్ ద క్రూసేడ్స్-1967" పుస్తకాన్ని పంపించాడు. అతడు ఆ యూనివర్సిటీ పూర్వ విద్యార్థి. దాంతోపాటు ఓ ఉత్తరం కూడా జత చేశాడు. అందులో అతని క్షమాపణలున్నాయి. అతడు యూనివర్సిటీలో ఉండగా లైబ్రరీ నుంచి ఆ బుక్ తీసుకుని తిరిగివ్వలేదట! దాంతో 49 సంవత్సరాల తర్వాత ఇప్పుడు క్షమాపణలు చెబుతూ ఆ పుస్తకాన్ని రిటర్న్ చేశాడు. అతడి చిత్తశుద్ధికి మెచ్చి యూనివర్సిటీ వారు కూడా ఆలస్య రుసుమును రద్దు చేశారట! నిజంగా మెచ్చుకోవాల్సిందే!

## ట్యాక్సీ లైబ్రరీ




ప్రయాణాల్లో చాలామందికి పుస్తకాలు చదివే అలవాటు ఉంటుంది. ఒక్కోసారి పుస్తకాలు పట్టుకెళ్ళటం మర్చిపోతుంటారు. అలాంటి వారికోసమే ప్రత్యేకంగా తన ట్యాక్సీలోనే లైబ్రరీని ఏర్పాటు చేశాడు సహెల్.

ఇరాన్‌లోని రస్ట్ నగరంలో ట్యాక్సీ డ్రైవర్‌గా పని చేస్తున్న సహెల్ ఫిల్యూఫ్‌కి పుస్తక పఠనం అంటే ఎంతో ఇష్టం. మంచి పుస్తకం చదవడం వల్ల మెదడు చురుగ్గా పనిచేయడమే కాకుండా కొత్తకొత్త విషయాలు తెలుస్తాయంటాడు సహెల్. అందుకే తనకారులో ప్రయాణించే వారికోసం ప్రత్యేకంగా లైబ్రరీ ఏర్పాటు చేశాడు. ఇందులో సైకాలజీ, చరిత్ర, పిల్లలకి సంబంధించిన పలు పుస్తకాలు ఉంచాడు. లైబ్రరీతో సహెల్ ట్యాక్సీకి డిమాండ్ పెరగడంతోపాటు ప్రయాణికుల్లో పుస్తకాల పట్ల ఆసక్తిని కలిగిస్తున్నాడీ డ్రైవర్! పదునైన అతని ఆలోచనకు నిజంగా హ్యాట్సాఫ్!

-నర్మద వాసిరెడ్డి

అమ్మాయి పుడితే లక్ష్మీదేవి ఇంట అడుగుపెట్టినట్లే భావిస్తారు. కానీ ఆ ఇంట్లో లక్ష్మీదేవి అడుగుపెట్టి ఇప్పటికి వందేళ్ళయ్యిందట! ఇప్పటివరకూ అందరూ అబ్బాయిలేనట! తలవని తలంపుగా అమ్మాయి పుట్టేసరికి సంబరాలు చేసుకోవడంతో పాటు తెగ ఆశ్చర్యపోతోందా కుటుంబం!

అమెరికాలోని ఇదాహో స్టేట్ పోస్ట్ ఫాల్స్ నగరంలోని ఉందర్‌డాల్ కుటుంబంలో 1914వ సంవత్సరం నుంచి అస్సలు అమ్మాయిలు పుట్టలేదు. ఎట్టకేలకు 2016 ఏప్రిల్ 12న ఆ కుటుంబంలో చిన్నారి పాప ఆరేలియా కేర్‌మంది. ఇక వారి ఆనందానికి అవధులు లేవు. పెద్ద ఎత్తున సంబరాలు చేసుకున్నారు. అమ్మాయి పుడుతుందని అస్సలు కలలో కూడా ఊహించలేదంటున్నారు కుటుంబ సభ్యులు. ఏదైతేనేం మొత్తానికి శతాబ్దం తరువాత ఉందర్‌డాల్ కుటుంబం కూడా చిన్నారి ముద్దుముచ్చట్లతో కళకళలాడబోతోంది.

## పాప కేర్‌మంది!



## నవ్యవీక్లి-లక్ష్మీనారాయణ జైని మెమోరియల్ ఛారిటబుల్ ట్రస్ట్ సంయుక్త నిర్వహణలో

# ప్రథమ బహుమతి పొందిన నవల

**మార్తాండుడి విశ్లేషణ నిజమే అని ప్రత్యర్థి వీరుల స్పందన తెలియజేస్తోంది. పదహారు గురిలో కవచాలూ, శిరస్త్రాణాలూ, ఇతర ఉపకరణాలూ ధరించిన పండ్రెండుగురూ ముఖ ముఖాలు చూసుకుంటూ గుంపుగా చేరారు. సైన్యాధికారిలా ఉన్న ఒక వ్యక్తి వాళ్ళ దగ్గరగా వచ్చి, ఏదో చెప్తున్నాడు. శిరస్త్రాణాన్ని తీసివేసే ప్రయత్నం చేస్తున్న ఒక యోధుడిని ఆపాడు. సరే అన్నట్టు తలలు పంకిస్తూ యోధులు మునుపటిలా వరుసలో నిలుచున్నారు.**

ఉన్నట్టుండి వీరధర్మ శంఖం పూరించాడు. శంఖారావం అందరి దృష్టినీ ఆకర్షించింది. ఆ ధ్వని ఆగగానే వీరధర్మ కంఠం అక్కడ ప్రతి ధ్వనించింది.

"యోధులారా! గదా యుద్ధం; ఖడ్గ యుద్ధం; బాణ యుద్ధం; మల్ల యుద్ధం- ఈ నాలుగింటిలో ఏది ముందో నిర్ణయించుకుని, తగిన యోధుడు ముందుకు రండి!"

ముందే నిర్ణయించుకున్నట్టు, ఒక యోధుడు ముందుకు వచ్చాడు. ఎత్తుగా, బలంగా ఉన్న అతడి చేతిలో పెద్ద గద ఉంది. గద కొన నేల మీద ఆని ఉంది. వీరధర్మ వైపు తదేకంగా చూస్తూ ఆ యోధుడు గదను అవలీలగా ఎత్తి భుజం మీద మోపుకున్నాడు. పెద్ద పెద్ద అంగలలో వీరధర్మ వైపు, ముందుకు నడవసాగాడు.

వీరధర్మ రథం మీద నుండీ గదను తీసి, భుజం మీద మోపుకుని, ముందుకు నడిచాడు. ఆ యోధుడికి సమీపంలో, గదా చలనానికి తగినంత దూరంలో నిలుచుని, తన వైపు తీక్షణగా రెప్ప వేయకుండా చూస్తున్న యోధుడి ముఖంలోకి చిరునవ్వుతో చూశాడు.

"నా పేరు వీరధర్మ!"

ప్రత్యర్థి యోధుడు అలాగే చూశాడు. ఉబ్బినట్టున్న అతని పెదవులు కదిలాయి; ఎగతాళిగా. అతను తన పేరు చెప్పలేదు. గదను భుజం మీద నుంచీ దించి, చాచిన చూపుడు వేలులాగా వీరధర్మ వైపు చాచాడు. వీరధర్మ తన గదను ముందుకు చాపి, అతని గదమొనను తన గద మొనతో స్పృశిస్తూ, అలాగే పట్టుకున్నాడు.

అతను ఊహించని వేగంతో గదను తటాలున దూరంగా లాగి, రెండు చేతుల్తో పట్టుకుని వీరధర్మ గద వైపు రువ్వాడు. వీరధర్మ చెయ్యి కదలలేదు. గాలిలో శబ్దం చేస్తూ దూసుకు వచ్చిన ప్రత్యర్థి గద వీరధర్మ గదను బలంగా ఢీకొంది. చెవులు పగిలేలా శబ్దమైంది. వీరధర్మ గదను ఢీకొట్టిన ప్రత్యర్థి గద వచ్చినంత వేగంగానే వెనక్కి వెళ్ళింది; అతన్ని ఆశ్చర్యంలో ముంచివేస్తూ. వీరధర్మ చేతిలోని గద అంగుళం దూరం కూడా కదలలేదు. వీరధర్మ చేతి పొడవునా నరాలు పురెక్కి నులకల్లా పైకి కనిపిస్తున్నాయి!






వీరధర్మ ఇప్పుడు తీక్షణంగా అతని కళ్ళల్లోకి చూస్తున్నాడు. వెనక్కి వెళ్ళిన గదను అతను రెట్టింపు వేగంతో, రెండు చేతుల్తో వీరధర్మ గదను గురిచూస్తూ రువ్వాడు. ఈసారి వీరధర్మ గద కొంచెం వెనక్కి వెళ్ళి, గాలిని చీలుస్తూ, అతని గదను ఎదుర్కొంది. కంచుగదలు ఢీకొన్న శబ్దంతో వాతావరణం కంపించింది. మరుక్షణం జరిగిన అద్భుతం అందర్నీ నిర్ఘాంతపోయేలా చేసింది.

ప్రత్యర్థి యోధుడి గద అతని చేతుల పట్టు లోంచీ జారి, గాలిలోకి ఎగిరింది. ఎండలో తళ తళ మెరుస్తూ కొంచెం దూరం ప్రయాణం చేసి, నేల మీదికి రివ్వున దూసుకు వచ్చింది. గద ముందు భాగం నేలలో గుచ్చుకుని, కొంత మేర దిగబడిపోయింది. నేలలో పాతిన గునపంలా గద పిడిభాగం నిలబడి ఉంది. ప్రత్యర్థి వీరుడు ఆశ్చర్యం నుండి కోలుకుని అటు వైపు పరుగెట్టాడు. అతని కుడి చెయ్యి గద పిడిని పట్టుకోబోయింది. వీరధర్మ రెండు అంగలలో అక్కడికి చేరుకున్నాడు. అతని గద ప్రత్యర్థి వీరుడి వక్షస్థలాన్ని రక్షిస్తున్న లోహ కవచాన్ని బలంగా మోదింది. అతను పైకి ఎగిరి వెల్లకిలా పడిపోయాడు. శిరస్త్రాణం ఊడి పడింది.

వీరధర్మ అతని దగ్గరగా జరిగాడు. గద మొనను అతడి నుదురు మీద ఆన్చాడు. అతడి కనుబొమల మధ్య గద మొన బొంగరంలా గిర్రున తిరిగింది. అతని కళ్ళు అతనిలో జొర బడిన భయాన్ని భూతద్దాల్లా చిలిపిస్తున్నాయి. ముఖం చెమట పూసలతో మెరుస్తోంది.

"నా పేరు వీరధర్మ!" వీరధర్మ నర్మగర్భంగా అన్నాడు.

అతని ఉబ్బిన పెదవులు అదిరాయి. "నా... పె...పె...పేరు క..క..కలిభీమ.."

"ఓహ్..కలిభీమ...అవకాశం ఇస్తాను. తిరగ బడతావా? తిరిగి పోతావా?" వీరధర్మ అడిగాడు.

ప్రత్యర్థి యోధుడు వణుకుతున్న చేతుల్ని జోడించాడు. "పో...పో...తాను.."

"నీ ఇష్టం! నువ్వు పోతే, నీ ప్రాణాలు పోవు!" వీరధర్మ చిరునవ్వు నవ్వుతూ గదను పైకెత్తాడు.

ప్రత్యర్థి వీరుడు తడబడుతూ లేచాడు. తల వాల్చుకుని, గదను అందుకోబోయాడు.

"ఆగు!" వీరధర్మ గద్దించాడు.

అతను, కలిభీమ భయంగా చూశాడు. వీరధర్మ చిరునవ్వు నవ్వాడు. "నీ గద, ఇప్పుడు నా గద! శ్రమపడి గెలుచుకున్నాను!" అంటూ నేల మీద నాటుకున్న గదను లాగి, తన రథం వైపు రువ్వాడు. రథ చక్రం దగ్గరగా నేల మీద వాలింది గద.

"తిరిగి పో!" వీరధర్మ హెచ్చరించాడు. "ఒకటి గుర్తుంచుకో, కలిభీమ! గదను ఎప్పుడూ రెండు చేతుల్తో పట్టుకోవద్దు. కుడిచెయ్యి గట్టిగా పట్టు కుందని ఎడమ చెయ్యి, ఎడమ చెయ్యి గట్టిగా పట్టుకుందని కుడి చెయ్యి అనుకుంటాయి!"

ప్రత్యర్థి యోధుడు శిరస్త్రాణాన్ని అందుకుని, తల వాల్చుకుని వెళ్తున్నాడు...

రెండవ యోధుడు గంభీరంగా వీరధర్మ వైపు నడుస్తున్నాడు. అతను కుడిచేతిలో పట్టుకున్న పెద్ద గద క్రిందికి వేలాడుతూ ముందుకూ వెను




### జరిగిన కథ

వైశాలిక రాజ్య యోధుడు వీరధర్మ. సంపూర్ణాయుస్సు సాధించే లక్ష్యంతో అన్వేషణకు బయలుదేరతాడు. ఎన్నో కష్టాలు, అనుభవాలు చవిచూస్తూ చివరకు చిరంతనయోగిని ప్రసన్నం చేసుకుని మరణ రహస్యం గ్రహిస్తాడు. పునరాలోచనలో పడతాడు. మదగజ నగరంలో సింహగాయత్రీ మంత్ర ప్రభావంతో జీవంతకుడి దుష్పరిపాలన అంతం చేస్తాడు. గిరిజ, గిరికలను దేవుడిచ్చిన సోదరీమణులుగా స్వీకరించి వారిని కొత్త రాజు ధీరేంద్రకిచ్చి వివాహం జరిపిస్తాడు. ఇంతలోనే సామంతులు ఏకమై ఆ రాజ్యంపై యుద్ధం ప్రకటిస్తారు. సైనిక బలగం లేని రాజు నిస్సహాయుడైపోవడంతో, ఉపాయం పన్ని అతడికి బాసటగా నిలుస్తాడు వీరధర్మ. ఆ తర్వాత....

కకూ లయబద్ధంగా ఊగుతోంది. అతను నల్లటి ధోవతిలో ఉన్నాడు. కవచమూ, శిరస్త్రాణమూ ఎండలో ధగధగ మెరుస్తున్నాయి. ముందు వెనుకలకు ఊగుతున్న కంచుగద బంగారం రంగులో మెరుస్తోంది.

తల కొద్దిగా క్రిందికి వంచి, ఎర్రటి కళ్ళతో వీరధర్మను రౌద్రంగా చూస్తున్నాడతను. వీరధర్మ గదను ఎడమ చేతిలో పట్టుకుని అతని వైపు నడిచాడు. అతను ఆగి, గర్వంగా చూశాడు.

“నీ పేరు నాకు తెలుసు. నా పేరు కౌమోదకుడు!” అతని కంఠంలో అహంకారం ధ్వనించింది.

నేలను రాపాడుతున్న కౌమోదకుడి గద ప్రాణం వచ్చినట్టు చివాల్న కదిలింది. వీరధర్మ ఎడమ చెయ్యి కదిలింది. రెండు గదలూ పరస్పరం తాకి, చప్పుడు చేశాయి. కౌమోదకుడి గద అతని కుడి చేతిలో నాట్యం చేస్తోంది. వీరధర్మ గద ప్రత్యర్థి గద కదలికను అనుసరించి, కుడి, ఎడమ చేతుల్లోకి మారుతూ, కళ్ళు చెదిరేలా విన్యాసం చేయసాగింది. కంచు గదలు ఢీకొంటున్న చప్పుడు ఆ ప్రాంతంలో మారు మ్రోగుతోంది.

ఎడమ చేతిలో గద పట్టుకున్న వీరధర్మ గిర్రున గుండ్రంగా ఆత్మ ప్రదక్షిణం చేస్తున్నట్టు తిరిగాడు. కౌమోదకుడు తన గదను వాటంగా పట్టుకుని, సిద్ధంగా ఉన్నాడు, ఊపిరి బిగపట్టి. ఆత్మప్రదక్షిణం పూర్తిచేసిన వీరధర్మ ప్రత్యర్థి వైపు తిరిగాడు. గద ఇప్పుడు అతని కుడిచేతిలో ఉంది. వీరధర్మ ఎడమ చేతిలో ఉన్న గదను మోదడానికి సిద్ధంగా ఉన్న కౌమోదకుడు క్షణకాలం తత్తరపాటుకు లోనయ్యాడు. వీరధర్మ గద అతని గదను గజబలంతో ఢీకొంది. అతని గద విసురుగా పక్కకి దూసుకెళ్తూ, అతడిని కూడా తన వేగంలో లాగింది. కౌమోదకుడు పట్టు తప్పి, వెల్లకిలా పడిపోయాడు.

వీరధర్మ మెరుపులా కదిలాడు. అతని గద ఎండలో తళుక్కుమంటూ క్రిందికి దిగింది. కౌమోదకుడి వక్షభాగాన్ని రక్షిస్తున్న కంచు కవచం భళ్ళున చీలిపోయింది. వీరధర్మ అతని ముఖంలోకి చూశాడు. కౌమోదకుడి కళ్ళలో మృత్యుభయం కనిపిస్తోంది. అతను తన గదను వదిలేశాడు.

“ఒ..ఒ...ఓడి పోయాను...నన్ను...చ...చ... చంపకు..” కౌమోదకుడు తడబడుతూ దీనంగా అన్నాడు.

వీరధర్మ మాట్లాడకుండా చేయూత ఇచ్చి అతడిని పైకి లేపాడు. రెండుగా విచ్చిన కవచం చీలికలోంచీ రక్తం సన్నగా, గీతలా సాగుతోంది. వీరధర్మ అతని గదను అందుకుని తన రథం వైపు విసిరాడు.

“వెళ్ళు!” అన్నాడు కౌమోదకుడితో.

•••

క్షణాలు గడుస్తున్నాయి. గదలు ఢీ కొంటున్న శబ్దాలు చూపరుల చెవులను పగలేస్తున్నాయి. అందరినీ, ముఖ్యంగా ప్రత్యర్థి యోధులను ఆశ్చర్యానికి గురిచేస్తూ, నాలుగు ‘ప్రత్యర్థి గదలు’ వీరధర్మ రథం దగ్గర తమ యజమానుల పరాజయానికి సాక్ష్యాలుగా, నిస్సహాయంగా పడి ఉన్నాయి.

గదాయుద్ధం ముగిసింది. ప్రేక్షకుల శరీరాలను గగుర్పాటుకు గురిచేస్తూ ఖడ్గ యుద్ధం ప్రారంభమైంది. కత్తులు ‘ఖణేల్ ఖణేల్’ అంటున్నాయి. నెత్తుటి మరకలు అంటించుకుంటున్నాయి. వీరధర్మ ఖడ్గం ఇద్దరు ప్రత్యర్థి వీరుల కవచాలను ఛేదించింది. శిరస్త్రాణాలను గాలిలోకి ఎగరేసింది. వీరధర్మ ఖడ్గం అతని గురువు కంఠీరవుడు ప్రత్యేకంగా పోత పోయించిన ఖడ్గం. ఎన్నిక చేసిన లోహాల నిర్ణీత మిశ్రమాలతో రూపొందిన విశేష ఖడ్గం అది. అది వంగదు; విరగదు. చూపులకు అందని విశేష వేగంతో చలనం చేసిన వీరధర్మ ఖడ్గం ప్రత్యర్థుల ఖడ్గాలను ముక్కలు చేసింది. వాళ్ళ రక్తంతో తనను కడిగేసుకుంది.

**వీరధర్మ యుద్ధానికి బయలుదేరాడు. యుద్ధరంగానికి చేరుకున్నాడు. తన శిరస్త్రాణాన్ని, కవచాన్నీ తొలగించాడు. అది చూసి శత్రుశిబిరంలో అలజడి రేగింది. అంతలోనే అతడు శంఖారావం పూరించాడు. గదాయుద్ధం, ఖడ్గయుద్ధం, మల్ల, బాణ యుద్ధాలలో ఏది ముందో తేల్చుకుని మీలో ఎవరు ముందుగా తలపడతారో నిర్ణయించుకోండి అని ప్రకటించాడు. ఈ యుద్ధాలలో అతడు గెలిచాడా? లేదా?**

రక్తం కాలువలు కట్టిన శరీరాలతో, తెగి, వేళ్ళాడుతున్న మాంసఖండాలతో ఒకరి తరువాత ఒకరు ఇద్దరు ప్రత్యర్థులూ పలాయనం చేశారు. వీరధర్మ శరీరం మీద రక్తం చుక్కలు మెరుస్తున్నాయి. అయితే ఆ రక్తం అతనిది కాదు! వీరధర్మ రెప్పవేయకుండా చూస్తున్నాడు. ఇంకా ఇద్దరు ఖడ్గవీరులను తను ఎదుర్కోవాలి..

ఉన్నట్టుండి ఇద్దరు ప్రత్యర్థి ఖడ్గవీరులు ఒకే సారి, జంటగా తన వైపు వస్తున్నారు!

“ఇద్దరూ ఒకేసారా? ఇది అక్రమం! ఇది యుద్ధ నీతికి వ్యతిరేకం!” బిగ్గరగా అరిచాడు సేనాపతి దుర్జయుడు! వీరధర్మ అతని వైపు తిరిగి, ఖడ్గాన్ని పైకెత్తి, ఆందోళన వద్దన్నట్టు సైగ చేశాడు.

ప్రత్యర్థి వీరులు ఇద్దరూ ఎడంగా జరిగి, వేగంగా రెండు వైపుల నుండీ వీరధర్మ పైకి దూసుకు వచ్చారు. వీరధర్మ చిరునవ్వు నవ్వుకున్నాడు. ఒకటి కన్నా ఎక్కువ ఖడ్గాలకు తన ఖడ్గం సమర్థవంతంగా సమాధానం చెప్పగలదు!

తన వైపు గురిచూస్తూ దూకుతున్న రెండు ఖడ్గాలనూ మెరుపు వేగంతో దారి మళ్ళించాడు వీరధర్మ. ‘ప్రత్యర్థిని ఢీకొన్న వెంటనే ఓడించవచ్చు వీరధర్మా. కొంత సేపు పోరాడే అవకాశం, తృప్తీ ఇవ్వు అతనికి’ గురువు కంఠీరవుడి సూచన వీరధర్మకు గుర్తొచ్చింది. ఇద్దరు ఖడ్గ యోధులకూ కాసేపు తన ఖడ్గంతో ఆడుకునే అవకాశం ఇచ్చిన వీరధర్మ తన ప్రత్యేక ఖడ్గచాలన విన్యాసాన్ని ప్రారంభించాడు. అతని ఖడ్గం ప్రాణమున్న లతలా, ఖడ్గలతలా సాగుతున్నట్టు కనిపిస్తోంది. ఇద్దరు యోధుల కవచాలను ఖండించింది. శిరస్త్రాణాలను కూల్చి వేసింది. వాళ్ళ శరీరాల నుండి మాంస ఖండాలను తొలగిస్తూ రక్త స్నానం చేస్తోంది.

వీరధర్మ చేతి కండరాలు ఒక్కసారి బిగుసుకున్నాయి. కత్తి మెరుపు తీగలా అటూ యిటూ కళ్ళు చెదిరే మహావేగంతో కదిలింది. ప్రత్యర్థుల ఖడ్గాలను ఖండిస్తూ రెండు ముక్కలు చేసింది. ఇద్దరూ క్షణంసేపు నిప్పులు కక్కుతూ వీరధర్మను



## రకూల్ ఆ హీరోయిన్‌ని ఫాలో అయిపోతుందట!

రకూల్ ఖాతాలో ఇంత వరకూ బ్లాక్ బస్టర్ అన్నది లేదు. ‘సరైనోడు’ కూడా వసూళ్ళ పరంగా హిట్టయింది కాని సినిమా కంటెంట్ పరంగా ఫ్లాప్ అని కొందరంటున్నారు. ఈ సినిమా తరువాత రకూల్ వరసగా ఇద్దరు చిన్న హీరోలతో చేయడానికి ఓకే చెప్పేసింది. గతంలో సమంత కూడా చిన్నా పెద్దా అన్న తేడా లేకుండా అందరితోనూ జత కట్టేది. ఆ కారణంగా ఆమె కెరీర్ ఇప్పుడు డిఫెన్స్‌లో పడింది. రకూల్‌కి కూడా కొంత కాలానికి ఈ పరిస్థితి ఎదురవ్వచ్చని టాలీవుడ్ జనాలు అంటున్నారు. సినిమాల ఎంపికలో డబ్బు చూసుకోకుండా కథ, బ్యానర్, హీరో వంటి విషయాలు పట్టించుకుంటే మంచిదని కూడా వారు సలహా ఇస్తున్నారు.

చూశారు. ఇంకా తమ చేతులను అంటిపెట్టుకున్న మొండి కత్తులను విసిరికొట్టారు. వీరధర్మ ఒకడుగు ముందుకు వేశాడు. వీరులు వీపులను అతనికి చూపిస్తూ పరుగు ప్రారంభించారు.

ఇప్పుడు తనతో ఎవరు తలపడతారో వీర ధర్మకు తెలుసు. రథాన్ని సమీపించాడు. రక్తసిక్త మైన వీరఖడ్గాన్ని రథం మీద ఉంచాడు. ధనుర్బా ణాలు అందుకున్నాడు. ప్రత్యర్థి బృందంలో ఏదో కలకలం బయలుదేరింది. ధనుర్బాణాలు ధరిం చిన నలుగురు వీరులకు ఎవరో, ఏదో సూచనలు ఇస్తున్నట్టున్నారు. ఆ సూచనలను సాకారం చేస్తూ నలుగురూ ఒకేసారి ముందుకు కదిలారు.

ఒక్కడిని, నలుగురు వీరులు ఒకేసారి ఎది రించబోతున్నారన్నమాట! వీరధర్మ ముందుకు నడుస్తూ అమ్ముల పొదిలోంచీ ఒక బాణాన్ని తీశాడు. రెండవ బాణాన్ని తీశాడు. మూడవ బాణాన్ని తీశాడు. నాలుగవ బాణాన్నీ తీశాడు. నారి మధ్య భాగంలో నాలుగు బాణాల చివర్లను సంధించాడు.

బాణాలు ప్రయోగించడానికి సిద్ధంగా నిలు చున్న ప్రత్యర్థుల మధ్య, వాళ్ళు ఎడమ చేతులలో పట్టుకున్న ధనుస్సుల మధ్య ఉన్న దూరాన్ని చూపులతో కొలత వేశాడు. ఆ దూరాలకు అను గుణంగా నాలుగు బాణాల మొనలను ఎడం ఎడంగా నిర్ణీత దూరాలలోకి జరిపాడు.

ప్రత్యర్థులు బాణాలు ఎక్కుపెట్టి తన మీదికి గురి చూస్తూన్నారు. తన శరీరం మీద ఏ ఆచ్ఛా దనా లేదు. వాళ్ళ శరీరాలకు కవచాలు రక్షణగా ఉన్నాయి. వీరధర్మ వింటి నారిని చెవి దాకా లాగాడు; వదిలాడు. చూస్తున్న వేలాది నేత్రాలకు కనిపించనంత వేగంతో బాణాలు నాలుగూ దూసుకెళ్ళాయి. వీరధర్మ ప్రక్కకు జరిగాడు.

వాయువేగంతో దూసుకెళ్ళిన నాలుగు బాణాలూ గురితప్పకుండా తమ తమ లక్ష్యాలను ఛేదిం చాయి. ప్రత్యర్థుల చేతులలో ఉన్న ధనువులు నాలుగింటినీ మధ్యలో ఖండించి వేశాయి. వాళ్ళు రువ్విన బాణాలు ఒకదాని సమీపంలో మరొకటిగా వస్తూ, వీరధర్మకు మూడు అడుగుల దూరంలో గాలిలో దూసుకెళ్ళిపోయాయి.

నిర్ణీత దూరాలలో సంధించిన మరో నాలుగు వాడి బాణాలు వీరధర్మ వింటినుండీ ప్రాణాలు వచ్చినట్టు దూసుకెళ్ళాయి. కొత్త ధనువులు అందు కోడానికి ప్రయత్నిస్తున్న ప్రత్యర్థుల పాదాలలో దూరి, నేలలో నాటుకుపోయాయి. వాళ్ళ నాలుగు పాదాల గుండా భూమిలోకి చొచ్చుకుపోయిన బాణాలు నలుగురినీ నేలకు తాపడం చేశాయి. వాళ్ళ వెనక వైపున గోడలా నిలుచున్న సైనికులు హాహాకారాలు చేస్తున్నారు. వీరధర్మ వెనక వైపున హర్షధ్వానాలు.

వీరధర్మ ధనుర్బాణాలను రథం మీదికి చేర వేసి, వెనుతిరిగాడు.

కాటుక విగ్రహంలా ఉన్న మల్ల యోధుడు నేల అదిరేలా అడుగులు వేస్తూ వస్తున్నాడు. గున్న ఏనుగులా ఉన్న బలిష్టమైన శరీరం ఎండలో నల్ల త్రాచులా మెరుస్తోంది. బోడిగుండు బుర్రమీసాలు, నెత్తురు గిన్నెల్లాంటి ఎర్రటి కళ్ళు, లావుగా ఉన్న నడుం చుట్టూ ఎర్రటి వస్త్రం. తన వైపు ఏనుగు గున్నలా వస్తున్న మల్లయోధుడిని చూస్తూ, వీర ధర్మ తన ధోవతిని పైకి కట్టుకున్నాడు. మల్లుడు పొడుగాటి అరటి కాయల్లా ఉన్న వేళ్ళను పిడి కిళ్ళుగా బిగిస్తూ, వొదులు చేస్తూ ఎగతాళిగా పళ్ళు ఇకిలిస్తూ వస్తున్నాడు.

మల్లయోధుడు ఏం చేయబోతాడో వీరధర్మకు తెలుసు. దగ్గరగా వస్తాడు. జబ్బలు చరుస్తాడు. తొడకొట్టి, బలాన్ని ప్రదర్శిస్తాడు. ఆ ఆర్భాటాలతో తనకు పనిలేదు! వీరధర్మ మెరుపులా కదిలాడు. పది అడుగుల దూరం వేగంగా పరుగెట్టి, అవ బలంగా నేలకు కొట్టుకుంది.

వీరధర్మ అతని దగ్గరగా నిలుచున్నాడు. అతను ఊహించినట్టుగానే మల్లయోధుడు తల దిమ్ము తగ్గించుకుని, బోర్లా తిరిగి, చేతుల్ని ఆన్చి, పైకి లేచే ప్రయత్నం చేశాడు. వీరధర్మ మోకాలిని అతని వీపు మీద మోపాడు. అతని కంఠం క్రింద రెండు చేతుల్నీ పోనిచ్చి, వేళ్ళను అల్లుకుని, పైకి లాగుతూ, మోకాలితో గట్టిగా, గునపంలా నొక్కాడు. ఫట్ మన్న శబ్దం గాలిలో వ్యాపించింది. మల్లుడి ఎముక-వెన్నెముక విరిగిపోయింది. చెవులు పగి లేలా అరుస్తూ ఉండిపోయాడు మల్లయోధుడు.

## నవ్యవీక్లి-నాటా సంయుక్త నిర్వహణలో బహుమతి పొందిన కవిత




### అతడు.... నా 'స్వ'యాసిస్సు!

అతడు- నెమలీకను హరివిల్లులో ముంచి
నా కాలంపై చేవ్రాలు చేసిన వాడు!
అతడు- పూల ఎదల్లోని మకరందాన్ని సేకరించి,
జాబిలి బిలాల్లో మథించి తీసిన సుధతో
నా జీవన పిపాసను తీర్చినవాడు!
అతడు - నా ఏకాకితనపు ఎడారికి
దక్కిన ఒయాసిస్సు!
విరులకు సరిగమలు నేర్పగల స్వరధునీ,
శిలలను పుష్పింపజేయగల ఆమనీ అతడే!
నా విశ్వరహస్యాన్వేషణా ప్రస్థానరథానికి
రెండో చక్రమూ అతడే!
అహం పడగను అవనతం చేసే అనురాగ
మురళీరవ సృష్టికి
నేనో అధరాన్నైతే రెండో పెదవి అతడే!
ప్రతి సుమగంధంలో ఇమిడిన సూర్యగర్భస్థ జ్వాలాంశలా
నా ప్రతి పరవశంలో విధిగా అతడి అస్తిత్వతేజం!
అతడు ఏకాలంలో నా దేహద్రిమ్మరీ, ఆత్మబాటసారీ!
అతడి వీర్యజలపాతాలపై విరిసిన నా
సుఖేంద్రచాపాలు
ఆ క్షణాల్లో అతడి కనుల కొలనుల్లో విచ్చుకునే
కృతజ్ఞతా కలువల ముందు వెలవెలబోతాయి!
నా దిగులు, గుబులు వేళల్లో అతడి లాలన
'అమాసరేయి' గోదారి అలను చుంబించే పున్నమి
వెన్నెల కిరణం!
కట్టెల్లాంటి రోజులు చిగురిస్తే అది కనికట్టు కాదు
అతడికే తెలిసిన మానసేంద్రియ సేద్యం!
అతడే లేకుంటే... నా హృదయం
విశ్వప్పొలిమేరల కావలి శూన్యపంజరంలో రెక్కలు
తెగిన విహంగమే!
నా అన్వేషణ-




కొండకొమ్ము నుంచి జారాక అడుగనేది దొరకని
జలపాతమే!
అతడి ప్రేమే లేకుంటే...నా 'ఎక్స్ ఎక్స్' క్రోమోజో
'మోహన' రాగానికి మూగనోమే!

-స్వర్ణ
సెల్:99593 65373

లీలగా పైకి లంఘించాడు. కుడిపాదం మల్లుడి గొంతుక మీదా, ఎడమ పాదం అతని వక్షం మీదా ఉండేలా, చూసుకుని దూసుకెళ్ళాడు.

విపరీతమైన వేగంతో, బలంగా కంఠ భాగం మీద ఆనిన పాదతాడనం మల్లుడి మెడనూ, తలనూ తటాలున వెనక్కి తోసింది. తాకిడికి అతని ముఖం ఆకాశం వైపు లేచింది! వక్షభాగం మీద సమ్మెటపోటులా పడిన వీరధర్మ పాదతాడనం అతడిని విసురుగా వెనక్కి తోసింది. మల్లుడు పట్టుకోల్పోయి వెల్లకిలా పడిపోయాడు. తల మల్లుడు మధ్యలో కర్రదెబ్బతో విరిగిన బలసిన పాములాగా మెదులుతూ, మెలికలు తిరిగే ప్రయత్నం చేస్తున్నాడు. అతను ఇక లేవలేడు. మల్ల యుద్ధంలో ప్రత్యర్థి వెన్నెముకను విరిచే శిల్పాన్ని తను మొదటిసారి ప్రయోగించాడు. మహాభార తంలో మహావీరుడూ, సింహబలుడూ అయిన భీమసేనుడు ప్రయోగించిన మల్లయుద్ధ శిల్పం అది!

మరొక మల్లయోధుడి కోసం వీరధర్మ చూశాడు. ప్రత్యర్థి మల్లయోధులు ముగ్గురూ, నేలలో పాతిన

స్తంభాల్లా అక్కడే ఉన్నారు. వాళ్ళ ముఖాల మీద ఆశ్చర్యం, భయం జంటగా తాండవం చేస్తు న్నాయి.

వీరధర్మ ఒక్కసారిగా సింహనాదం చేస్తు న్నట్టు అరిచి, వాళ్ళ వైపు పరుగు ప్రారంభించాడు. వీరధర్మ పరుగులు చూడగానే పాతిన స్తంభా లకు కాళ్ళు వచ్చాయి! కాళ్ళకు చలనం వచ్చింది! ముగ్గురు మల్లయోధులూ వెనుదిరిగి, పిక్కబలం చూపుతూ పరుగులు పెడుతున్నారు!

వీరధర్మ శత్రు సైన్యానికి అగ్రభాగాన ఉన్న నాయకుల వైపు తీక్షణగా చూశాడు. "ఈ ఓటమి చాలా? ఇంకా కావాలా?" ప్రత్యర్థి నాయకుల తలలు వాలిపోయాయి.

వీరధర్మ వెనక వైపు నుండీ హర్షధ్వానాలు దగ్గరగా వస్తున్నాయి. అరుపులు, కేకలు, కేరిం తలు. అడుగుల చప్పుళ్ళు. గిట్టల చప్పుడు, లయ బద్ధంగా. సువేగాశ్వం సకిలింత విజయశంఖా

ధీరేంద్ర మహారాజు వీరధర్మ శరీరాన్ని పరీ క్షగా చూస్తున్నాడు. చూపులను మహామంత్రి వైపు మళ్ళించాడు. "మహామంత్రీ, వీరధర్మను రాజ వైద్యుడికి చూపించండి.."

"యుద్ధంలో గాయపడి ఉంటే కద, మహా రాజా! గోరంత గాయం కూడా అవకుండా అని తర సాధ్యమైన, అద్భుతమైన, ఆశ్చర్యకరమైన యుద్ధం చేశాడు!"

"నిజమా?"

"ఇంకొక అద్భుతం కూడా విను, నాయనా!" మార్తాండుడు అన్నాడు. "ఇక్కడ ధరించిన కవ చాన్నీ, శిరస్త్రాణాన్నీ, ఇతర శరీర భాగాల రక్షణ ఉపకరణాల్నీ తీసిపారేశాడు. చివరికి, అంగీ కూడా తీసివేశాడు. దేహం ఊర్ధ్వభాగం మీద ఏ విధ మైన ఆచ్ఛాదన లేకుండా, కేవలం ధోవతితో గదా యుద్ధం, ఖడ్గయుద్ధం, బాణ యుద్ధం, మల్ల యుద్ధం చేశాడు."




రావంలా వినవస్తోంది.

•••

వీరధర్మను ఆశ్చర్యంలో ముంచివేస్తూ, గిరిజా, గిరికా హారతి ఇచ్చి, తిలకం దిద్ది రాజప్రాసాదం లోకి ఆహ్వానించారు. ధీరేంద్ర మహారాజూ, రాజ మాతా చిరునవ్వులు చిందిస్తూ 'ఆహ్వాన హారతి' కార్యక్రమాన్ని పర్యవేక్షిస్తున్నారు!

ధీరేంద్రుడు దగ్గరగా వచ్చి వీరధర్మను ఆలిం గనం చేసుకున్నాడు. "మిత్రమా, మానమర్యాద లనూ, నా ప్రాణాలనూ, రాజ్యాన్నీ కాపాడావు! ఎన్ని జన్మలు ఎత్తినా నీ రుణం తీర్చుకోలేం!"

"అవును నాయనా...మా కోసం, మా ప్రజల కోసం ఆ భగవంతుడు నిన్ను పంపించాడు.." రాజమాత అంది.

"రాజమాత నిజం పలికారు!" వీరధర్మ నవ్వుతూ అన్నాడు. "మీరు రుణపడింది నాకు కాదు, మహా రాజా; భగవంతుడికి! నేను కూడా భగవంతుడికే రుణపడ్డాను. ఒక సత్కార్యం చేసే అవకాశం కల్పించినందుకు!"

"ఆశ్చర్యం! అద్భుతం!" ధీరేంద్ర మహారాజు అన్నాడు.

"ఈ మహావీరుడు రక్షణ ఉపకరణాలను తొలగించి వేస్తుంటే మా గుండెలు దడదడలాడాయి ప్రభూ! ప్రత్యర్థుల గుండెలు అప్పుడే జారిపోయా యనిపించింది!" సేనాని మెప్పుగా అన్నాడు.

"వీరధర్మకు యుద్ధ విద్యలు నేర్పిన గురువు ధన్యజీవి!" మార్తాండుడు అన్నాడు.

"మా అన్న ఇవాళ మన మందిరంలోనే మనతో కలిసి విందు ఆరగిస్తాడు, ప్రభూ!" గిరిజ అంది.

"అది మాకు గర్వకారణం!" ధీరేంద్రుడు అన్నాడు.

"విందు ఏర్పాట్లు దగ్గరుండి నేనే చేయిం చాను!" గిరిక అంది.

"మహారాజా, ఆనందపారవశ్యంలో మనవి చేయడం మరిచాను. దండెత్తి వచ్చిన నలుగురు రాజులూ సామంతులుగా ఉండడానికి అనుజ్ఞ ప్రసాదించమని లిఖిత విజ్ఞాపనలు సమర్పించారు!"

"సేనాపతీ, చతురంగ బలాలు సమృద్ధం కావాలి. అశ్వికులకూ, పదాతి దళాలకూ రథిక సారథు లకూ ప్రత్యేక శిక్షణ ప్రారంభించండి! నిరంతర వ్యాయామం; నిరంతర సాధన!" ధీరేంద్ర ఆజ్ఞా పించాడు.

"చిత్తం ప్రభూ!" సేనాధిపతి వినయంగా అన్నాడు.

"మా గురుదేవులు మార్తాండ మహాశయులు మన చతురంగ బలం సన్నాహాలను పర్యవేక్షిస్తారు. ఆయన మాట అందరికీ వేదవాక్కు!" ధీరేంద్రుడు అన్నాడు.

"చిత్తం!"

"నాయనా, వీరధర్మా! నాదొక చిన్న కోరిక!" రాజమందిరంలో విందు ముగిసిన అనంతరం అన్నాడు మార్తాండుడు.

"సెలవీయండి, ఆర్యా."

"నువ్వొకసారి నా ఆశ్రమానికి రావాలి..."

"ఎప్పుడు ఆర్యా?"

"సూర్యోదయం కాగానే బయలుదేరదాం..?"

"ఆర్యా...కారణం అడగవచ్చా??" వీరధర్మ అడిగాడు.

"నీకు నా ఆశ్రమం చూపించాలనుకుంటు న్నాను. రేపు కాసేపు నువ్వు నా అతిథివి!" మార్తాండుడు చిరునవ్వు నవ్వాడు.

•••

మార్తాండుల ఆశ్రమం విశాలమైన ఆవరణలో రకరకాల చెట్లతో, పువ్వుల మొక్కలతో, పొద రిండ్లతో నిండిన తోటలో మధ్య భాగాన ఉంది. అతి సామాన్యమైన, నిరాడంబరమైన పర్ణశాల లతో ఉంది ఆశ్రమం. ధీరేంద్రుడిని అతి సామా న్యుడిలా పెంచి పెద్ద జేసే ఆశయంతో నిర్మించిన ఆశ్రమంలా ఉందది. ఆశ్రమాన్ని వొరుసుకుంటూ ఒక నది ప్రవహిస్తోంది.

"ధీరేంద్రుడిని సహజసిద్ధమైన, అతి నిరాడం బరమైన వాతావరణంలో, విలాసాలకూ, విహారా లకూ, విందులకూ దూరంగా పెంచాలనీ, శారీ రక శ్రమ విలువ అతనికి తెలిసే వాతావరణం ఉండేలా చూడాలనీ మహారాణిగారు ఆనాడే ఆజ్ఞాపించారు.." వీరధర్మ ఆలోచనలను పసికట్టి నట్టు అన్నాడు మార్తాండుడు.

"ఆర్యా...జీవంతక మహారాజు కళ్ళు గప్పి, ధీరేంద్రులను ఎలా పెంచగలిగారు?" వీరధర్మ అడిగాడు. "ఆశ్రమం రాజధానికి సమీపంలోనే ఉంది కదా?"

"జీవంతకుడికీ, లోకానికీ సంబంధించినంత వరకూ, తెలిసినంత వరకూ ధీరేంద్రుడు నా చెల్లెలి కొడుకు! తల్లీ తండ్రీ ఇద్దరూ లేని అనాథ! మేనమామ పోషణలో పెరిగిన పేదవాడు!" మార్తాండుడు చిరునవ్వుతో అన్నాడు. "ధీరేం ద్రుడి జన్మరహస్యం ఇప్పటిదాకా తెలిసిన వాళ్ళు ఇద్దరే. మహారాణి మందిరాదేవి, మార్తాండుడు! తనెవరో ధీరేంద్రుడికి తెలిసింది జీవంతకుడు అంతమైన రోజే!"

"మహా రహస్యంగా ఉంచారన్నమాట!" వీర ధర్మ అన్నాడు.

**(ఇంకావుంది)**

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## రికరెంట్ యూరినరీ ట్రాక్ట్ ఇన్‌ఫెక్షన్స్ నివారణ సులభం

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్



నా వయస్సు 28 సం॥లు. నేనొక గృహిణిని. గత కొంత కాలంగా తరచూ మూత్రంలో మంట, నడుమునొప్పి వంటి సమస్యలతో నేను బాధ పడుతున్నాను. మందులు వాడినంత కాలం మేరకు బాగానే ఉన్నట్లు అనిపించినా, తిరిగి మరలా తరచూ ఈ సమస్య నాకు ఎదురవుతుండటంతో డాక్టరు గారిని సంప్రదిస్తే మూత్ర వ్యవస్థలో ఇన్‌ఫెక్షన్ వలన ఇలాంటి సమస్య ఉత్పన్నమవుతోందని చెప్పారు. నా ఈ సమస్యకు హోమియోపతి చికిత్స ద్వారా శాశ్వత పరిష్కారం లభించే అవకాశం ఉందా? నాకు సలహా ఇవ్వగలరు.

యూరినరీ ట్రాక్ట్ ఇన్‌ఫెక్షన్:

మూత్రమార్గం యొక్క భాగాలు సంక్రమణకు (Infection) గురి కావడాన్ని యూరినరీ ట్రాక్ట్ ఇన్‌ఫెక్షన్ అని అంటారు.

- తరచూ ఈ పరిస్థితి ఏర్పడితే దీనిని Recurrent Urinary Tract Infection అని అంటారు.
- దీర్ఘకాలికంగా ఈ పరిస్థితి కొనసాగితే దీనిని క్రానిక్ యూరినరీ ట్రాక్ట్ ఇన్‌ఫెక్షన్ అని అంటారు. దీని వలన మూత్ర వ్యవస్థ విఫలమయ్యే అవకాశాలు ఎక్కువగా ఉంటాయి.

ప్రతి సంవత్సరం దాదాపు 150 మిలియన్ల మంది ఈ మూత్రకోశ సంక్రమణ (Urinary Tract Infection) తో బాధ పడుతున్నారంటే ఈ వ్యాధి తీవ్రత ఎంతగా ఉందో మనం ఊహించవచ్చు. ఇది చిన్నపిల్లలలో మరియు పురుషులలో కంటే స్త్రీలలో, యురేత్ర చిన్నదిగా ఉండటం వలన స్త్రీలలో ఈ సమస్య ఎక్కువగా కనిపిస్తుంది. తరచూ వేధించే ఈ సమస్య 16-35 సం॥ల వయస్సు వారిలో ఎక్కువగా కలిగే అవకాశం ఉంటుంది.

యూరినరీ ట్రాక్ట్ ఇన్‌ఫెక్షన్ 2 రకాలు:

మొదటిది Upper Urinary Tract Infection మరియు
రెండవది Lower Urinary Tract Infection.



(1) అప్పర్ యూరినరీ ట్రాక్ట్ ఇన్‌ఫెక్షన్: మూత్రపిండాలు, మూత్రనాళాలు ఇన్‌ఫెక్షన్‌కు గురికావడం.

లక్షణాలు: నడుము నొప్పి, కడుపు భాగానికి ఇరువైపులా నొప్పి (Flank Pain), చలితో కూడిన జ్వరం, మూత్రంలో మంట, వికారం, వాంతుల వంటి లక్షణాలను గమనించవచ్చు.

(2) లోవర్ యూరినరీ ట్రాక్ట్ ఇన్‌ఫెక్షన్: దీనిలో మూత్రాశయం మరియు యురేత్ర (మూత్రాశయం నుండి వెలుపలికి వెళ్ళే మార్గము) ఇన్‌ఫెక్షన్‌కు గురికావడం.

లక్షణాలు: పొత్తికడుపులో నొప్పి, తరచూ "మూత్రానికి వెళ్ళాలి" అనిపించటం, మూత్రంలో మంట మరియు నొప్పి, మూత్రంలో రక్తం లేదా చీము కనిపించడం వంటి లక్షణాలు గమనించవచ్చు.

చిన్నపిల్లలలో: వీరిలో జ్వరం, ఆహారం సరిగా తీసుకోకపోవడం, వాంతులు, ఎక్కువ సమయం నిద్రపోవడం, మూత్ర విసర్జనపై నియంత్రణ కోల్పోవడం వంటి లక్షణాలను గమనించవచ్చు.




కారణాలు: 80-85% బ్యాక్టీరియా ముఖ్యంగా (E. Coli) ఇ. కోలీ వైరస్ మరియు ఫంగస్ యురేత్ర ద్వారా గానీ, రక్తప్రవాహము ద్వారా గానీ, లింఫ్ లేదా ప్రేగుల నుండి గానీ మూత్రవ్యవస్థకు చేరే అవకాశం ఉంటుంది. • రోగనిరోధక వ్యవస్థ బలహీనపడటం • పరిశుభ్రత పాటించకపోవడం, క్యాథిటర్స్, గర్భధారణ సమయంలో • మూత్రమార్గము అసాధారణంగా ఏర్పడటం • సంభోగం వలన, ఋతుచక్రము ఆగిపోయిన స్త్రీలలో • పురుషులలో ప్రోస్టేట్ గ్రంథి దీర్ఘకాలిక శోథము • కొన్ని దీర్ఘకాలిక ఆరోగ్య సమస్యలు: డయాబెటిస్, కిడ్నీలో రాళ్ళు, వెన్నుపామునకు దెబ్బ తగలడం వలన మూత్రవిసర్జన సరిగా లేకపోవటం • చిన్నపిల్లలలో మూత్రము అసాధారణ రీతిలో మూత్రాశయంలోకి, మూత్రనాళాలు లేదా మూత్రపిండాలకు ప్రవహించటం వంటి అంశాలన్నీ ఈ మూత్రకోశ సంక్రమణకు కారణాలు అవుతాయి.

దుష్ప్రభావాలు:

- సరైన చికిత్స తీసుకోకపోవడం వలన దీర్ఘకాలిక ఇన్‌ఫెక్షన్‌కు గురై మూత్రపిండాలు పాడైపోవడం.
- ఇన్‌ఫెక్షన్ కలిగించే బ్యాక్టీరియా రక్తప్రవాహంలో కలిస్తే సెప్సిస్ వంటి ప్రాణాంతక పరిస్థితి కలిగే అవకాశం ఉంటుంది.
- గర్భధారణ సమయంలో - పిల్లలు తక్కువ బరువుతో పుట్టడం వంటి దుష్ప్రభావాలు కలిగే అవకాశం ఉంటుంది.

హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:

మూత్రవ్యవస్థ తాలూకు ఇన్‌ఫెక్షన్లను సాధ్యమైనంత త్వరలో నయం చేయడంలో హోమియోమందులు ఎంతగానో సహాయపడతాయి. మూత్రవ్యవస్థకు సంబంధించిన ఇన్‌ఫెక్షన్లకు గురి కావడానికి శరీరంలో రోగనిరోధక శక్తి బలహీనపడటమే ప్రధాన కారణం. హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో జెనెటిక్ కాన్‌స్టిట్యూషనల్ పద్ధతిలో వ్యాధి లక్షణాలతో పాటుగా రోగి యొక్క మానసిక, శారీరక సమస్యలను కూడా పరిగణనలోకి తీసుకుంటారు. తద్వారా వ్యక్తి శరీరంలోని రోగనిరోధక శక్తి మరింతగా ప్రేరేపితమై కిడ్నీల పనితీరు బాగా మెరుగుపడటంతో వాటి ఇన్‌ఫెక్షన్స్ తాలూకు సమస్యలు సంపూర్ణంగా పరిష్కరింపబడతాయి.

**ఉచిత కన్సల్టేషన్ 955 000 1188 / 99**

**www.homeocare.in**



# ఆరోగ్య దేవతలు మన నర్సులు

కొందరికి ఈ ప్రపంచం రణభూమి. మరికొందరికి భోగలాలసాల విడిది. ఇంకొందరికి కష్టాల కొలిమి. కానీ 'వారికి' మాత్రం ఈ ప్రపంచం ఒక సేవా కేంద్రం. కళ్ళల్లో కరుణ రసం, నిలువెల్లా సేవాభావం వారి నైజం. శిరస్సునుండి పాదాల వరకు ధవళకాంతులీనే వస్త్రాలు ధరించి చేతిలో మెడికల్ ట్రేతో అందరి బాగోగులూ గమనించుకుంటూ వైద్య శాలల్లో సందడి చేస్తారు.

వారితో మనకు ఏ బంధం లేకపోయినా కంటిపాపలా మనల్ని కాచుకుంటారు. ప్రాణాంతక వ్యాధులు వచ్చినప్పుడు అక్కున చేర్చుకునే ప్రేమమూర్తులు వారు. బతుకుపై ఆశలు సన్నగిల్లుతున్న వేళ మనలో విశ్వాసం నింపి బతుకుపై ఆశ పుట్టించి స్వస్థత చేకూర్చే భూలోక ఆరోగ్య దేవతలు మన నర్సులు.

మానవసేవే మాధవ సేవ అన్న ఆర్యోక్తిని అక్షరాలా పాటిస్తారు. చాలీ చాలని జీతాలు, సూటిపోటి మాటలూ భరిస్తూ, ఎంతో ఓపికగా మన బతుకులను వెలిగించాలని చూసే స్వచ్ఛమైన సేవకులు వారు.

### నర్సుల దినోత్సవ నేపథ్యమిదీ

యుద్ధం ప్రకృతి వైపరీత్యాల వల్ల, ప్రమాదాల్లో గాయపడిన క్షతగాత్రులను ఆదరించి వారి గాయాలకు ప్రథమ చికిత్సలు చేసిన నిస్వార్థ సేవకురాలు ఫ్లోరెన్స్ నైటింగేల్. క్షతగాత్రులకు మానసిక ధైర్యం అందించి ఆరోగ్య దేవతలా ఆమె చేసిన కృషి ఫలితమే ప్రపంచ నర్సుల దినోత్సవం. రోగులకు సేవలందించడంలో వైద్యుల కన్నా నర్సులే ఎక్కువ మానసిక ప్రశాంతతతో విధులు నిర్వహించాలనేది ఫ్లోరెన్స్ నైటింగేల్ ఆశయం. ఆ ఆశయ ఫలితమే ఇంటర్నేషనల్ కౌన్సిల్ ఫర్ నర్సెస్ (ఐసీఎల్) 1965లో నర్సింగ్ డేను గుర్తించింది. ఆ తర్వాత 1974లో అమెరికా ప్రభుత్వం తాత్కాలికంగా ఈ వేడుకలను ఆమోదించింది. 1999లో



**మే 12వ తేదీ అంతర్జాతీయ నర్సుల దినోత్సవం సందర్భంగా...**

నర్సెస్ అండ్ పబ్లిక్ సెక్టార్ ఎంప్లాయిస్ యూనియన్ నర్సింగ్‌డేకు ప్రాముఖ్యమిచ్చింది. ఈ వేడుకలను మే 9 నుంచి 15వ తేదీ వరకు ఏటా వారోత్సవాలుగా నిర్వహించాలని 1974లో యూఎస్, కెనడా ప్రకటించాయి. ఫ్లోరెన్స్ నైటింగేల్ జన్మదినమైన మే 12న వరల్డ్ నర్సింగ్ డే వేడుకలు నిర్వహించాలని నిర్ణయించాయి. అప్పటి నుంచి ఏటా వరల్డ్ నర్సింగ్ డే పాటిస్తున్నారు.

### ఆది గురువు

నర్సు వృత్తికి ఆది గురువు ఫ్లోరెన్స్ నైటింగేల్. యుద్ధంలో దెబ్బతిన్న సైనికులకు ఆమె అంకిత భావంతో సేవలు చేసింది. లాంతర్ పట్టుకుని తిరుగుతూ గాయపడిన వారికి వైద్యం అందించింది. అందుకే ఆమెను లేడీ విత్ ద ల్యాంప్ అని కూడా పిలుస్తారు. 1854-56 మధ్య క్రిమియాలో ఘోర యుద్ధం జరిగింది. యుద్ధంలో గాయపడిన సైనికులకు తోటి వారిని కూడగట్టి నిరుపమానమైన సేవలందించింది నైటింగేల్. యుద్ధంలో గాయపడిన ప్రతి సైనికుడికి ధైర్యం నూరిపోసి ప్రతిఒక్కరిలో బతుకుతానన్న ఆశలు చిగురింపజేసింది. ఉన్నత వ్యక్తిత్వం కలిగిన నైటింగేల్ సమాజంలోని అసమానతలను ఎదిరించిమరీ నర్సింగ్ కోర్సు చదివింది. అవివాహితలు ఇంటిపనులు, చర్చిపనులు మాత్రమే చేయాలని చెప్పేరోజుల్లో, స్త్రీలు ఇంటిపట్టునే ఉండాలన్న కట్టుబాట్లను ఛేదించింది ఆమె. 1959లో నోట్స్ ఆఫ్ నర్సింగ్ అనే పుస్తకం ప్రచురించడమే కాదు, ప్రపంచంలోనే తొలి నర్సుల శిక్షణా కళాశాల స్థాపించింది. ఆమె చేసిన సేవలకు గానూ లేడీ విత్ ద ల్యాంప్ అనే బిరుదును సంపాదించింది.

### సహాయం చేసే చేతులే మిన్న

'ప్రార్థించే చేతుల కన్న సేవలు చేసే చేతులు



# యువ నర్సులలో ఒత్తిడి

నర్సులు ఎదుర్కొంటున్న ఒత్తిడి మీద ఇటీవల ఒక సర్వే నిర్వహించారు. ఈ సర్వేలో మొత్తం 285 మంది నర్సులు పాల్గొన్నారు. జనరల్ వార్డుల్లో పనిచేస్తున్న వారిని ఒక వర్గంగా, కీలకమైన వార్డుల్లో పనిచేస్తున్న వారిని ఇంకో వర్గంగా ఇలా రెండు వర్గాల నర్సుల మీద పరిశోధనలు జరిగాయి. ఇందులో మొత్తం 50 శాతం మంది నర్సులు అధిక ప్రమాణంలో ఒత్తిడితో బాధపడుతున్నట్లు తేలింది. అంతేకాకుండా యువ నర్సులు అంటే 35 సంవత్సరాల కన్నా తక్కువ వయసుగల నర్సులు అంతకన్నా ఎక్కువ వయసుగల ఇతర నర్సుల కన్నా ఎక్కువ ఒత్తిడికి గురవుతున్నారని అధ్యయనంలో వెల్లడైంది. ఈ సర్వే ప్రకారం మోడరేట్ స్ట్రెస్ ప్రమాణాలు 57.8 శాతం ఐసీయూ నర్సుల్లో ఉంటే అంతకన్నా ఎక్కువ స్ట్రెస్ ప్రమాణాలు వార్డుల్లో పనిచేసే 54.5 శాతం నర్సుల్లో గుర్తించారు. యంగ్ నర్సులకు సంబంధించి చూస్తే వార్డుల్లో 67.7 శాతం మంది జనరల్ వార్డుల్లో పనిచేస్తుంటే 97.8 శాతం మంది ఐసీయూల్లో పనిచేస్తున్నారు. వీరు మోడరేట్ స్ట్రెస్‌ను ఎదుర్కొంటున్నారు. వార్డుల్లో ఐసీయూల్లో పనిచేస్తున్న 35 సంవత్సరాలు దాటిన నర్సులు 50 శాతం 54 శాతం క్రమంలో ఒత్తిడిని ఎదుర్కొంటున్నారు. చిన్నవాళ్ళు పెళ్ళికాని నర్సులు కాంప్లెక్స్ పేషెంట్లను చూడాల్సి వస్తుంది. అంతేకాదు టెక్నాలజీ భారం కూడా వీరిపై పడుతోంది. ఇవే కాకుండా వర్క్‌లోడ్ సామాజిక అండదండలు వంటివి లోపించడం వల్ల కూడా వార్డుల్లో ఐసీయూల్లో పనిచేస్తున్న నర్సులు తీవ్ర ఒత్తిడికి గురవుతున్నారు.



మిన్న' అని చెప్పింది మదర్ థెరెసా. ఆమె అసలు పేరు ఆగ్నస్ గోక్షా బొజాక్షువు. 1910, ఆగస్టు 26వ తేదీన దక్షిణ యుగోస్లేవియా దేశం మాసిడోనియాలో అల్బేనియనస్ సంతతికి చెందిన కుటుంబంలో జన్మించింది. మానవసేవే మాధవ సేవ అనే నానుడిని జీవితంలో ఆచరించి చూపిన సన్యాసిని థెరెసా. మొదటిసారి 1929లో మన దేశానికి సన్యాసినిగా వచ్చి హిమాలయ సానువులు డార్జిలింగ్‌లో మిషనరీ జీవితం ప్రారంభించింది. థెరెసాగా మారింది.

తర్వాత కలకత్తా లొరెటో కాన్వెంట్‌స్కూల్‌లో ఉపాధ్యాయినిగా జీవితం ప్రారంభించింది. వ్యాధిగ్రస్థులను, పేదవారిని చూసి చలించిపోయి వారికి సేవలు చేస్తూ తన జీవితాన్ని గడిపింది. ఆ సేవలకు గుర్తింపుగా 1979లో నోబెల్ శాంతి పురస్కారం, పిమ్మట 1980లో సర్వోన్నతమైన భారతరత్న పురస్కారాలు ఆమెకు ఆభరణాలై నిలిచాయి.

### సవాళ్లు, సమస్యలు

నిజానికి వైద్యులు అందించే సేవల కంటే నర్సులు అందించే సేవలు అమూల్యమైనవి. డాక్టర్లు వ్యాధికి చికిత్స చేస్తారు. మందులు రాసిస్తారు. అవసరమైతే ఆపరేషన్లు చేస్తారు. కానీ రోగి ఆస్పత్రిలో చేరింది మొదలు తిరిగి ఇంటికి వెళ్లే వరకు నర్సులు అందించే సేవలే రోగిని త్వరగా కోలుకునేలా చేస్తాయి. కేవలం సేవలు మాత్రమే కాదు, రోగికి కావల్సిన మనోధైర్యాన్ని స్తారు. వారికున్న సమస్యను పక్కన బెట్టి చిరునవ్వుతో ఆదరిస్తారు. పనికి తగిన వేతనం లభించకపోవడం ఒక కారణం అయితే సిబ్బంది కొరత, రాత్రివేళల్లో మెలకువతో అప్రమత్తంగా ఉంటూ రోగులకు సమయం ప్రకారం చికిత్సలు అందించడం, పనిభారం, అభద్రత, వేధింపులు, దాడులు వంటి వృత్తిపరమైన సమస్యలను, సవాళ్ళను నర్సులు ఎదుర్కొంటున్నారు. హాస్పిటల్లో ఎలాంటి సమస్యలున్నా సరే వారిదేతప్పు అన్నట్లుగా మాట్లాడి వారిపై దాడులకు పాల్పడేవాళ్లూ ఉన్నారు. ఈ సమస్యలు ఎంతలా సమాజంలో వేళ్లూనుకు పోయాయంటే నర్సు ఉద్యోగం అంటేనే వద్దనే స్థాయికి వచ్చాయి. గ్రామీణ ప్రాంతాల్లో పనిచేసే నర్సుల కష్టాలు చెప్పతరం కాదు. వారు ఊరూరా తిరిగి ప్రజల ఆరోగ్య స్థితిగతులు తెలుసుకోవాలి. ఈ సమయంలో అక్కడి ప్రజలు, రాజకీయ నాయకుల నుంచి కూడా ఇబ్బందులు, ఒత్తిళ్ళు ఎదురవుతాయి. ప్రభుత్వం ఆసుపత్రుల వద్ద వీరికి సెక్యూరిటీ కల్పిస్తానని హామీ ఇచ్చినా అది ఇంతవరకూ ఆచరణ సాధ్యం కాలేదు. ఎలాంటి శిక్షణాలేని గార్డుల సమక్షంలోనే వారు పని చేయాల్సి వస్తోంది.

## నైట్‌షిఫ్ట్‌లతో గుండెజబ్బు

సూర్యుడు ఎప్పుడు ఉదయిస్తాడో తెలియదు. చంద్రుడు ఎప్పుడు అస్తమిస్తున్నాడో తెలియడం లేదు. నేటికాలంలో ఉద్యోగాల తీరు అలా ఉంది. పోనీ ఉద్యోగం మానేద్దామా అంటే ఇల్లు గడిచే స్థితి ఉండదు. టెక్నాలజీ పుణ్యమాని ఇప్పుడు నైట్‌షిఫ్ట్ ఉద్యోగాలు ఎక్కువయ్యాయి. ఇక్కడ రాత్రి అయితే అమెరికాలో పగలు ఉంటున్నది. దీంతో ఇక్కడ నైట్‌షిఫ్ట్ చేయాల్సిన పరిస్థితులు ఏర్పడుతున్నాయి. ఒక్క ఐటీలోనే కాదు వైద్య రంగంలో కూడా నైట్‌షిఫ్ట్ ఉద్యోగాలు ఎక్కువగా ఉంటాయి. రోగులకు నిరంతర వైద్యం అందించేందుకు హాస్పిటల్స్‌లో డాక్టర్లు, నర్సులు ఎల్లప్పుడూ అందుబాటులో ఉండడం తప్పనిసరి. నైట్‌షిఫ్ట్‌లో పనిచేసే మహిళా డాక్టర్స్, నర్సులు ఎక్కువగా గుండెజబ్బుల బారిన పడుతున్నారని అమెరికాకు చెందిన 'జామా' మ్యాగజైన్ వెల్లడించింది. పదేళ్ల పాటు రొటేషన్ పద్ధతిలో నైట్ షిఫ్ట్ ఉద్యోగాలు చేస్తే గుండె జబ్బులు వచ్చే అవకాశం 15 నుంచి 18 శాతం ఎక్కువగా ఉంటుందని తాజా నివేదికను బట్టి తెలుస్తుంది.



### నర్సుల కొరత

మన దేశ అవసరాలకు తగిన రీతిలో నర్సుల సంఖ్య పెరగడం లేదు. ఇప్పటికీ నర్సుల కొరత తీవ్రంగానే ఉంది. ప్రపంచ ఆరోగ్య సంస్థ లెక్కల ప్రకారం ప్రతి 500 మంది జనాభాకు ఒక నర్సు అవసరం. కానీ మనదేశంలో ప్రతి 1100 మందికి ఒక నర్సు ఉన్నారు. ఆసుపత్రిలో ప్రతి ఐదుగురు రోగులకు ఒక నర్సు అవసరం. కానీ మన ప్రభుత్వ ఆస్పత్రుల్లో ఒక నర్సు 30 మంది రోగులకు సేవలందించాల్సి వస్తోంది. అంటే ఒక్కొక్క నర్సు ఐదురెట్ల పని భారం మోస్తున్నారన్నమాట. ఇలా పనిభారం పెరగడం వల్ల చిరునవ్వుతో వైద్య సేవలందించే సేవా మూర్తుల్లోనూ విసుగు కనిపిస్తోంది.

### కోర్సులపై పెరుగుతున్న ఆసక్తి

నర్సింగ్ కోర్సులపై రోజురోజుకు యువతలో ఆసక్తి పెరుగుతోంది. ఈ కోర్సు పూర్తి చేసిన వారికి ఉద్యోగ అవకాశాలు ఎక్కువగా ఉండడంతో ఆదరణతో పాటు డిమాండ్ పెరిగింది. జీఎన్ఎం, ఏఎన్ఎం, బీఎస్సీ నర్సింగ్, ఎమ్మెస్సీ నర్సింగ్, పీహెచ్‌డీ తదితర కోర్సులు అందించేందుకు ఇనిస్టిట్యూట్‌లు పోటీ పడుతున్నాయి. నర్సింగ్ కోర్సుల్లో ఏటా సుమారు 10 వేలకు పైగా విద్యార్థులు చేరుతుండడం గమనార్హం.

**- సంతోషలక్ష్మి దహగాం**



# కంరుగాడి కాశీయాత్ర

## - శివసతీపురం శర్మ

11

**ఘాట్‌లో ఏడుస్తున్న స్త్రీ, దిక్కులు చూస్తున్న మగాడూ ఉన్నారంటే కాశీ పండిట్‌లకి పండగే! దోచుకున్న వారికి దోచుకున్నంత అనుకుంటారు. ఏడుస్తున్న వాణిని చూశాడు. వాణిని ఓదార్చడం చాతకాక దిక్కులు చూస్తున్న కంరుని చూశాడు. పరుగున వచ్చాడక్కడికి పండిట్. వచ్చీరాని తెలుగులో అడిగాడు.**

"తెలుగా? హైదరాబాదా?"

"అవును" అన్నాడు కంరు.

"అస్థి విసర్జన చెయ్యాలా, పిండప్రదానం చెయ్యాలా? తర్పణం చెయ్యాలా? ఏం చెయ్యాలి?" అడిగాడు పండిట్.

"అస్థికలు నిమజ్జనం చెయ్యాలి." అంది వాణి.

"చేద్దాం. రండి" అని గంగవైపుగా దారి తీశాడు పండిట్. రెండు అడుగులు వేసి, వెనక్కి తిరిగి చూశాడు. కంరూ వాణీ కదలక నిల్చున్నారక్కడే!

"రండి సార్" పిలిచాడు పండిట్.

"ఏం తీసుకుంటారు?"

"అంతా టెన్ థౌజెండ్, ఎయిట్ థౌజెండ్ తీసుకుంటారు. నేను పాంచ్ హజార్, అయిదు వేలు తీసుకుంటాను."

"అస్థికలు నిమజ్జనం చెయ్యడానికి అయిదు వేలా?" ఆశ్చర్యపోయాడు కంరు.

"మరి? చాలా తతంగం ఉంటుంది."

"ఎంత తతంగం ఉంటే మాత్రం మరీ ఇంతా?"

"సరే! ఓ అయిదు వందలు తగ్గించుకోండి, రండి." గబగబా రెండు అడుగులు పైకి వేసి, వాణి చేతిలోని సంచీ లాక్కోబోయాడు. అందనీయలేదామె. సంచిని పండిట్‌కి దూరంగా నిలిపింది.



"అయిదు వందలిస్తాను, చేస్తావా?" అడిగాడు కంరు.

"అయిదు వందలకి అస్థికలు కాదు, నిన్ను నిమజ్జనం చేస్తాను. ఛూ! పొద్దున పొద్దున్నే గొప్ప బేరం." అన్నాడు పండిట్. వెళ్ళిపోయాడు.

మెట్లు దిగి, విసురుగా వస్తున్న పండిట్‌ని, మరో పండిట్ కలిశాడు. ఇద్దరూ ఏదో మాట్లాడుకున్నారు. మాట్లాడుకుంటూ కంరూ వాణిలను చూశాడు రెండో పండిట్. మెట్లెక్కి వారి దగ్గరగా వచ్చాడు.

"చార్ హజార్! నాలుగు వేలు ఇవ్వండి. రండి." అన్నాడు.

"ఫైవ్ హండ్రడ్! అయిదు వందలు." అన్నాడు కంరు.

"అరె" ఆశ్చర్యపోయాడు పండిట్.

"చల్! తీన్ హజార్"

"ఫైవ్ హండ్రడ్" పట్టు వదల్లేదు కంరు. పండిట్‌లు బాగా పిండుతారనీ, వారితో జాగ్రత్తగా వ్యవహరించాలనీ రాత్రి ఏదో సందర్భంలో మోహన్ చెప్పినట్టు గుర్తు. అందుకే పట్టుబట్టి నిల్చున్నాడు కంరు.

"అయిదువందలకి అస్థి విసర్జన కాదు" కుడి చేతి చిటికెన వేలు చూపించాడు పండిట్.

"ఈ విసర్జన కూడా రాదు" అన్నాడు. కంరుని కోపంగా చూసి వెళ్ళిపోయాడు.

"వెయ్యి రూపాయలకి వస్తాడేమో" అంది వాణి.

"రాడమ్మా! మూడు వేలకి తక్కువ రారెవరూ. ఇదో పెద్ద వ్యాపారం." చెప్పాడు బైరాగి. కేదారేశ్వరాలయంలో కనిపించిన బైరాగి. అంతా గమనించినట్టుగా మాట్లాడసాగాడు.

"ఈ శరీరం పంచభూత నిర్మితం తల్లీ! ఇది నిప్పు, నీరు, గాలి, భూమి, ఆకాశాలతో నిర్మితమైంది. శవదహనంతో ఈ శరీరంలోని పంచభూతాలూ పంచభూతాల్లో కలిసిపోతాయి. మిగిలిన ఆ అస్థికలూ, బూడిదా ఎక్కడ కలిపినా కలపకపోయినా ఒక్కటే! కాకపోతే చనిపోయిన వ్యక్తి ఆత్మ శాంతికోసం కాక మీ మనశ్శాంతి కోసం నిమజ్జనం తప్పదనుకుంటే... రండమ్మా! నేను దగ్గరుండి నిమజ్జనం చేయిస్తాను." అన్నాడు బైరాగి. ముందుకు నడిచాడు. ఒకరిని ఒకరు చూసుకుని, వాణీ, కంరూ అతన్ని అనుసరించారు.

ముగ్గురూ గంగను సమీపించారు. పడవ ఎక్కారు.

"అవతలి గట్టుకు పోనీయ్" హిందీలో చెప్పాడు బైరాగి.

కుర్రాడు పడవను అవతలి గట్టుకు పోనిచ్చాడు.

"ఆ సంచి ఆయనకిచ్చి, నువ్వు గంగలో స్నానం చెయ్యమ్మా." చెప్పాడు బైరాగి. అతను చెప్పినట్టే చేసింది వాణి.

"ఇప్పుడు ఆ అస్థికలు తీసుకో."

తీసుకుంది వాణి. చిన్న కుండలో ఉన్నాయి అస్థికలు. అవి కనిపించకుండా మూతగా గుడ్డ కట్టి ఉంది.

"ఆ గుడ్డ తొలగించి, రెండు చేతులా ఆ కుండ పట్టుకుని, ఆ అస్థికలు ఎవరివో, ఆయన పట్ల నీ గౌరవాన్నీ, మమకారాన్నీ అన్నీ గుర్తు చేసుకోమ్మా! అదే ప్రార్థన." చెప్పాడు బైరాగి.

కళ్ళు మూసుకుంది వాణి. భర్తను గుర్తు చేసుకోసాగింది.

ముద్దులు, మురిపాలు, బుంగమూతులు, బిగి కౌగిళ్ళు, కోపాలు, తాపాలు, తిట్లు, రాట్లు, క్షమాపణలు, వేడుకోళ్ళు...అన్నీ గుర్తు చేసుకుంది. కన్నీళ్ళొచ్చాయి ఆమెకు. ఏడుస్తూ కళ్ళిప్పింది.

"ఇప్పుడు ఆ కుండని తల మీదుగా వెనక్కి పెట్టి, అటు చూడకుండా గంగలో పడేట్టుగా అస్థికల్ని జారవిడువమ్మా."

విడిచింది వాణి. ఆఖరికి కుండను కూడా జారవిడిచింది. జార విడిచి, పడవలో కుప్పకూలిపోయింది. గొల్లుమంది.

"ఊరుకోమ్మా! ఊరుకో" ఓదార్చాడు బైరాగి.

"సుఖదుఃఖాలు రెండూ వేరు వేరు కాదమ్మా! రెండూ ఒకటే! ఒకే నాణెమునకుకి గల బొమ్మా-బొరుసులాంటివవి. నువ్వు బొమ్మ కావాలనుకుని, బొరుసును కాదనలేవు. నాణెమును విసిరేయలేవు. ఎందుకంటే... నాణెమునకు రెండు వైపులా రెండూ ఉన్నాయి. కావాలనుకుంటే రెంటినీ నువ్వు కావాలనుకోవాలి. కాదనుకుంటే రెంటినీ నువ్వు కాదనుకోవాలి. నువ్వు సుఖాన్ని కాదనుకుంటే దుఃఖాన్నీ కాదనుకున్నట్టే! నువ్వు సుఖాన్ని ప్రేమించి, దాన్ని ఆనందంగా అనుభవించదలచుకుంటే...దుఃఖాన్ని కూడా నువ్వు ప్రేమించి ఆహ్వానించగలగాలి. చెప్పింది అర్థం చేసుకోమ్మా! అర్థం చేసుకుంటే ఏ బాధలూ ఉండవు. అంతా ప్రశాంతంగా ఉంటుంది. నా మాట విను. కళ్ళు తుడుచుకోమ్మా." అన్నాడు బైరాగి.

కళ్ళు తుడుచుకుంది వాణి.

"వెళ్ళి రండి" అన్నాడు బైరాగి.

"మీరు?" అడిగాడు కంరు. బైరాగి అవతలి గట్టునే ఉండిపోతాడన్న అనుమానం ఎందుకో కలిగింది అతనికి. ఆ అనుమానం నిజం చేశాడు బైరాగి.

"నేనిక్కడ కాసేపు ఉంటాను. మీరు వెళ్ళిరండి." అన్నాడు.

"మనిషికి వంద చొప్పున మూడు వందలూ, ఇంకా మీకేమైనా ఇవ్వాలనుకుంటే పడవ నడిపే కుర్రాడికి ఇవ్వండి, ఆనందిస్తాడు." అన్నాడు బైరాగి. వెళ్ళిపోయాడక్కణ్ణుంచి.

టైమ్ చూశాడు కంరు. అప్పటికే ఆరు దాటింది.

"వేగంగా పోనీ" పడవ నడిపే కుర్రాడికి చెప్పాడు కంరు.

సర్రు సర్రున పడవ నడిపి, ఇవతలిగట్టుకు



చేర్చాడు కుర్రాడు. వాడికి అయిదువందలిచ్చి, గబగబా లాడ్జింగ్‌కి చేరుకున్నారు వాణీ-కంఠూ. ఆసరికే ప్రయాణానికి సిద్ధంగా ఉన్నారంతా. అన్నీ కానిచ్చుకుని, అయిదు నిమిషాల్లో కంఠు కూడా సిద్ధమయ్యాడు. టాక్సీ దగ్గరకు బయల్దేరారంతా.

లాడ్జింగ్‌కి దూరంగా, చౌరస్తాకి దగ్గరగా టాక్సీ ఉందట! గల్లీల్లోకి దాన్ని రానివ్వరట! అక్కడికి నడవండన్నాడు రిసెప్షనిస్ట్. నడిచారంతా. కాస్తంత దూరంలో కనిపిస్తున్న ఇన్నోవా తమదే అనుకున్నారు. నిజమయిందది. అయిదుగురూ ఎక్కి కూర్చున్నారందులో.

"డ్రైవర్‌కి అయిదు వేలు ఇవ్వండి." చెప్పాడు రిసెప్షనిస్ట్. సరే అన్నారు. ఇన్నోవా బయల్దేరింది. ఉదయం ఏడవుతున్నా చలిచలిగా, మంచు మంచుగా ఉందంతా. ఇంకా రాదారి దీపాలు వెలుగుతూనే ఉన్నాయి.

"నీ పేరేంటబ్బాయ్?" డ్రైవర్ని అడిగింది నిర్మల.

"రాజేష్" చెప్పాడు డ్రైవర్.

తెల్లగా ఉన్నాడు రాజేష్. కొంచెం పొట్టిగా ఉన్నా కళగా ఉన్నాడు. వయసు పాతిక లోపే ఉంటుంది.

"ఇక్కణ్ణుంచి గయ ఎన్ని కిలోమీటర్లు?" అడిగాడు సుబ్బారావు.

"రెండువందల డెబ్బయి అయిదు"

"గయ, బోధ్‌గయ చూసుకుని మళ్ళీ మనం కాశీ వచ్చేసరికి ఎంతవుతుంది?" అడిగాడు డాక్టర్‌బాబు.

"రాత్రి ఏడెనిమిది అవుతుంది."

"ఇక్కడ వేడి వేడి చాయ్ ఎక్కడ దొరుకుతుంది రాజేష్?" అడిగాడు కంఠు.

"ఇక్కడ" అంటూ ఇన్నోవాను ఆపి నవ్వాడు రాజేష్.

ఓ ఇంటి చూరులో చాయ్‌పెట్టి అమ్ముతున్నారక్కడ. బాగానే ఉన్నారు చాయ్ ప్రియులు.

> **సుఖదుఃఖాలు రెండూ వేరు వేరు కాదు, నాణెమునకు బొమ్మా బొరుసూ లాంటివి. బొమ్మ కావాలనుకుని, బొరుసును కాదనలేం. కావాలనుకుంటే రెంటినీ కావాలనుకోవాలి. కాదనుకుంటే రెంటినీ కాదనుకోవాలి అదేవిధంగా సుఖాన్ని అనుభవించ దలుచుకుంటే దుఃఖాన్ని కూడా ఆహ్వానించగలగాలి. నాలుగు ముక్కల్లో జీవిత పరమార్థాన్ని వాణి, కంఠులకు వివరించాడు బైరాగి. అతడిదంతా ఎందుకు చెప్పాడు? ఏ సందర్భంలో చెప్పాడు?**

"ఆరు చాయ్" అరిచాడు రాజేష్.

వచ్చాయి. చాయ్‌ని మట్టి పిడతల్లో అందజేశారు. తాగితే వేడిగా బాగానే ఉంది. అయిదు రూపాయలే! కడుపులో వేడి వేడి చాయ్ పడడంతో వెచ్చదనాన్ని కౌగిలించుకున్నట్టుగా ఉంది. మంచి హిందీ పాటలు పెట్టాడు రాజేష్. వింటూ హైవే ఎక్కారు.

హైవే మీద అది లారీల సంతకాదు. ఓయమ్మో! ఎన్ని లారీలో! ఒక్కొక్కటి మెట్రోట్రైన్‌లా ఉన్నాయి. దారి పొడవునా క్యూలో నడుస్తూ ఉన్నాయి. వాటి మధ్య ఇన్నోవా పిచ్చుకలా ప్రయాణిస్తోంది.

ఉదయం ఎనిమిది అయినా పొగమంచు దట్టంగా కురుస్తూనే ఉంది.

అంతా స్వెట్టర్లు వేసుకుని, మఫ్లర్లు బిగించి కూర్చున్నారు.

"ఇదిగో రాజేష్! పూరీ ఉప్మా, ఇడ్లీ వడ లాంటివి దొరికే మంచి హోటలెక్కడుందో అక్కడాపు. టిఫిన్ చేసి బయల్దేరుదాం." అన్నాడు సుబ్బారావు.

"ఓకే సార్"

"గయ గురించి విషయ విశేషగళు సరదాగా చెప్పమంటార్రా?" మిత్రబృందాన్ని అడిగాడు సుబ్బారావు.

"ఊసుపోవాలి కదా! ఏదో ఒకటి చెప్పి తగలడు." అన్నారంతా. చెప్పసాగాడిలా సుబ్బారావు.

"ఇప్పుడు మనం వెళ్తున్నది శిరోగయ. ఇదికాక దేశంలో ఇంకా రెండు గయలు ఉన్నాయి. అవి నాభిగయ, పాదగయ. నాభిగయ ఒరిస్సాలో కటక్ దగ్గరగా ఉన్న జాజ్‌పూర్‌లో ఉంది. పాదగయ ఆంధ్రప్రదేశ్‌లో పిఠాపురంలో ఉంది."

"నీకు చాలా విషయాలు తెలుసురా. యు ఆర్ వెరీ క్లవర్.' సుబ్బారావును వ్యంగ్యంగా మెచ్చుకున్నాడు డాక్టర్‌బాబు.

"తెలుసు కాబట్టే చెబుతున్నావండీ! దయచేసి వినండి." అన్నాడు సుబ్బారావు. చెప్పసాగాడిలా.

"పూర్వం గయాసురుడని ఓ రాక్షసుడు ఉండేవాడు. రాక్షసుల్లో వాడు తప్పుబుట్టాడు. దైవభక్తి ఎక్కువ వాడికి. విష్ణుమూర్తి కోసం తీవ్రంగా తపస్సు చేశాడు. ఫలించింది. విష్ణుమూర్తి ప్రత్యక్షమయ్యాడు. ఏం కావాలో కోరుకో అన్నాడు. గయాసురుడు ఏం కోరుకున్నాడో తెలుసా?"

"తెలీదు. ఏం కోరుకున్నాడు?"

"భూమి మీది తీర్థాలన్నిటి కన్నా తన శరీరం పవిత్రమైంది కావాలని కోరుకున్నాడు. సరేనన్నాడు విష్ణుమూర్తి. దాంతో గయాసురుణ్ణి సందర్శించిన ప్రతి జీవీ పాపాలు పోగొట్టుకుని, పుణ్యాన్ని సంపాదించుకుని స్వర్గానికి చేరుకోసాగాయి. అది అలా ఉండగా మనవాడు చేసిన యాగాల కారణంగా వాడికి ఇంద్రపదవి కూడా లభించింది."

"బాగుంది బాగుంది"

"గయాసురుడు మంచివాడే! కాకపోతే అతని అనుచరులే, మంచివారు కాదు. దాంతో వాళ్ళు పెట్టిన హింసలకు యజ్ఞయాగాదులు ఆగిపోయాయి. అవి ఆగిపోవడంతో దేవతలు శక్తులు కోల్పోయారు. ఎప్పుడైతే దేవతలు శక్తులు కోల్పోయారో ఇక అప్పటి నుంచీ వర్షాలు లేవు. వర్షాలు లేని కారణంగా పంటలు లేవు. దానాదీనా ప్రజలు పడరాని పాట్లు పడసాగారు. ఈలోపు పదవి పోయిన ఇంద్రుడు త్రిమూర్తుల కోసం తపస్సు చేసి, వారిని ప్రత్యక్షం చేసుకున్నాడు. ఏం కావాలంటే...గయాసురుణ్ణి వధించాలన్నాడతను. దేవతలకు అండగా నిలిచి, ప్రజలను రక్షించాలన్నాడు. అందుకు సరేనన్నారు త్రిమూర్తులు. గయాసురుణ్ణి లేపేసేటందుకు ప్లాన్ చేశారు."

"ఏంటో ఆ ప్లాను?"

"త్రిమూర్తులు ముగ్గురూ బ్రాహ్మణుల రూపంలో గయాసురుణ్ణి సందర్శించారు. విశ్వశాంతి కోసం తాము ఓ యాగం చేస్తున్నామన్నారు. సాయపడమన్నారు. ఎలాంటి సాయం కావాలో చెప్పండి అన్నాడు గయాసురుడు. దొరికాడనుకున్నారు త్రిమూర్తులు. చెప్పారిలా.

పుణ్యక్షేత్రాలన్నీ మానవుల పాపాలతో కలుషితం కావడంతో యజ్ఞాన్ని ఏ క్షేత్రంలోనూ చేయలేకపోతున్నాం అన్నారు. పైగా ఏడురోజులుపాటు సాగే ఆ యజ్ఞాన్ని భూమి భరించలేదన్నారు. అని, అన్ని పుణ్యక్షేత్రాల కన్నా గయాసురుడి శరీరం పరమ పవిత్రం కాబట్టి, అంగీకరిస్తే అతని శరీరాన్ని యజ్ఞవేదిక చేసుకుంటామన్నారు త్రిమూర్తులు. గయాసురుడు అందుకు ఒప్పుకున్నాడు. అయితే ఇక్కడే చిన్న ఫిటింగ్ పెట్టారు త్రిమూర్తులు."

"ఏంటో ఫిటింగు?"

"యజ్ఞం పూర్తి అయ్యే వరకూ ఈ ఏడు రోజులూ గయాసురుడు కదలకూడదు. కదిలితే యజ్ఞం ఆగిపోతుంది. అసంపూర్తిగా నిలిచిపోతుంది. అది మహాపాపం! ఆ పాపానికి ప్రాయశ్చిత్తంగా గయాసురుణ్ణి సంహరిస్తామన్నారు త్రిమూర్తులు. సరే అన్నాడు గయాసురుడు. శక్తి మేరకు యజ్ఞానికి అనువుగా శరీరాన్ని పెంచాడు. అప్పుడు అతని తల బీహారులోని గయలో నిలిచింది. నాభి ప్రాంతం ఒరిస్సాలోని జాజ్‌పూర్లో నిలిచింది. పాదాలు ఆంధ్రప్రదేశ్‌లోని పిఠాపురంలో నిలిచాయి. విష్ణువు తలభాగంలోనూ, బ్రహ్మ నాభి ప్రాంతంలోనూ, శివుడు పాదాల దగ్గరా కూర్చుని యజ్ఞాన్ని ప్రారంభించారు."

"తర్వాత"

"రాజేష్ ఇన్నోవా ఆపాడు. ఇదేదో హోటల్‌లా ఉంది. టిఫిన్లు చేసి తర్వాత కథ చెప్పుకుందాం." అన్నాడు సుబ్బారావు.

"దిగండి" అన్నాడు.

దిగారంతా.

**(సశేషం)**

# డేర్ డెవిల్

**-మధుబాబు**

29



**"హజూర్.. ఊబులే కాదు. దారుణమైన గోతులు కూడా ఉన్నాయి. కాలుజారి వాటిలో పడితే సరాసరి నరకానికే పోవటం జరుగుతుంది' ఉన్నట్లుండి అన్నాడు దాసోబూ అనుచరుడు ఒకతను.**

**పూర్తి అయింది దాసోబూ ఆలోచన 'చీకట్లో చిందులువేస్తే పని జరగదు. టార్చిలైట్లు కావాలి. ఉన్నాయా మీ దగ్గర?' ఘనీసుల్తాన్‌ని అడిగాడు.**

'పగటి వెలుగు మిగిలి ఉండగానే పని ముగిసిపోతుందని భావించాను. వాటితో అవసరం ఏమీ ఉండదని మా వెహికల్‌లోనే వదిలిపెట్టి వచ్చాను' తల బరుక్కుంటూ చెప్పాడు.

తన అనుచరుల్లో ఇద్దరిని దగ్గరికి పిలిచాడు దాసోబూ. 'వాళ్ళల్లో ఇద్దరిని మీ వెంట తీసుకుపోండి. ఆహారంతో పాటు ఆ లైట్లనుకూడా వెంట బెట్టుకురండి' అని ఆజ్ఞ ఇచ్చాడు.

తనవారిలో ఇంకో ఇద్దరిని సెలక్ట్‌చేశాడు ఘనీసుల్తాన్. దూరంగా నిలబెట్టిన తమ అశ్వం మీద వారిని కూడా ఎక్కించుకుని, ఎక్కడో దూరంలో ఉన్న వెహికల్ దగ్గరకు పరుగు తీయించాడు దాసోబూ అనుచరుడు.

●●●

'ఉన్నాయ్... భూమి లోపల గలగలలాడుతూ ప్రవహించే జలధారలు ఈ ఎడారిక్రింది భాగంలో ఉన్నాయ్... మహాసుల్తాన్ నాకు ఇచ్చిన పుస్తకంలో రాయబడినవన్నీ పచ్చి నిజాలు' తన ఎదుట ప్రత్యక్షమైన నీటిని చూడగానే క్షణం కూడా ఆలస్యం చేయకుండా ఎగిరి దూకుతూ పరమానందంగా అన్నది జాబిల్లి.

మోకాలిలోతు మాత్రమే ఉన్న ఆ జలధారలో తలను పూర్తిగా ముంచి, అరచేతులతో చిన్నపిల్ల మాదిరి టపటపా నీటిమీద చరిచింది. దోసిటితో ఎత్తి గటగటా తాగటం మొదలు పెట్టింది.

'ఒకేసారి ఎక్కువగా తాగితే చాలా ప్రాబ్లెమ్ అవుతుందని నేను ఎక్కడో విన్నాను. కొంచెం శాంతించండి మేడమ్. నెమ్మదించండి' కంగారుగా అంటూ ఆమెను అడ్డుకో బోయాడు నఫీజు.

'నువ్వు ముందర ఒకటి రెండు విషయాలను బాగా గుర్తుపెట్టుకుని మాట్లాడాలి' సీరియస్‌గా చూస్తూ చెప్పింది జాబిల్లి.

'నేను.. ఎక్కువగా ఏమైనా మాట్లాడానా? తప్పు మాటలు ఉపయోగించి ఉంటే దయచేసి క్షమించండి' తడబడుతున్న కంఠంతో క్షమాపణ చెప్పుకోబోయాడు నఫీజు.

'క్షమించే ప్రసక్తి లేనేలేదు. నువ్వు శ్యామ్ సుందర్ సాబ్ స్నేహితుడివి. అవునా కాదా?' సీరియస్‌గానే చూస్తూ అడిగింది ఆమె.

ఆమె ఎందుకు అలా మాట్లాడుతున్నారో అర్థం కాక మరింత అయోమయంగా చూశాడు నఫీజు.

'శ్యామ్‌సుందర్‌సాబ్ మా ఫామిలీకి మహా ఆప్తుడు. నాకు మా రమేష్ బాబాయి ఎంతో శ్యామ్‌సుందర్ సాబ్ కూడా అంతే. ఆయన దోస్తులు నాకు కూడా దోస్తులే. నువ్వు నన్ను నీ ఇష్టం వచ్చినట్టు పిలవవచ్చు. మేడం గీడం అని మర్యాదలు చేస్తే మాత్రం మొఖం పచ్చడి అయిపోతుంది. యామై క్లియర్?' తల కొంచెం ముందుకు వంచి, చిట్లించిన కళ్ళతో కనుబొమలు మధ్యలోనుంచి చూస్తూ గుర్రుగా హెచ్చరించింది.

కోరల్ని ప్రదర్శిస్తూ ఎగిరి మీదికి దూకే చిరుత పులి మొఖం వెంటనే ప్రత్యక్షం అయింది నఫీజు కనులముందు. నవ్వు కూడా వచ్చేసింది.

'ఆ రోజున నువ్వు మా బాబాయికి యాక్సిడెంట్ అయినప్పుడు చూపించిన చొరవ మంచితనం నన్ను చాలా బాగా ఇంప్రెస్ చేసేశాయి. అప్పుడే అనుకున్నాను. నీకు తెలియని పొటెన్షియల్ ఏదో లోపల దాక్కుని ఉన్నదని. నా అంచనా కరెక్టు అయినందుకు చాలా సంతోషంగా ఉంది..' అంటూ చుట్టూచూసి, 'ఇప్పుడు మనం చేయవలసింది ఏమిటి? ఇక్కడి నుంచి బయటపడటం ఎలా?' అని అడిగింది జాబిల్లి.

## జరిగిన కథ

జుబ్బా కొండల్లో నిక్షిప్తమైన నిధికోసం జుబ్బారాజ్య మహాసుల్తాన్ అన్వేషిస్తూ ఉంటాడు. ఫిలోలజిస్టు జాబిల్లికి పురాతన లిపిలో ఉన్న పత్రాలిచ్చి అధ్యయనం చేయమంటాడు మహాసుల్తాన్. అతడి సోదరుడు రహంతుల్లా నిధిని కాజేసేందుకు జాబిల్లిని కిడ్నాప్ చేస్తాడు. అతడి చెరనుంచి తప్పించుకున్న జాబిల్లి ఘనీసుల్తాన్ కు దొరికిపోతుంది. గూఢచారి శ్యామ్‌సుందర్, నఫీజు, జాబిల్లిని బంధించిన ఘనీఖాన్ బృందం, దాసోబు బృందం, మహాసుల్తాన్ వేర్వేరు మార్గాల్లో జుబ్బా కొండలవైపు వస్తారు. జాబిల్లి జాడ కనిపెట్టి ఆమెను సొరంగంలోకి తీసుకెళ్ళిపోయి ఆపద నుండి కాపాడతాడు నఫీజు.

ఆ తర్వాత....

'భూమి లోపల ఉన్నాం మనం. మిట్టమధ్యాహ్న సమయంలో కూడా ఇక్కడికి వెలుగు ప్రసరిస్తుందనే నమ్మకం నాకులేదు. వచ్చిన దారినే వెనక్కి పోవటమే మంచిది' తాము వచ్చినదారి వైపు చూపిస్తూ అన్నాడు నఫీజు.

'వచ్చినదారినే వెనక్కిపోయి మళ్ళీ ఆ పిశాచం చేతికి దొరికిపోవటం నాకు ఇష్టం లేదు. ఘనీసుల్తాన్‌కి ఇప్పుడు ఇంకో రాక్షసుడు జత అయ్యాడు..' కనులు చిట్లిస్తూ చెప్పింది జాబిల్లి.

బండచాటునుంచి తల బయటికిపెట్టి ఆమెను గమనించిన సమయంలో ఆమె చెపుతున్న రాక్షసుడు ఎవరో తను గమనించిన విషయాన్ని బయట పెట్టలేదు నఫీజు.

ఒంటరిగా ఎదురుపడితే గట్టిగా కౌగలించుకుంటాడు దాసోబూ... తన గుడారంలోకి తీసుకుపోయి అతిథి మర్యాదలు బ్రహ్మాండగా చేస్తాడు.

జాబిల్లివంటి అందగత్తెను పక్కన పెట్టుకుని కనిపిస్తే మాత్రం అతని ప్రవర్తన ఎలా ఉంటుందో ఊహించటం అతి కష్టం.

'మీరు మాయం అయిన క్షణం నుంచీ మమ్మల్ని ఒక అనుమానం అదే పనిగా సతాయించేస్తోంది. అది ఏమిటంటే..' అంటూ మాటలు మొదలుపెట్టి, అదిరిపడి వెనక్కి దూకాడు అతను.

చాలా ప్రశాంతంగా నీటి జాలులో కూర్చుని ఉన్న జాబిల్లి అతను మాటలు మొదలుపెట్టిన మరుక్షణం - ఆడతాచు మాదిరి చివ్వున పైకిలేచి, తన ఎడమ చేతిని చాలా బలంగా అతని చెంప మీదికి విసరటమే అందుకు కారణం.

జలజలమంటూ ప్రవహిస్తున్న నీటిలో చతికిలపడి ఆ దెబ్బనుంచి తప్పించుకున్నాడు నఫీజు.

'క్షమించాలి.. తప్పయిపోయింది. మీరు కాదు. నువ్వు... నువ్వే జాబిల్లి. ఇక మీదట నిన్ను జాబిల్లీ అనే పిలుస్తాను' అంటూ మళ్ళీ లేచి నిలుచున్నాడు.

'నిన్ను ఈ రహంతుల్లాగాడు అసలు ఎందుకు పట్టుకు వచ్చాడు?' అని అడిగాడు.

జాలులోని నీటిని ఎత్తి తలమీద పోసుకుంటూ, చిన్న కంఠంతో తన వ్యధనంతా విడమర్చి చెప్పింది జాబిల్లి. 'మహా సుల్తాన్‌కి చెందవలసిన నిధి కోసం తను తల్లడిల్లిపోతున్నాడు రహంతుల్లా..' అంటూ ముగించింది.

వచ్చినదారినే వెనక్కిపోకుండా ఆ చీకటి ప్రదేశంలోనే ఆగిపోవాలని, ఆమెను దాసోబూ కంట పడనీయకుండా తాను నిర్ణయించుకోవడం ఎంత మంచిది అయిందో క్లియర్‌గా అర్థమై, గుండెల మీది బరువు ఏదో సడన్‌గా దిగిపోయినట్లు తేలికగా నిట్టూర్చాడు నఫీజు.

దోపిడీలతో రోజులు గడిపే దాసోబూ జాబిల్లికి తెలిసిన నిధి రహస్యాన్ని పొరపాటున కూడా వదిలిపెట్టడు. తమ స్నేహం, తమ మధ్య నెలకొని ఉన్న గౌరవం ఏవీ అతన్ని ఆపలేవు. నిధిని స్వాధీనపరచుకునే వరకూ నిద్రపోనే పోడు.

'అసలు ఆ నిధి ఈ కొండల్లో ఉండి ఉంటుందా?' తలను తడుముకుంటూ అడిగాడు జాబిల్లిని.

'ఉంటుందనే మహాసుల్తాన్ నాకు ఇచ్చిన పుస్తకంలో ఉంది. దారి చూపించేందుకు సిద్ధం చేయబడిన గుర్తుల్లో రెండు కనిపించాయి' చెప్పింది ఆమె.

నొసలు చిట్లిస్తూ ఆలోచించటం మొదలు పెట్టాడు నఫీజు. నిధిని వెతికే కార్యక్రమాన్ని కొద్ది రోజులు వాయిదా వేసుకుని, ముందుగా జాబిల్లిని శ్యామ్‌సాబ్ దగ్గరికి తీసుకుపోవటమే చాలామంచిదని అతనికి ఆపిస్తోంది. తాము వచ్చింది ఆమెను వెతికి పట్టుకోవటానికి. భగవంతుడి దయవల్ల చాలా హేపీగా జరిగిపోయింది ఆ పని.

దుమ్ము ధూళి, దారుణమైన వేడిమి తప్ప ఇంకేమీ కనిపించని ఆ ప్రత్యక్ష నరకంలో చక్కర్లు కొట్టవలసిన అవసరం ఇక మీదట తమకు లేదు. శ్యామ్‌సాబ్‌తో కలిసి ఘాడీ సిటీ చేరుకుని, అక్కడి నుంచి తమకోసం ఆత్రుతగా ఎదురుచూస్తూ ఉండే రమేష్‌సాబ్‌కి వర్తమానం పంపించగలిగితే చాలు.

విమానం కాకపోతే, హెలీకాప్టర్ దేన్నో ఒక దాన్ని అద్దెకు తీసుకుని ఆఘమేఘాల మీద వచ్చి పడతాడు.

'ముట్టుకుంటే మాసిపోయేటట్టున్న ఈ ముద్దుగుమ్మని ఆ సాబ్‌కి అప్పగించుడు, తామందరూ తమ దేశానికి జంప్ అయిపోవుడూ, ఖేల్‌ఖతమ్. ఈ దాసోబూ, ఈ ఘనీసుల్తాన్, ఈ రహంతుల్లా ఈ మహాసుల్తాన్ అందరూ ఏమైపోయినా తమకు అనవసరం.

కాళ్ళ క్రింద ఉన్న నీటిజాలు మాదిరి గునగునా సాగిపోతున్న అతని ఆలోచనా ప్రవాహానికి ఉన్నట్లుండి పడింది బ్రేక్.

ఆప్యాయంగా పలుకరించింది నదియా బేటీ. తాను చెప్పిన పచ్చి అబద్ధాలన్నిటినీ అమాయకంగా నమ్మి తల ఊపేసింది. ఆమె తండ్రి బ్రతికి ఉండటం అంటూ జరిగితే, తప్పకుండా వెతికి పట్టుకుంటానని మాటఇచ్చి మరీ వచ్చాడు తను. మాటతప్పితే... అందులోను ఎడారి మొగ్గవంటి ఆ బిడ్డకు చేసిన వాగ్దానాన్ని మరిచిపోతే, ఊరుకుంటాడా భగవంతుడు?

కందిరీగల తుట్టె మాదిరి తయారయింది నఫీజు మెదడు.

'ఏమిటి ఆలోచిస్తున్నావు?' తియ్యగా జాబిల్లి ప్రశ్నించేసరికి, ఆలోచనల్లో నుంచి బయటపడి చిన్నగా నవ్వాడు.

చిమ్మచీకటి... ఆకారాలే తప్ప భావాలు ఏవీ



కనిపించని గుడ్డి వాతావరణం. ఆ సమయంలో కూడా అతన్ని అబ్జర్వ్ చేయనే చేసింది జాబిల్లి.

'చిన్నగా నవ్వితే నువ్వు చాలా బాగుంటావు. తెలుసా?' అన్నది.

చిన్నతనంలో తను చాలా తరుచుగా వింటూ వచ్చిన మొరటు సామెత ఒకటి వెంటనే గుర్తుకు వచ్చింది నఫీజుకి.

'ఇప్పుడు అందచందాలను గురించి డిస్కషన్ వద్దుగానీ, జరగవలసింది ఏమిటో చూసుకుందాం' రఫ్‌గా అన్నాడు.

'చూడటాలు గీడటాలు జాన్తానై... పైన ఉన్న పిశాచాలు అవతలికి పోయిన వెంటనే నువ్వు నేను ఆ నిధిని వెతికి పట్టుకోవాలి. మహాసుల్తాన్‌కి నేను మాట ఇచ్చాను' స్థిరంగా చెప్పింది జాబిల్లి.

'చూడు జాబిలమ్మా, పట్టుదలకుపోయే సమయం కాదు ఇది. మహాసుల్తాన్ కోసం రహంతుల్లా సైనికులు ఎడారినంతా జల్లెడ పడుతున్నారు. ఇప్పుడు వారితోపాటు ఈ ఘనీసుల్తాన్, దాసోబూ ఇద్దరూ మనకి జతయ్యారు. పైకిపోయి పది అడుగులు కూడా వేయకముందే పట్టు బడిపోతాం' సీరియస్‌గా అన్నాడు నఫీజు.

'మా నాన్న, మా బాబాయి, శ్యామ్‌సుందర్, వాత్సవ సాబ్‌లకే ఉంది హక్కు నన్ను జాబిలమ్మ అని పిలవటానికి. నీకు లేదు. నువ్వు జాబిల్లి అనే పిలువ్..' అతని కంటే సీరియస్‌గా చెప్పింది ఆమె.

నెత్తిమీద టపటపా చరుచుకుని, నీటిలో చతికిలపడాలన్న కోరికవెంటనే కలిగింది నఫీజుకి. 'ఇప్పుడు మనం మాట్లాడుకోవాల్సిన మాటకాదు అది. మనం వెంటనే జుబ్బానగరం వెళ్ళి శ్యామ్ సాబ్‌ని కలుసుకోవాలి' అన్నాడు.

'నథింగ్ డూయింగ్. నిధికి మనం చాలా దగ్గరగా ఉన్నామని నాకు అనిపిస్తోంది. ముందు నిధి. తర్వాత శ్యామ్‌సుందర్. అంతే' అన్నది జాబిల్లి.



**మనిషి పళ్ళు దాదాపు రాళ్ళంత గట్టివి!**

అంతకుముందు ఒకసారి అనిపించింది నఫీజుకి. తాము సముద్రాన్ని దాటి ఆ ఖండంలో అడుగుపెట్టిన వేళా విశేషం ఏమంత మంచిగా లేదని, ఇప్పుడు మళ్ళీ అతని మనసులోకి ఎంటర్ అయింది అదేమాట.

చిన్నమొఖం చేసుకుని, దీనంగా చూస్తూ కూర్చుని ఉన్నదామె. అతను బొరియలోంచి తల బయటికి పెట్టినప్పటికీ, ఇప్పటికీ అరగంట మాత్రమే గడిచింది. ఇంతలోనే ఆరితేరిన నిర్ణయాధికారిమాదిరి స్టేట్‌మెంట్లు ఇచ్చేస్తోంది.

ఆఖరి ప్రయత్నం చేశాడు అతను. 'పైనే ఉంటారు ఆ దుర్మార్గులు. మనం తలలు బయటికి పెట్టిన మరుక్షణం - ఎడారి నక్కల మాదిరి మీదికి దుమికి కాళ్ళు చేతులు కట్టిపడవేస్తారు' అని కొంచెం బెదరగొట్టటానికి చూశాడు.

'నువ్వు దగ్గర ఉండగా నేను ఎవరికీ భయపడను. ఏదో ఒకటిచేసి ట్రబుల్‌ని ఎవాయిడ్ చేయగలవు. నాకు నమ్మకం ఉంది' తడుముకోకుండా చెప్పింది ఆమె.

**ఘనీసుల్తాన్, దాసోబు మురాలు మాటల సందట్లో ఉండగా, నఫీజు గుహలోంచి బైటకువచ్చి జాబిల్లిని ఆ రహస్య మార్గంలోకి తీసుకుపోయాడు. గుహలో నీటిజాడలు, మహాసుల్తాన్ మ్యాప్‌లో ఉన్నవి ఒకటే అని గుర్తించిందామె. అంతలో నఫీజుకు ఏదో కనిపించింది. అదిచూసి ఆశ్చర్యపోయాడు. చేయిపట్టి లాగి జాబిల్లికి దాన్ని చూపించాడు. ఇంతకూ అతడికి ఏం కనిపించింది?**

తల కొట్టుకోవాలన్న కోరిక మరోసారి కలిగింది నఫీజుకి. మొండితనానికి మనిషి రూపం అంటూ ఇవ్వగలిగితే అది ఇన్‌స్పెక్టర్ రమేష్ మాదిరిగా కనిపిస్తుంది. ఆయన రక్తం ఈ పిల్లలో కూడా ప్రవహిస్తోంది. వేరేవిధంగా ఎందుకు మాట్లాడుతుంది? గట్టిగా నిట్టూర్చి రాజీపడటానికి ప్రిపేర్ అయిపోయాడతను.

'తెల్లవారేవరకూ వెయిట్ చేద్దాం. వెలుగు వచ్చిన తర్వాత నేను పైకిపోయి వాతావరణం ఎలా ఉందో చూసి వస్తాను' అన్నాడు.

ఈసారి ఎదురు చెప్పలేదు జాబిల్లి. 'నువ్వు ఎలాచెపితే అలాగే చేద్దాం' అని మాత్రం చెప్పి, నీళ్ళల్లోనే కూర్చుని ఒక గోడకు ఆనుకుని కనులు మూసుకుంది.

•••

విసుగు విరామం లేకుండా రెండు మూడు గంటలకు ఒకసారి మహాసుల్తాన్ పెదవుల మీద ఏదో భస్మాన్ని తేనెలో రంగరించి చూపుడువేలితో అద్దుతూనే ఉన్నాడు దాసోబూ వెంటబెట్టుకు వచ్చిన వయోవృద్ధుడు.

రాత్రి గడిచి సూర్యోదయం అవుతున్న సమయంలో ఉన్నట్లుండి స్వేదంతో తడిసిపోయింది సుల్తాన్ శరీరం. అర మూతలుగా ఉన్న కళ్ళు తెరిపిన పడ్డాయి. 'నేను ఎక్కడ ఉన్నాను?' అని అడుగుతూ లేచి కూర్చోవటానికి ప్రయత్నించాడు.

అరచేత్తో ఆయన గుండెల్ని అదిమి, 'బేటా అందర్ తో ఆవో' అంటూ గుడారం వెలుపల ఉన్న శ్యామ్‌సుందర్‌ని పిలిచాడు వయోవృద్ధుడు.

రెండే రెండు అంగల్లో లోపలికిపోయిన శ్యామ్‌సుందర్‌కి వెంటనే కలిగింది విపరీతమైన సంతోషం.

'మీరు చాలా అదృష్టవంతులు సుల్తాన్‌సాబ్. ఎడారిలో జీవితం గడిపే దాసోబూ మనకి కనిపించటం నిజంగా భగవంతుడి దయకు చిహ్నం' అంటూ జరిగింది చిన్న మాటలతో ఆయనకు చెప్పాడు.

'ఇప్పుడే తెలివి వచ్చిన మనిషిని ఇబ్బంది పెట్టడం సబబు కాదు. విశ్రాంతి ముఖ్యం..' అంటూ వారించటానికి ప్రయత్నించాడు వయోవృద్ధుడు.

వినిపించుకోలేదు శ్యామ్‌సుందర్. దాసోబూ అంటే మహా సుల్తాన్ దృష్టిలో పెద్దనేరస్థుడని ముద్ర పడినట్లుగా అర్థమైంది అతనికి. అంతకు ముందు దాసోబూతో జరిపిన సంభాషణవల్ల. ఎంత త్వరగా సుల్తాన్ తన అభిప్రాయాలను మార్చుకుంటే అంత బాగుంటుంది. ప్రస్తుతం ఆయన ఎదుర్కోబోతున్న ప్రాబ్లెమ్స్ సాల్వ్ కావాలంటే విశ్వాసంగా వెనుక నడిచే జనం అవసరం.

దాసోబూని క్షమించి, అతన్ని దగ్గరకి తీసుకోగలిగితే సూపర్‌గా ఉంటుంది.

ఎండుకుపోయినట్లు తయారైన పెదవుల్ని నాలుకతో తడుపుకుంటూ ఓపిక లేక పోయినా అతని మాటల్ని ఆసాంతం ఆలకించాడు మహాసుల్తాన్.

'దిక్కుదివాణం లేనట్లు ఎడారిలో ప్రాణాలు వదలవలసిన నన్ను నీ ప్రాణాలకు తెగించి కాపాడావు. నీ రుణం నేను తీర్చుకోవటం చాలాకష్టం. దాసోబూని క్షమించమని నీ అర్థింపు. అంతే కదూ?' నీరసంగా నవ్వుతూ అడిగాడు.

అర్జంటుగా తల ఊపేశాడు శ్యామ్‌సుందర్.

'క్షమించేశాను. ఇకనుంచీ దాసోబూ ఇసుక దిబ్బల్లో గింగిరాలు తిరగవలసిన అవసరం లేదు. అతనికి అంగీకారం అయ్యేపక్షంలో నా సైన్యంలో పెద్దపదవి ఇస్తాను. కోరుకున్న ప్రదేశంలో ఇళ్ళు నిర్మించుకోవటానికి అనుమతిస్తాను' అన్నాడు సుల్తాన్.

గుడారం ద్వారం దగ్గర నిలబడి కుతూహలంగా తొంగి చూస్తున్నారు దాసోబూ వదిలి వెళ్ళిన అనుచరులు. ఒక్కసారిగా వికసించాయి వారి మొఖాలు.

'మీరు వెళ్ళి దాసోబూకుచెప్పి అతన్ని తీసుకు రండి' గుడారం వెలుపలికి వచ్చి వారితో అన్నాడు శ్యామ్‌సుందర్.

క్షణం కూడా ఆలస్యం చేయకుండా తమ వాహనాలను ఎడారిలోకి పరుగులు తీయించి, చూస్తూచూస్తూ ఉండగానే దృష్టి పథం నుంచి దూరం అయిపోయారు వారిద్దరూ.

'పరాయివారికోసం నువ్వు చాలా బాగా ప్రార్థించావు. నీ కోసం మాత్రం ఏమీ కోరుకోలేదు. ఏం కావాలి నీకు?' లోపలికి రాగానే శ్యామ్‌ని అడిగాడు సుల్తాన్.

జాబిల్లిని గురించి మాట్లాడాలని అనిపించినా, ఆ కోరికను వెంటనే అణచుకుని చిరునవ్వు నవ్వాడు శ్యామ్‌సుందర్. 'మీరు ఎంత త్వరగాలేచి అందరి మాదిరిగా అటూ ఇటూ తిరిగితే అంత బాగుంటుంది. మీ సింహాసనం మీద మీరు కూర్చుని మీ శత్రువులందరినీ అణగదొక్కుతుంటే చూడాలని ఉంది' అని మాత్రం అన్నాడు.

'నేనున్న పరిస్థితులు నీకు తెలిశాయా?' అడిగాడు సుల్తాన్.

బాడీగార్డువైపు చూపించి తల ఊపాడు శ్యామ్‌సుందర్.

అలసట అధికం అయినట్లు నెమ్మదిగా కనులు మూసుకున్నాడు సుల్తాన్.

●●●

పొడలపాము కలుగులోనుంచి తల బయటికి పెట్టినట్లు అతినెమ్మదిగా బొరియలోనుంచి చుట్టూ చూశాడు నఫీజు.

నిర్మానుష్యంగా ఉంది ఆ ప్రదేశం. వెలుగు రాకముందే ఆ ఏరియా వదిలి ఎక్కడికో వెళ్ళిపోయారు ప్రత్యర్థులు అందరూ.

తన వెనుకే బయటికి రావటానికి సిద్ధంగా ఉన్న జాబిల్లివైపు చూసి తల ఊపాడు నఫీజు.

'నాకు ఆకలిగా ఉంది. తినటానికి ఏమైనా దొరికే అవకాశం ఉన్నదా?' బొరియలోనుంచి బయటికి వస్తూనే అడిగింది ఆమె.

'వాళ్ళు ఎక్కడికి పోయారో, ఎలా పోయారో మనకి తెలియదు. తమవెంట వెహికల్‌ని కూడా తీసుకుపోయి ఉంటే మన బొర్రెలో బొమ్మరాలు పడినట్లే. కిందికిదిగి మళ్ళీ నీళ్ళతోనే కడుపు నింపుకోవాలి' అన్నాడు నఫీజు. అనటం అయితే అన్నాడు గాని, అతన్ని కూడా బాధిస్తోంది ఆకలి. ఏదో ఒక పదార్థం పొట్టలో పడకపోతే నీరసం ముంచుకు వస్తుందనే హెచ్చరికలు అందుతున్నాయి.

'అవకాశం లేనప్పుడు అనవసరంగా టైంవేస్ట్ చేయవద్దు. మనకి సింహంతల, ఒంటె మూపురం కనిపించాలి. వాటికోసం వెతుకు' అంటూ బొరియ దగ్గర్నించి కదిలింది జాబిల్లి.

అర్థం కాలేదు ఆ మాటలు నఫీజుకి. ఆ విషయాన్ని చెపితే ఆమె వెక్కిరిస్తుందన్న అనుమానంతో తల ఊపేశాడు చాలా గంభీరంగా.

'నేను అదే పనిమీద ఉంటాను. ఫికర్ చేయవలసిన అవసరం లేదు' అంటూ తనుకూడా ముందుకు అడుగు వేయబోయి సడెన్‌గా ఆగిపోయాడు. మెరుపుకంటే వేగంగా క్రిందికి వంగి, క్రికెట్ బాల్‌సైజులో ఉన్న ఒక పలుకు రాయిని అందుకున్నాడు.

తను పుట్టిపెరిగిన సిటీలో ముష్తీబాబా దర్గా దగ్గరికి అప్పుడప్పుడు పోయిరావటం అలవాటు అతనికి. నమ్మకంతో తనను తలుచుకున్న వారికి ఎటువంటి ఆర్థిక పరమైన ఇబ్బందులు ఎదురు పడకుండా కాపాడతాడని పెద్దపేరు ఆ బాబాకి.

'జేబుల్లో చిల్లిగవ్వ కూడా లేని నీచ నికృష్ట పరిస్థితిలో ఉన్నాను నేను. కాని ఇప్పుడు కావాల్సింది డబ్బులు కాదు. తిండి. కడుపు నింపుకునేందుకు కొద్దిపాటి ఆహారం. అది చాలు బాబా.” అనుకుంటూ బలంగా విసిరాడు పైకి తీసిన పలుగు రాయిని.

అతను అంత వయొలెంట్‌గా కదలటం దేనికో జాబిల్లికి అర్థం కాలేదు. 'ఏమిటి? ఎందుకు?' అని అడుగుతూ అతని దగ్గరకి రాబోయింది.

రెండు గుమ్మడి కాయలంత పెద్దగా ఉన్న బండరాయి ఒకటి ఉంది ఆమె ఎదుట. దాని పక్కనుంచి బుస్సుమని రొద చేస్తూ తల పైకి ఎత్తింది ఒక పెద్ద పాము.

అదిరిపడి గాలిలోకి ఎగిరింది జాబిల్లి. ఎగరటం వరకే కంట్రోల్డ్‌గా చేయగలిగింది. ఎక్కడ పడబోతున్నదీ గమనించుకోవడం చేతకాక సూటిగా వచ్చి నఫీజు మీద పడింది.

కొండరాయిని విసిరి అటువైపే చూస్తున్న నఫీజు అటువంటి సిచ్యుయేషన్ ఎక్స్‌పెక్ట్ చేయక పోవటంతో వెల్లకిలా పడిపోయాడు.

ముక్కుమొఖం ఏకం అయిపోయేలా నేలను తాకవలసిన జాబిల్లి అతనిమీద పడటంతో, చిన్నపాటి కుదుపునకు కూడా గురి కాకుండా హాయిగా లేచి నిలబడింది.

'థాంక్యూ నఫీజూ, నన్ను సేవ్‌చేసినందుకు చాలా థ్యాంక్స్' నవ్వుతూ చెప్పింది.

బుసకొట్టి తలనుపైకి ఎత్తటంతో తృప్తి పడినట్లుంది. చరచరా పాకుతూ వారిద్దరికీ దూరంగా వెళ్ళిపోతోంది ఆమెను బెదిరించిన పాము.

'చూసుకుని అడుగులు వేయాలి. ఇది లండన్ కాదు. కనీసం మీ ఊరు కూడా కాదు. ఎగరటం కాస్తంత ఆలస్యమైఉంటే ఈపాటికి నురుగులు కక్కుతూ గిలగిలా కొట్టుకుంటూ ఉండేదానివి' క్రిందపడటంతో వెన్నుకు తగిలిన దెబ్బ మర్చిపోవటం కోసం జాబిల్లిని చాలా తీవ్రంగా హెచ్చరించాడు నఫీజు.

చిన్నమొఖం చేసుకుని ముక్కు ఎగబీలుస్తూ విసురుగా అడుగులు వేయవలసిన జాబిల్లి అటువంటి పనులు ఏమీ చెయ్యకపోగా మరోసారి నవ్వింది మరింత తియ్యగా.

'ఎందుకు ఆ నవ్వు?' కినుకగా అడిగాడు నఫీజు.

'నువ్వు నేనంటే గౌరవంతోనో, భయంతోనో బిగదీసుకుపోయి, మాట్లాడిన ప్రతిమాటకు గంగిరెద్దులా తల ఊపుతున్నావు. ఆ ఫోబియా నుంచి బయటపడ్డావు చూడు. నాకు బాగా నచ్చేసింది' మళ్ళీ నవ్వింది జాబిల్లి.

ఆ మాటతో ముక్కు ఎగబీల్చి విసురుగా తల పక్కకు తిప్పుకోవటం నఫీజు వంతైంది.

తల పక్కకు తిప్పుకుంటూ తనకు తెలియకుండానే దూరంగా పారిపోతున్న పామువైపు చూశాడు అతను.

వందగజాల దూరంలో ఉంది జుబ్బాకొండల్లో భాగం అయిన ఇంకో చిన్న సైజు కొండగుట్ట. మెలికలు తిరుగుతూ దాని దగ్గరికిపోయి, ఒక బండరాయి చాటున మటు మాయం అయిపోయిందా పాము.

ఆ బండఉన్న ప్రదేశాన్ని మనసులో రిజిస్టర్ చేసుకున్నాడు నఫీజు. అటుగా పోవటం అంటూ జరిగితే, ఆ బండకు దూరంగా అడుగులు వేయాలని నిశ్చయించుకుంటూ ఉండగా, అతని చెవుల్లో మార్మోగాయి అంతకుముందు జాబిల్లి చెప్పిన మాటలు.

సింహం తల, ఒంటె మూపురం కనిపించాలని అన్నది ఆమె.

జూలు విదిలించటానికి సిద్ధంగా ఉన్న మృగరాజు తల మాదిరిగానే కనిపిస్తోంది ఆ బండ. సరిగ్గా దానికి పాతిక అడుగుల దూరంలో నిలబడి ఉంది మరో బండ. అచ్చు నేల మీద మోహరించబోతున్న ఒంటె మూపురం మాదిరిగానే కనిపిస్తోంది.

చటుక్కున చేతిని జాచి జాబిల్లి చేతిని పట్టుకున్నాడు అతను. రెండు అడుగులు ముందుకు లాగి అటుకేసి చూపించాడు.

విపరీతమైన ఆశ్చర్యంతో వెడల్పయ్యాయి ఆమె కళ్ళు. 'మైగాడ్... నిన్న అంతా ఇక్కడే గడిపాం. నువ్వు చూపించేవరకూ వాటిని ఎవరూ గమనించలేదు. నేను కూడా చూడలేదు' అంటూ అటువైపు వేగంగా నడవబోయి చటుక్కున ఆగింది.

'ఇందాక నువ్వు ఏదో రాయి విసిరావు. ఎవరి మీదికి? ఎందుకు?' అని అడిగింది.

పామును చూసిన భయంతో ఆమె తనమీద పడటంవల్ల ఆ విషయం మర్చిపోయాడు నఫీజు.

'ఎడారి కౌజు ఒకటి కనిపించింది.' అంటూ గబగబా ముందుకు పోయాడు.

మోకాలిఎత్తున ఎదిగి ఉన్న ముళ్ళపొదల మధ్యలో కాళ్ళను పైకి లేపి వెల్లకిలా పడిపోయిఉంది కొండ రాయి దెబ్బకు ప్రాణాలు వదిలిన ఆ పక్షి.

'ముష్తీబాబా నా మీద దయ చూపించాడు. ఈ పూటకి ఆహారం సమకూర్చాడు' అంటూ ఆ


నోబెల్ కథలు

నోబెల్ బహుమతి పొందిన
రచయితల కథలు
వారం వారం మీకోసం

త్వరలో ప్రారంభం

చుట్టుపట్ల ఉన్న ఎండు పొదల్ని పోగుచేసి ఒక చోట గుట్టగా పడవేశాడు. ఇసుకలో నుంచి రెండు పలుగురాళ్ళను పైకి తీసి జాబిల్లికి అందించాడు.

'ఈ రెంటినీ రాపాడిస్తే నిప్పురవ్వలు వస్తాయి. పొదలు అంటుకుంటాయి. నువ్వు ఆ పనిమీద ఉండు. ఈలోపు నేను ఈ పక్షిని కాల్చటానికి సిద్ధం చేస్తాను' అంటూ ఆ ప్రదేశానికి దూరంగా పోబోతుండగా, చేయి జాచి అతని కాలర్‌ని గట్టిగా పట్టుకుని ఆపేసింది జాబిల్లి.

'ముష్కీబాబా ఎవరు?' అని అడిగింది.

సిటీలో తను దర్శనం చేసుకునే దర్గా గురించి చెప్పాడు నఫీజు.

'చాలా బాగుంది. మనం సిటీకి వెళ్ళగానే నన్ను అక్కడికి తీసుకువెళ్ళాలి' అన్నది జాబిల్లి.

'నువ్వు ఆ దర్గా దగ్గరికి వస్తావా? దేనికి?' ఆశ్చర్యంగా అడిగాడు నఫీజు.

'ఆ పెద్దాయన ఎవరోగాని చాలా పవర్‌ఫుల్ ఫకీర్ అనిపిస్తోంది. నేను కూడా ఒక కోరిక కోరుకుంటున్నాను. తీరుస్తాడో లేదో చూడాలి' అన్నది జాబిల్లి.

'నీకు అమ్మానాన్న ఉన్నారా?' అతని వెనుక నడుస్తూ అడిగింది జాబిల్లి. తల అడ్డం తిప్పాడు అతను.

'అన్నలు తమ్ముళ్ళుగానీ అక్కాచెల్లెళ్లు గాని...' అంటూ మాట ఆపింది ఆమె.

ఉన్నట్లుండి ముంచుకు వచ్చేసింది నఫీజుకి కోపం. రావటంతో ఆగలేదు. ఒక్కసారిగా టాప్ పిచ్‌కి వెళ్ళిపోయింది.

'అదృష్టవశాత్తూ దొరికిన ఆహారం వండుకు తినే అవకాశం కూడాలేదు. ఏ క్షణంలో ఎవరు వచ్చి బరిశెలు బాణాలు తుపాకులు మనగుండెకి గురి పెడతారో తెలియదు. మనం ఉన్న సిచ్యుయేషన్‌లో నుంచి ఎలా బయటపడాలో ఆలోచించకుండా ఈ అచ్చమ్మ బుచ్చెమ్మ కబుర్లు అవసరమా?' ఆల్‌మోస్ట్ అరిచినంత పని చేశాడు.

'నన్ను వెతికి క్షేమంగా ఇంటికి చేర్చే బాధ్యత నీది. నాది కాదు. శత్రువుల గురించి ఆలోచించాల్సింది నువ్వు, నేను కాదు. నాకు ఇష్టమైన మాటలు నేను మాట్లాడతాను. కాదంటే ఊరుకునేది లేదు' పెదవులు బిగించి క్రూరంగా చూస్తూ చెప్పింది




ఎడారి ఎండ మూలంగా ఆమె తల గింగిరాలు తిరుగుతున్నదేమో అనిపించింది నఫీజుకి. ఆ మాట బయటకి చెపితే, లేనిపోని ఆర్గ్యుమెంట్స్ మొదలు అవుతాయేమోనన్న అనుమానంతో తల ఊపి మళ్ళీ నడక మొదలు పెట్టబోయాడు.

ఇంకోసారి కాలర్‌ని పట్టుకుంది జాబిల్లి.

'పట్టపగలు మంటలు వేస్తే పొగ గాలిలోకి లేస్తుంది. మన కోసం వెతికేవాళ్ళు ఎలర్ట్ అయిపోయి పరిగెత్తుకు వస్తారు. అప్పుడు ఏంచేయాలి?' అని అడిగింది అమాయకంగా కనురెప్పల్ని అల్లల్లారుస్తూ.

ఆ అంశాన్ని తను ముందుగానే ఊహించలేక పోయినందుకు అమితంగా సిగ్గుపడ్డాడు నఫీజు.

'నిజమే. ఎడారిఎండ నా మతి మందగింపచేసేసింది. మంట కాన్సిల్. ముందుగా సింహం తల ఒంటె మూపురం' అంటూ ఎడారి కౌజును అలాగే పట్టుకుని ఆ ఆకారాలు కనిపించిన వైపు బయలుదేరాడు.

ఆమె.

చన్నీళ్ళు చిలకరించినట్లు ఎంత స్పీడ్‌గా వచ్చిందో అంతే స్పీడ్‌తో మాయమై పోయింది నఫీజు కోపం.

మొండిగా తిరగటానికి అలవాటుపడిన తనే ప్రాణాలు పోతున్న ఫీలింగ్స్‌కి లొంగిపోయాడు ఎన్నోసార్లు. తనను అభిమానించే వాళ్ళ మధ్య తప్ప, తనకు కీడు తలపెట్టే వాళ్ళమధ్య ఎన్నడూ గడిపి ఎరుగని అమాయకురాలు ఆమె. ఆ భయం పోగొట్టుకోవటానికి ఏదేదో మాట్లాడుతోంది. తప్పుగా భావించటం తనదే తప్పు.

'మాఫ్‌కరో... నా బుర్ర సరిగ్గా పని చేయటం లేదు' వినబడీ వినబడనట్లు గొణికి ముందుకు నడిచాడు.

నొసలు ముడిచి క్రూరంగానే చూస్తున్నది జాబిల్లి. అయితే ఎర్రటి ఆమె పెదవులు మాత్రం ఉబికి రాబోతున్న నవ్వుని బలవంతంగా అణిచిపెట్టుకుంటున్నట్టు కదులుతూ ఉండటం కనిపించింది అతనికి.

కళ్ళతో కోపంగా చూస్తూ, పెదవులతో నవ్వటం సాధ్యపడుతుందా. కోపంగా చూడటానికి కారణం ఒకటి ఉన్నది. నవ్వుని బిగపట్టుకోవటానికి ఏముంది?

తన అవతారంలో ఏదైనా తేడా ఉన్నదేమో నన్న అనుమానంతో, ఒకసారి తన వంకే తను చూసుకున్నాడు అతను.

'బాగానే ఉన్నావు. తేడా ఏమీలేదు..' సన్నగా వినిపించింది జాబిల్లి కంఠం. వెనక్కిచూస్తే ఆమె నోటి వెంట ఇంకేమాట వినవలసి వస్తుందోనన్న భయంతో, ఆల్‌మోస్ట్ పరిగెత్తినంత పనిచేశాడు నఫీజు.

•••

'లాభం లేదు దాసోబూ. రెక్కల్ని మొలిపించుకుని ఎగురుకుంటూ ఎటైనా వెళ్ళిపోయి ఉండాలి. లేదా ఏదైనా ఇసుక ఊబిలో పడి పాతాళంలోకి ప్రయాణం చేసి ఉండాలి. కాలినడకన మాత్రం ఎక్కడికీ పోలేదు' ఉదయం పది గంటల సమయంలో మంటలు వెలువరుస్తున్న సూర్యుడి వైపు చూడకుండా తలవంచుకుంటూ అన్నాడు ఘనీసుల్తాన్.

తాము ప్రయాణం చేస్తున్న ప్రదేశంలోని ఇసుకలో అగుపించే ప్రతిగుర్తును అతి జాగ్రత్తగా గమనిస్తున్న దాసోబూ కూడా అదే నిర్ణయానికి వచ్చినట్లు తలఊపాడు.

'మేము అడిగింది ఏమిటంటే, ఆ జిలేబి అసలు అక్కడి నుంచి ఎక్కడికీ పోలేదు. ఆ చుట్టుపట్ల ఏవో కొన్ని గుహలు ఉండే ఉంటాయి. వాటిల్లోకిపోయి కదలకుండా కూర్చుని ఉంటుంది' తనను అడగకపోయినా, తన అభిప్రాయం వెల్లడించాడు దాసోబూ అనుచరుడు ఒకతను.

'వెనక్కిపోయి అక్కడే వెతకటం బాగుంటుందా?' అతన్ని అడిగాడు దాసోబూ. తల ఊపాడు ఆ అనుచరుడు.

'అచ్ఛా... అయితే ఆలస్యం దేనికి? తిరగండి వెనక్కి' ఆజ్ఞ ఇచ్చాడు దాసోబూ.

ఘనీసుల్తాన్‌తోపాటు అతని చంచాలు కూడా మారు మాట్లాడకుండా తాము వదిలివచ్చిన బండలవైపు బయలు దేరారు.

ఎంతోదూరం పోకముందే దుమ్ము తెరలు రేపుతూ వస్తున్న రెండు అశ్వాలు కనిపించాయి వారికి.

'కంగారుపడకండి.. మావాళ్ళే. మాకోసం వస్తున్నట్లున్నారు' అంటూ తన అశ్వాన్ని కదలకుండా నిలబెట్టాడు దాసోబూ.

'మహాసుల్తాన్ ప్రాణాలు భగవంతుడి దగ్గరికి వెళ్ళిపోయిఉంటాయి. ఆయనకి కాపలాగా మనం వదలి వచ్చినవాళ్ళే వీళ్ళు' తన ప్రక్కనేఉన్న ప్రధాన అనుచరుడితో అన్నాడు చాలా చిన్నకంఠంతో.

'విషయం అది కాదని అనిపిస్తోంది. నవ్వుతున్నారు ఇద్దరూ. మహా సంతోషంగా ఉన్నారు' తను కూడా అదే మాదిరిగా చిన్నగా అన్నాడు ఆ అనుచరుడు.

దగ్గరికి వచ్చేశారు ఆ అశ్వికులు. గుర్రాల మీదినుంచి దూకి దాసోబూకి సలాం చేశారు.

(ఇంకావుంది)

## కిడ్నీలో రాళ్ళు



**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**

మూత్రపిండాల్లో రాళ్ళు ఏర్పడటం అనేది ఈ మధ్యకాలంలో చాలా ఎక్కువగా జరుగుతుంది. ఒక సర్వే ప్రకారం భారతదేశంలో పురుషుల్లో 10.6% మందిలో మరియు స్త్రీలలో 7.1% మందిలో ఈ సమస్యతో బాధపడుతున్నారు. దీనికి మారిన జీవనశైలి, ప్రపంచ ఆధునీకరణ, మారిన ఆహార అలవాట్లు, స్థూలకాయం వంటివి ప్రధాన కారణాలుగా భావించవచ్చు. ఇది మన శరీరం యొక్క భారీ కర్మాగారం. ఇందులో నిరంతరం రకరకాల జీవక్రియలు జరిగిపోతూనే ఉంటాయి. వీటిని బయటకు పంపించంటంలో మూడు అవయువాలు కీలకపాత్ర పోషిస్తుంటాయి. మూత్రపిండాలు, ఊపిరితిత్తులు, చర్మం ఈ మూడు ముఖ్యమైన విసర్జక అవయువాలు. మళ్ళీ వీటిలో కూడా 90% మలినాలను విసర్జించేవి మూత్రపిండాలే. మూత్రపిండాలు రక్తంలోని విషపదార్థాలను అదనంగా ఉన్న నీటిని క్రమంగా తొలగిస్తుంటాయి. మన కిడ్నీలు ప్రతీరోజు 200 లీటర్ల రక్తాన్ని వడపోస్తాయి.

నేటి ఉరుకు పరుగుల జీవితాల్లో చాలామంది సరిపడా నీళ్ళు కూడా తాగలేకపోతున్నారు. ఫలితంగా ఈ కిడ్నీ రాళ్ళతో సతమతమయ్యే వారి సంఖ్య నానాటికీ పెరిగిపోతుంది. చాలా సందర్భాల్లో ఈ రాళ్ళు చాలా చిన్నవిగా ఉంటూ మూత్రంలో విసర్జింపబడతాయి. కొన్ని సందర్భాల్లో రాళ్ళ పరిమాణం పెద్దగా ఉండటం కాని, మూత్రనాళాల్లో చిక్కుకొని తీవ్రమైన నొప్పిని కలిగిస్తాయి.

**కారణాలు:** అధిక బరువు, ద్రవపదార్థాలు తీసుకోకపోవటం. మూత్రఅవయావాల్లో వచ్చే ఇన్‌ఫెక్షన్. నీరు తగినంత తాగకపోవడం. జన్యుపరమైన ఇన్‌ఫెక్షన్‌లు. ఎక్కువగా వేడి వాతావరణంలో ఉండటం. వంశపారంపర్యం. కొన్ని రకాల మందులు వాడటం.

**లక్షణాలు:** పొత్తికడుపులో తీవ్రమైన నొప్పి, నీరసం, వికారం, తీవ్రమైన జ్వరం. విపరీతమైన చమటలు, బరువు తగ్గడం. మూత్రంలో రక్తంపడటం (దీన్ని హిమచ్యూరియా అంటారు) మూత్రంలో మంట రావటం. మూత్రంలో చీము రావడాన్ని పైయూరియా అంటారు.




**జాగ్రత్తలు:** నీటిని ఎక్కువగా తాగాలి, నీరుగాని ఇతర ద్రవ పదార్థాలు గాని మొత్తంగా కలిపితే రోజుకు 4 లీటర్లు తగ్గకుండా తీసుకోవాలి. కిడ్నీలో అప్పటికీ ఆక్సలేట్ రాళ్ళు ఉంటే, ఆక్సలేట్ ఉండే పదార్థాలు అంటే చాక్‌లేట్, పాలకూర, సోయా, ఎండు చిక్కుడు ధాన్యాలాంటివి తీసుకోకుడదు. కాల్షియం సిట్రేట్‌కు కిడ్నీలో రాళ్ల ఏర్పడకుండా నివారించే లక్షణం ఉంది కాబట్టి అవి శరీరానికి అందేలా ఆహార నియమాలను పాటించడం మంచిది. కూల్‌డ్రింకులను అస్సలు తాగకూడదు.

**నిర్ధారణ పరీక్షలు:** కిడ్నీ ఎక్స్‌రే, అల్ట్రాసౌండ్ స్కాన్ & కిడ్నీ పరీక్ష, రక్తపరీక్ష, మూత్ర పరీక్ష.

**హోమియో చికిత్స:** హోమియోపతిలో శారీరక, మానసిక, లక్షణాలను పరిగణలోకి తీసుకొని ఎలాంటి సర్జరీ అవసరం లేకుండానే కిడ్నీలోరాళ్ళ పరిమాణం మరియు అవి ఏ వైపున ఏర్పడ్డాయో వాటి ఆధారంగా మంచి మందులు అందుబాటులో ఉన్నాయి. ముఖ్యంగా బెరిబెరి వల్గరీస్, సరసపరిల్లా, కల్కేరియకార్బ్, కోలోసింత్ మందులను డాక్టర్ పర్యవేక్షణలో వాడాలి.

www.starhomeo.com
సికింద్రాబాద్ । కొత్తపేట । కూకట్‌పల్లి । వరంగల్ । గచ్చిబౌలి
విజయవాడ । తిరుపతి । వైజాగ్ । రాజమండ్రి । కర్నాటక
© 90300 64224

## సయాటికా (గుధ్రసీ వాతము)

ప్రస్తుత పరిస్థితిలో మానవుని జీవితం చాల యాంత్రికం గా మారిపోయింది. ముఖ్యంగా ఆహారపుఅలవాట్లు, దిన చర్య, స్వప్నవిపర్యయం (పగటీనిద్ర, రాత్రి సమయానికి నిద్రపోకపోవటం) లాంటి విషయాలలో అనేక మార్పులు రావటం వలన, ఆందోళన, మానసికఒత్తిడి లాంటి సమస్యల వలన మానవులనేక వ్యాధులబారిన పడుతున్నారు. అందులో అతి ముఖ్యమైనది (నడుమునొప్పి) కటిశూల. నూటికి 90మంది తమ జీవితకాలంలో ఎప్పుడో ఒకసారి ఈనడుమునొప్పిసమస్యతో బాధపడుతున్నారు. ఆయుర్వేద శాస్త్రంలో చరక, సుశ్రుత, వాగ్భటులు ఈ సమస్యను గుధ్రసీవాతం(సయాటికా)గా పేర్కొంటూ ఎంతో విపులంగా వివరించారు.

దీనికి సాధారణ కారణాలు పరిశీలించినట్లయితే... ఎక్కువగా ఒకే పొజిషన్‌లో కూర్చోవటం, స్థూల కాయం, అధికశ్రమతో కాడిన పనులు ఎక్కువ సేపు చేయుటం, అధిక బరువులను మోయుటం, ఎక్కువ దూరం ద్విచక్ర వాహనాలు, కార్లలోప్రయాణించటం, కొన్ని దీర్ఘకాలిక వ్యాధులువలన, కొన్ని వంశపారం పర్య వ్యాధులవలన, మరికొన్ని రోడ్డుప్రమాదాల వలన ఈ నడుము నొప్పి సమస్య వస్తుంటుంది. ముఖ్యంగా పైన వివరించిన కారణాలవలన శరీరంలో వాతప్రకోపంజరిగి, ముందుగా పిరుదులకు పైభాగాన స్తబ్ధతను, నొప్పినికలిగించి తరువాత కటి ప్రదేశం (నడుము), తొడలు, మోకాళ్ళు, పిక్కలు, పాదాలలో క్రమంగా నొప్పి కలుగుతుంది. దీనినే గుధ్రసీవాతాము (సయాటికా) అని అంటారు. ఈ సమస్య శీతాకాలంలో ఎక్కువ అవుతుంది. ముఖ్యంగా నడుముకు సంబంధించిన ఎల్4-ఎల్5, ఎస్1-ఎస్2 వెన్నుపూసల మధ్యగల సయాటికా అనే నరంపై ఒత్తిడి పడటం వల్ల ఈ నొప్పి వస్తుంది.

**డిస్క్‌లో వచ్చేమార్పులు:** ఈ వ్యాధిలో వెన్నుపూసలమధ్య ఉండే డిస్క్‌లో కొన్ని మార్పుల జరుగుతాయి. అవి డిస్క్ మీద ఒత్తిడి పెరగటం, వాపురావటం లేదా డిస్క్‌కి రక్త ప్రసరణ సరిగా లేకపోవటం, అరిగిపోవటం అనే సమస్యల వల్ల ఈ నొప్పి వస్తుంది, డిస్క్‌లో వాపు వస్తే దానిలోఉండే చిక్కనిద్రవం బయటకు వచ్చి మేరుదండం లేదా దాన్నుంచి వచ్చే నరాలపై ఒత్తిడి కలిగించటం వల్ల నొప్పి వస్తుంది.

**లక్షణాలు:** నడుములో నొప్పి కలగటం, వాపు, కొంచెం శారీరక శ్రమ చేయగానే నొప్పి తీవ్రత పెరగటం, ఈ నొప్పి సూదులతో గుచ్చినట్లుగా, ఒక్కోసారి తిమ్మిర్లు, మంటలతో కూడి ఉంటుంది. సమస్య తీవ్రమైనది అయితే స్పర్శహాని కూడా కలుగవచ్చు ఒక్కోసారి మల మూత్రాలమీద నియంత్రణకూడా పోయేప్రమాదంఉంది. వెన్ను నొప్పి బాధ అనగానే సాధారణంగా పెయిన్‌కిల్లర్స్ తో కాలయాపన చేస్తుంటారు. దీనివల్ల తాత్కాలిక ఉపశమనం కల్గుతుంది. కాని మలబద్ధకం, జీర్ణాశయ సమస్యలు మొదలవుతాయి. కావున ఇలాంటి సమస్యలను ప్రారంభదశలోనే గుర్తించి, జాగ్రత్త పడటం వల్ల ఈ వ్యాధిని నమూలంగా నయం చేయవచ్చు.

**ఆయుర్వేదచికిత్స:** ఆయుర్వేదంలో ఇలాంటి సమస్యలకు సమగ్రమైన చికిత్సాపద్ధతులుఉన్నాయి. అందులో **శమన చికిత్స:** ఇది దోషాలను బట్టి అభ్యంతరంగా వాడే ఔషద చికిత్స ఇందులో వేదన, కాయకంగా ఔషదాలు ఉంటాయి. అలాగే వాతహర చికిత్సా పద్ధతులుంటాయి.

**శోధనచికిత్స:** శమన చికిత్స వలన ఒక్కోసారి మళ్ళీ వ్యాధి తిరగబెట్టవచ్చు. అందుకే ఆయుర్వేదంలో పంచకర్మ అనే ఒక ప్రత్యేక చికిత్సా పద్ధతి ఉంది. ఈ చికిత్సా పద్ధతీ ద్వారా ప్రకోపించిన వాతాది దోషాలను సమూలంగా తగ్గించవచ్చు.

1.స్నేహకర్మ: ఈ ప్రక్రియ ద్వారా వెన్నెముకలోని వెన్నుపూసల మధ్య స్నిగ్ధత్వాన్ని పెంపొందించి, తద్వారా జాయింట్స్‌లో కదలికలను తేలికగా చేయువచ్చును.

2.స్వేదకర్మ: ఈ పద్ధతిలో గట్టిగా అతుక్కొనిఉండే జాయింట్స్ ను మృదువుగా అయ్యేటట్లు చేయువచ్చును. కటివస్తి, ఈ ప్రక్రియ ద్వారా అరిగిపోయిన మృదులాస్థికి రక్త ప్రసరణను పెంచి తద్వారా నొప్పి తీవ్రతను తగ్గించవచ్చును. అలాగే సర్వాంగధార, వస్తికర్మ అనే విశిష్ట చికిత్సా పద్ధతుల ద్వారా నాడీ కణాలలో కలిగిన లోపాలను సరిచేయువచ్చు, అదేవిదంగా ప్రకోపించిన వాతాన్ని సమస్థితికి తీసుకురావచ్చు.

జాగ్రత్తలు:సరిఅయిన పోషకఆహారాలు తీసుకోవడం. నిదాన పరివర్జనం అనగా పైన చెప్పిన ప్రత్యేక వ్యాధి కారణాలను మళ్లీ వేయకుండా జాగ్రత్త పాటించినట్లయితే ఈ సమస్యనుంచి శాశ్వతవిముక్తి పొందవచ్చును.

డా.మనోహర్. M. D (Ayurveda)
**స్టార్ ఆయుర్వేద**

ADVT
©90300 85456
సికింద్రాబాద్ । కొత్తపేట । కూకట్‌పల్లి । వరంగల్ । గచ్చిబౌలి
విజయవాడ । తిరుపతి । వైజాగ్ । రాజమండ్రి । కర్నాటక
www.starayurveda.com



# సినీ నారాయణీయం

## (ఎమ్మెస్ నారాయణ జీవితచిత్రం) 17

**చదువంటే పుస్తకం తీసుకుని చదవటం కాదు. టు లెర్న్ అని చెప్పి పిల్లల్ని ట్యూన్ చేసి వదిలేసే వాడిని. దాంతోటి వీడు టెక్స్ బుక్ తీసి చెప్పట్లేదేంటి అనే బాధలేదు ఇక్కడ. అలా ఎప్పుడైతే ట్యూన్ చేసి వదిలేశామో వాళ్ళు చదివేసుకుంటారు. మనం వాళ్ళకింక నెత్తిమీద పోయక్కర్లేదు. మ్యాథమెటిక్స్ ఒక టైప్ లెర్నింగ్ అయితే, తెలుగులో గ్రామర్ ఒక టైపు లెర్నింగ్. ఇది నేర్చుకునే వాడికి అన్నే మార్కులొస్తాయి.**

తరువాత ముఖ్యమైన ఘట్టమేంటంటే, బి.ఏ. వాళ్ళకి పాఠాలు చెప్పేటప్పుడు ఇదే దేవదాసు క్లాసు నుంచి బి.ఏ. ఫస్టు, సెకండ్ ఇయర్ నుంచీ, ఒక పన్నెండు మంది అమ్మాయిలు నాతోనే ఆడపిల్లలు వచ్చి నేను రాసిన కవితలన్నీ తీసు కొని కమిటీ కింద ఏర్పడి, వాళ్ళందరూ ఒక మాన్యుస్క్రిప్టు రాసిచ్చారు. ఆ బుక్ నా దగ్గర ఉంది. నేను చిన్నప్పటి నుంచి రాసిన కవితలన్నీ బాతనీపేట అని ఒక క్రిస్టియన్ కాలనీ ఉంది. అక్కడ గిల్లియన్ అని నా శిష్యురాలు. ఆ అమ్మా యికి ఒక చెల్లి ఉంది. ఆ అమ్మాయి ఇంటర్. ఈ అమ్మాయి డిగ్రీ. సరే ఒక వారం రోజులు నేను సెలవు పెట్టాను. కాలేజీకి వెళ్ళలేదు ఏదో పనుండి. ఆ పనీ, ఈ పనీ చూసుకొని, నిడమర్రు ప్రాబ్లమ్స్ అవీ చూసుకొని ఇంటికి వెళ్ళేటప్పటికి, ఈ గిలియన్ అన్నయ్య మా ఇంటికి వచ్చాడు. ఏంటి అనడిగా. ఏమండి మీరు ఎక్కడికి వెళ్ళారో, ఏంటో తెలియదు. మా చెల్లేమో మీరు రావట్లేదు అని గొడవ. కింద ఉందని చెప్పి నన్ను తీసు కెళ్ళాడు. తీసికెళ్తే ఆ అక్కాచెల్లెళ్ళు ఇద్దరూ లేచి

# కథ రాసి తాతినేని రామారావుగార్ని మెప్పించా

ఉండేవారు. ఇంటర్‌వెల్‌లో కానీ, కాలేజీ అయి పోయాక కానీ అలాగే మా ఇంటికి వచ్చేవారు. మా ఆవిడకు వాళ్ళు ఫ్రెండ్స్. మాస్టారు, మాస్టారు అంటూ ఉండేవారు. ఎంత గొప్ప సీనో అది.

### లేడీస్ ఫ్యాన్ బెల్ట్

జనరల్‌గా లెక్చరర్ ఇళ్ళకు బోయ్స్ వస్తుం టారు. అలాగే డ్రామా టీం ఉండేది. వీళ్ళు, ఆ వాళ్లు సేకరించి, ఆ 12 మంది అమ్మాయిల హేండ్‌రైటింగ్ తోటీ రాసి వాటన్నింటినీ ఒక బైండ్‌లా తయారుచేసి ఇచ్చారు నాకు. ఒక కవిగా చూస్తే ఆ రిలేషన్‌షిప్ ఒక విచిత్రమైన పరిస్థితి. ఈ గార్ల్స్ మా ఇంటికి రావడం, నాతో కలిసి ఉండటం, కాఫీ హోటల్‌కి వెళ్ళి అందరం కలిసి టీ తాగడం, టిఫిన్లు చెయ్యటం. వాళ్ళంతా డిగ్రీ అమ్మాయిలు. నేను ఎంత యంగ్ అంటే అప్పుడు నాకు మీసాలు ఉండేవి. డ్రీం బోయ్‌లా ఉండేవాడిని. ఈ లేడీస్ ఫ్యాన్ బెల్ట్ అనేది అప్పటినుంచీ ఉండేది. వాళ్ళ అన్న దమ్ములు పక్క క్లాసులో చదువుకునేవారు. ఎవ్వరూ అబ్జెక్ట్ చేసేవారు కాదు. ఎవ్వరూ మాట్లాడేవారు కాదు. వీళ్ళసలు ఒక అన్నతోటి ఎంత చనువుగా ఉండేవారో నాతో అలా ఉండేవారు. అప్పుడప్పుడు వాళ్ళను నేను కొట్టే వాణ్ణి. వాళ్ళు నన్ను కొట్టేవారు. అది జీవి తంలో మర్చిపోలేని ఒక కళ. అంత అను భూతిని నేను ఎప్పుడూ పొందలేదు.



వాళ్ళందరూ ఇప్పుడు వాళ్ళ భర్తలతో ప్రపంచం అంతా వ్యాపించి ఉన్నారు. ఈ ఆడ పిల్లలు, వాళ్ళ భర్తలు నాకు ఫోన్లు చేస్తారు. ఎప్పుడూ మీ గురించే చెప్తుందండీ మా ఆవిడ. భలే యాక్ట్ చేస్తారు మీరు, చాలా బాగుంటారు సార్ అని. అఫ్‌కోర్స్, నేను స్టార్ అవ్వకుండా వెనకబడిపోయుంటే వాళ్ళు ఎలా మాట్లాడేవారో అది వేరే విషయం. అప్పుడు వీళ్ళు కూడా మాట్లాడేవారు కాదేమో వాళ్ళ దగ్గర. ఎంత గొప్ప రిలేషన్ ఉండేదో చెప్తాను. పెన్నులు అవి ఇవీ గిఫ్టులు ఇచ్చి వాళ్ళకు క్రిస్టి యన్ మిషన్ ఇచ్చినవి దాచి నాకిచ్చి, అదేంటండి వారం రోజుల నుంచి కాలేజీకి రావడంలేదు. మాకు కాలేజీకి రాబుద్ధి కావడంలేదు అన్నారు. వాళ్ళన్నయ్య, నేనూ ఒకటే ఆ అమ్మాయిలకి.

ఈ ఆడపిల్లల అనుబంధం. ఎలాంటిదంటే, వాళ్ళు కలిస్తే సాహిత్యగోష్ఠి, ఆదర్శాలు, ఆశయాలు, ఎలా గొప్పవాళ్ళు అవ్వాలి, ఇవి చెప్తుంటే వాళ్ళు అద్భుతమైన స్వప్న ప్రపంచంలోకి వెళ్ళిపోయే వారు. నేను అలా వాళ్ళకు చెప్పడానికి కారణం శ్రీశ్రీ, శరత్‌చంద్ర చటర్జీ నవలల్లో ఆ రచయి తలు స్త్రీకి ఇచ్చిన ప్రాధాన్యం నా మెదడుకు పట్టే యడమే. అందుకనే స్త్రీని స్త్రీగా చూసేవాళ్ళమే తప్పా, ఇతర దృష్టి తక్కువ ఉండేది. నా భార్యను నేను అలాగే ప్రేమించాను. ప్రేమించిన భార్య తోటే ప్రేమించినట్టు, మిగిలిన వాళ్ళందరూ అక్కలు, చెల్లెళ్ళూ, లేకపోతే అమ్మలూ... నేను అట్లానే బతికా. అందుచేత ఇప్పటికీ కూడా నేను చె ప్పిన కాలేజీ లెసన్స్‌లో ఆ చరిత్రలో అప్పుడున్నటు వంటి వాళ్ళ ప్రభావం ఉండేది."

### మద్రాసు ప్రవేశానికి రంగం సిద్ధం

సినిమా కథలు రాసే ప్రయత్నం ముమ్మ రమైంది. ఈసారి గట్టి పట్టుదలతో పని ప్రారం భించారు ఎంఎస్.

"ఎప్పుడైతే ఆంధ్రాయూనివర్సిటీలో 'ప్లస్ అండ్ ఇంటూ ఆర్ ఈక్వల్' నాటిక ప్రదర్శించామో, ఎప్పుడైతే ఆ నాటికకు ఆరు బెస్ట్ అవార్డులు వచ్చాయో అప్పుడే మరింత మంచి ప్రోత్సాహం

దొరికింది నాకు. నేను చిత్రపరిశ్రమకు వెళ్ళాలి అనుకోవటానికి ఓ కారణం ఈ అవార్డులు రావడమే. అప్పటికే నేను స్నేహితులందరికీ రేయింబవళ్ళు స్టోరీలు చెప్పేవాడిని. కాబట్టి ఈ నాటిక కోసం తయారయిన టీం అందరూ కూడా మీరు సినిమాలకు వెళ్ళాలి మాస్టారు. మీరు రచయిత అని నన్ను ప్రోత్సహించేవారు. వెళ్ళాలి. కానీ ఎలా వెళ్ళాలి? అంటే దారి తెలియదని కాదు. అక్కడికి వెళ్ళి డబ్బులు పెట్టి రూం తీసుకుని ఉండాలి. ఎక్కడ తీసుకుని ఉండాలి. ఎలా చెయ్యాలి ఇదంతా. అంతకు ముందొకసారి పారిపోయినప్పుడు, మడుగూరి సింహయ్య గురించి చెప్పాను కదా. ఆయన్ని బేస్ చేసుకొని వెళ్దామనుకుంటే ఆయన ఉన్నారో మరణించారో తెలియదు. అప్పటికే చాలా కాలమైంది. 1976-78లో వెళ్ళినవాణ్ణి, మళ్ళీ 1985 నాటికి ఆలోచన వచ్చింది. ఆయన అప్పటికే పెద్దాయన. అడ్రస్ కూడా తెలియదు.

ఇదంతా ఎందుకు అనవసరం అనుకుని, అప్పటికే భీమవరం నుంచి రాఘవేంద్రరావుగారి దగ్గర పనిచేసే మూర్తి అనే కుర్రాడు దగ్గరికి వెళ్ళా. ఈసారి చెన్నై వచ్చినప్పుడు, నాకు ఫోన్ చేయండి అన్నాడు. అక్కినేని వినయ్‌కుమార్ గారింట్లో ఉంటున్నాడు. ఒక పక్కగదిలో అక్కినేని వినయ్ కుమార్‌గారు. 'పవిత్ర' అనే సినిమాని 1985లో రాజేంద్రప్రసాద్, భానుప్రియతో తీశారు. ఆయన ఇంట్లో ఉంటున్నారు కాబట్టి ఈ మూర్తిని బేస్ చేసుకుని మనం వెళ్ళవచ్చు. వెళ్ళటానికి నా దగ్గర డబ్బులు లేవు.

**టీనగర్ హోటల్‌లో బస**

సరే అప్పుడు టౌన్ హాల్ కమిటీ మెంబర్‌ని. టౌన్ హాలులో తాడేరు సత్యనారాయణగారు, బడంగ్ అని మరొకాయన నాకు ఫ్రెండ్స్ అయ్యారు. వాళ్ళు వీక్లీ వన్స్ చెన్నై వెళ్ళి అక్కడ మహాలక్ష్మి క్లబ్ అని ఒక క్లబ్ ఉంది. దాంట్లో పేకాట ఆడి వస్తుంటారు. రెండు మూడు రోజులు అక్కడ మకాం ఉండటానికి వీలుంది.

**ఆంధ్రాయూనివర్సిటీలో ఎమ్మెస్ రాసిన నాటికకు ఆరు అవార్డులు రావడంతో ఆయన హవా మొదలైంది. ఆయనకో లక్ష్యం ఏర్పడింది. సినిమా రచయితగా స్థిరపడాలనుకున్నారు. స్నేహితుల ప్రాపకం సంపాదించి మద్రాసు రెగ్యులర్ జర్నీ మొదలెట్టారు. పద్మనాభం దగ్గరకెళ్ళి కథ వినిపించారు. కథ చాలా బాగుందని మెచ్చుకున్నారాయన. కానీ నిస్సహాయత వ్యక్తం చేశారు. ఆ తర్వాత ఎమ్మెస్ ఎవర్ని కలిశారు? ఏం చేశారు?**

వాళ్ళని అడిగాను. ఏమండీ నేనొచ్చి మీ రూంలో ఉండొచ్చా. అక్కడ కథలు చెప్పుకోవాలి నేను అన్నా. సరే అన్నారు. ఒక ట్రిప్పు వాళ్ళతో మద్రాసు బయలుదేరి వెళ్ళి వాళ్ళతో ఉన్నా. నాకు ఓ టికెట్టు, ఆహార వ్యవహారాలు అన్నీ వాళ్ళే. సరే, వీళ్ళు చెన్నై వెళ్ళిన తరువాత టాక్సీ బుక్ చేసేవారు. టాక్సీలో హోటల్‌కి వెళ్ళేవాళ్ళం. సుధా హోటల్ అని టీనగర్ బస్టాండ్ దగ్గర తీసుకున్నారు. ఆ హోటల్లో రెండు రూంలు తీసుకున్నారు. వాటిల్లో నేనుండేవాణ్ణి.

వీళ్ళు పొద్దున్నే లేచి టిఫిన్‌లు చేసి తయారై పోయి డ్యూటీకి వెళ్ళినట్టుగా పేకాటకు వెళ్ళిపోయేవారు. వాళ్ళు పేకాట ఆడుకుంటుంటే, కథలు రాసి ఎవరెవరికి చెప్పాలా? అని ఆలోచిస్తూ నేను తిరిగేవాడిని.





**పద్మనాభంగారికి కథ చెప్పా**

అప్పుడు అక్కడ సినిమా వేషాల కోసం ట్రై చేసేవాళ్ళు సినిమా డైరీలు ఎలా కొనుక్కుంటారో అలాగే నేను కూడా సినిమా డైరీ ఒకటి కొన్నా. దాంట్లో ఫోన్ నెంబర్లు, వాళ్ళ ఇంటి అడ్రసులూ అన్నీ ఉంటాయి. ఎదురుగా టీనగర్‌కి దగ్గర్లో నాగార్జున నగర్ అని ఉంది. అక్కడ పద్మనాభంగారి ఇల్లు ఉంది. ఇవతలి వైపు ఇంట్లో ఆఫీసు ఉంది. ఫస్ట్ వెళ్ళడం వెళ్ళడమే 'టీచర్ ఆంజనేయులు' అనే ఒక టైటిల్‌తో కథ రాశాను. ఆ కథ పద్మనాభంగారికి చెప్పా. అప్పటికే రేఖా అండ్ మురళీ ఆర్ట్స్ బ్యానర్‌లో సినిమాలు తీశారు పద్మనాభంగారు. నా దైనందిన పరిస్థితి బాగాలేదు. నేనే చాలా కష్టాల్లో ఉన్నా. ఇది సినిమా తీయొచ్చు. కానీ తీసే స్తోమత లేదు. ఈ మధ్యాహ్నం నాతో భోజనం చేసి వెళ్ళు అని ఆయన భోజనం పెట్టి, కథ బాగుందని సర్టిఫై చేశారు. నాకు సినిమా సక్సెస్ అయినంత ఆనందం వచ్చింది. సరే వారితో మాట్లాడి భోంచేసి, ఎవరికి చెప్పాలని అడిగాను. ఎవరికి చెప్పాలి. చెప్పినా వినరు కదా అన్నారు. ఆ ట్రిప్పు అలా వెనక్కి వచ్చేశాను. అది నాలుగు రోజుల ట్రిప్పు. మళ్ళీ కాలేజీలో జాయినైపోయాను.

**తాతినేని రామారావుగారికి కథ రాసిచ్చా**

టౌన్ హాలులో మిత్రులంతా పరిచయమయ్యారు. పేకాట రాయుళ్ళు, పొరుగూర్ల వెళ్ళేవాళ్ళు. మనం అడిగితే ఒక వెయ్యి రూపాయలు ఇచ్చేవారు. ఇట్లా మద్రాసుకు రెగ్యులర్ జర్నీ స్టార్ట్ చేశా. సిలిండర్ రాంబాబుగారని ఒకాయన ఉన్నారు. ఆయనకి తాతినేని రామారావుగారు ఫ్రెండ్. ఆయనకి ఓ ఉత్తరం రాసి ఇచ్చారు రాంబాబుగారు. తాతినేని రామారావుగారి దగ్గరికి వెళ్తే, కృష్ణగారికి, శోభన్‌బాబుగారికి ఒక కథ రాయండి అన్నారు. అప్పుడు నేనేం చేశాను. జెఫ్రీ ఆర్చర్ రాసిన కేన్ అండ్ ఏ బుల్ నవల కొన్నా. ఆ పుస్తకం మద్రాసు మౌంట్ రోడ్‌లో హిగ్గిన్ బాదమ్స్ షాపులో దొరికింది. అది తీసుకెళ్ళి రాఘవేంద్రరావుగారిని పరిచయం చేసిన మూర్తిగారిని పట్టుకున్నా.

మూర్తిగారు అక్కినేని వినయ్‌కుమార్ గారింట్లో అతను ఉంటున్న రూంలో నాకో షెల్టర్ ఏర్పాటు చేశారు. వినయ్‌కుమార్ గారు గొప్ప స్నేహశీలి. ఆయన కూడా సినిమా ప్రయత్నాల లోనే ఉన్నారు. అప్పుడే కొత్తగా పెళ్ళయ్యింది. ఇబ్బందులలోనే కొన్ని రోజులు నాకు ఆశ్రయం ఇచ్చారు. ఇప్పటికీ నాకు మంచి మిత్రులుగానే ఉన్నారు.

రంగరాజపురంలో ఉంటూ, మెస్‌కి డబ్బులు పెట్టుకొని, వారం రోజులు సెలవు పెట్టడం, ఐదు రోజులు సెలవు పెట్టడం, అలా మూడు నెలలు తాతినేని రామారావుగారి దగ్గర ఈ కథని తెలుగు కథగా రచించా. వాళ్ళు కథ రాయమనడం ఒక క్వాలిఫికేషన్‌గా భావించి రెచ్చిపోయి పూర్తి చేశా. ఆ కథ పూర్తయ్యింది. ఫైలు ఇచ్చాను. చదివారు. కథ చాలా బాగుందయ్యా. మంచి నేటివిటీ తీసుకొచ్చావు. చక్కటి కథ అన్నారు.

***(ఇంకావుంది)***

**-కూనపరాజు కుమార్**

**సెల్: 99899 99599**

# కల నిజమాయెగా కోరిక తీరెగా...

"కలలకు అంతర్గత కోర్కెలు నిజమైన భాష్యాలు. వాటిని అర్థం చేసుకుని, అమలు పరిచే వారినే విజయం వరిస్తుంది"

-మోంటెజ్

**కలలు:**

క్షణాల్లో మన స్వరూపాన్నీ, పరిసరాల్నీ మరపించి, ఎక్కడికి కావాలంటే అక్కడికి, ఉన్నచోటు వదలకుండా కాంతి వేగం కంటే ఎక్కువగా విశ్వాన్నంతా మనోవీక్షణం చేయించగల కలర్ ఫుల్ కలలు. పవర్‌ఫుల్ కలలు. అవధులు లేకుండా ఏ లోకానికైనా, ఏ దేశానికైనా క్షణాల్లో తీసుకెళ్ళి తిప్పి చూపించగలవు కలలు. దరిద్రుడు మొదలు ధనవంతుడి వరకు పైసా ఖర్చు లేకుండా ఊహల్లో విహరింపజేస్తాయి.

కొన్ని కలలు క్షణాల్లో అద్భుత లోకాలు చూపిస్తాయి. మరికొన్ని సూపర్ ఫాంటసీలు, గగుర్పొడిచే సన్నివేశాలు... పొంతనలేని కలలు వస్తుంటాయి. మెలకువ రాగానే మాయమవుతాయి. మనం ఎక్కడున్నామో మరచిపోయేలా చేస్తాయి. కొన్నిసార్లు భయానక కలలు మెలకువలో కూడా వణికిపోయేలా వెంబడిస్తాయి. మరికొన్ని కలలు రసాస్వాదనలో తేలుస్తాయి.

**"నిద్రలో వచ్చేవి కలలు కావు. నిద్ర లేకుండా చేసేవే నిజమైన కలలు"**

-అబ్దుల్ కలాం

మనిషి భవిష్యత్తు గురించి కనే కలలకు పగలూ-రాత్రీ, నిద్ర-మెలకువలతో, సంబంధం ఉండదు. అసాధ్యం ఊసెత్తకుండా, పాజిటివ్‌గా ఆలోచింపజేసి.. ముందుకు నడిపించి, విజయాన్నందించేవే నిజమైన కలలు.

**బాల్యం నుండే**

పసి పిల్లలు తప్పటడుగులు వేయటం, పరుగెత్తటం..అత్త, తాత అంటూ పలకటం.. ఇవన్నీ వాళ్ళ కలలేనేమో! అందుకే శరీరంతోబాటు మానసికంగా జరిగే ఆ ఎదుగుదలలో సంశయం, భయం, ఆ కలల్లోకి చొరబడినట్టు కన్పించవు. పడతాడు, లేస్తాడు, గెంతుతాడు. అనుకున్నది సాధించే వరకు ఆ కల పసివాళ్ళని అలుపునకు గురి చెయ్యదు. ఒకొక్కటీ నేర్చుకుంటూ పురోగమనం వైపు సాగిపోతాడేతప్ప, తిరోగమనం దగ్గర చతికిల పడడు.

దటీజ్ ద పవర్ ఆఫ్ డ్రీమ్.

**కల.. వరం**

మనిషికి దేవుడు ఇచ్చిన వరం కల. ఒక మధురానుభూతి. ఆలోచన సృష్టిస్తుంది. ఆవిష్కరణలకు ప్రేరణ ఇస్తుంది. ఆ నూతన ఆవిష్కరణలే ఎప్పటికప్పుడు కొత్త ప్రపంచాన్ని సృష్టిస్తున్నాయి. షాజహాన్ కల తాజ్‌మహల్. లారీపేజ్, సెర్జీబ్రిన్‌ల కల గూగుల్. వారన్ బఫెట్ కల స్టాక్ మార్కెట్.

"పెద్దయ్యాక ఏమవుతావురా?" అని అడగ్గానే, క్రికెటర్, డాక్టర్, యాక్టర్... అని తమకి తెలిసిన వాళ్ళని దృష్టిలో ఉంచుకుని పిల్లలు చెబుతుంటారు. ఆ వయసులో 'కలే' వాస్తవం అన్పిస్తుంది. వయసు పెరిగేకొద్దీ నిర్వచనాలు మారిపోతాయి. కానీ కలల్ని కొందరు మాత్రమే సాకారం చేసుకోగలరు.

డా. జయప్రకాష్ నారాయణ్ ఐ.ఎ.ఎస్., అయినప్పటికీ ఆయన పొలిటీషియన్. సినీ నటుడయ్యాడు డాక్టర్ రాజశేఖర్.

**కార్యాచరణ**

**"కల కానిదీ... విలువైనదీ బ్రతుకు కన్నీటి ధారలలోనే బలి చెయ్యకు/...**

**అగాధమౌ జలనిధిలోనా ఆణిముత్యమున్నటులే, శోకాల మరుగున దాటి సుఖమున్నదిలే/....**

**ఏదీ తనంత తానే నీ దరికి రాదు..**

శోధించి, సాధించాలీ.. అదియే ధీరగుణం' అన్నారు మహాకవి శ్రీశ్రీ.

ఎంత వాస్తవం ఉందో చూడండి. కల కలగానే మిగిలిపోతే దానికి విలువలేదు. వెలుగులోకి తెస్తేనే.. కల విలువైనదిగా మారుతుంది. ఉన్నత స్థాయికి చేరుకోవాలని అందరూ కలగంటారు. కానీ వాళ్ళంతా విజేతలు కాలేకపోతున్నారు.

ఆచరణలో పెట్టని అద్భుత ఆలోచన కంటే, ఆచరణలో పెట్టే చిన్న కల ఎంతో ఉత్తమం.

కలగనటం ప్రాథమిక దశ. దాని కార్యాచరణకు ఎన్నో ఒడిదుడుకులు ఎదుర్కోవాలి. ఎన్నో దశలు దాటాలి.

సముద్రంలో ఆకాశ హర్మ్యాల నిర్మాణం, గ్రహరహస్యాల శోధన వంటి వాటన్నింటికీ కారణం, కాలహరణం లేకుండా, కష్టనష్టాల్ని ఎదుర్కొంటూ కలల్ని కార్యాచరణలో పెట్టడమే!

**విజయ విలాసం**

**స్టెప్స్ టు సక్సెస్** 20

-ఎం. వెంకటేశ్వరరావు, సెల్: 90307 07037

శోకగీతాలు పాడుకుంటూ కూచునేవాళ్ళ కల లెన్నటికీ నెరవేరవు.

ఎగరటానికి పక్షికి కావల్సింది రెక్కలు. ఆ రెక్కలకు కావల్సింది ఈకలు. ఎంత పెద్దరెక్క లుంటే ఎన్నెన్ని ఈకలుంటే అంత బాగా ఎగ రొచ్చు. కలలూ అంతే అనుకుంటాం. కానీ ఆస్ట్రిచ్ అనే పెద్ద పక్షికి పెద్దపెద్ద రెక్కలుంటాయి. చాలా ఈకలుంటాయి. కానీ పైకెగరలేదు. కానీ చిన్న పక్షి గబ్బిలానికి రెక్కలుంటాయి గానీ ఈకలుం డవు. అయినా పైకి ఎగురుతుంది.

మనకు కనిపించకుండా మనలో అంతర్గతంగా ఉండే తృష్ణ, కోరిక, కలలను గుర్తించి కార్యాచర ణలో పెట్టటమే విజేతల లక్షణం.

## ప్రోత్సాహం

పిల్లలు తమకు వచ్చిన కలల్ని గురించి చెప్పి నప్పుడు తల్లిదండ్రులు పట్టించుకోరు. గొప్ప విజ యాలు సాధించిన వాళ్ళంతా తల్లిదండ్రులకంటే ఉన్నత శిఖరాలు అధిరోహించిన వాళ్ళే. కానీ బాల్యంలో వారి కలలు ఓపిగ్గా విని, వాటి సాకా రానికి ప్రోత్సాహమివ్వాల్సింది తల్లిదండ్రులేనని గుర్తించండి.

తల్లిదండ్రులు ప్రోత్సహించకపోతే మనకో సచిన్ టెండూల్కర్, సైనా నెహ్వాల్, విశ్వనాథన్ ఆనంద్, సుందర్ పిచ్చై, సత్య నాదెళ్ళ, జాకీర్ హుస్సేన్, ఎ.ఆర్.రెహ్మాన్, అంబానీలు, ప్రేమ్‌జీ, ఇంద్రా నూయీ, పద్మశ్రీ వారియర్ నుండి రాజ మౌళి వంటి వాళ్ళు వెలుగు చూసే వాళ్ళేనా?

కాబట్టి పిల్లలు ఏం కాగలరో, వాళ్ళెంత ఎత్తు లకు ఎదగగలరో ఎవరూ ఊహించలేరు. తల్లిదం డ్రులు వాళ్ళ కలల్ని మొగ్గదశలోనే తుంచివేయ కుండా వట వృక్షంలా విస్తరించే వరకూ ప్రోత్స హించాలి.

అమెరికా ప్రెసిడెంట్ ఒబామా భార్య ఏ దేశం వెళ్ళినా అక్కడ స్కూళ్ళకి వెళ్ళి వాళ్ళతో కొంత సమయం గడుపుతుంది. కలలు కనమని ఆ పిల్లల్ని ప్రోత్సహిస్తుంది. అద్భుతమైన కలలు కనమని ప్రోత్సహిస్తుంది. ఎంత అసంభవం, సుదూరం అన్పించినా ఆ కల సాకారానికి పట్టు దలతో కృషి చెయ్యమంటుంది. ఇలా మన పాఠ శాలల్లో, కాలేజీల్లో కలల సాకారానికి సంబంధిం చిన అంశాలను ప్రాథమిక స్థాయి నుండి నేర్పే స్కూళ్ళు చాలా అరుదే.

## మనమే సృష్టించుకోవాలి

మన కల సాకారం కావాలంటే అనుకూల పరిస్థితులు మనమే సృష్టించుకోవాలి. ఎవరో వచ్చి ఏదీ చెయ్యరు. చేసినా అది తాత్కాలికమే. ఎందుకంటే నీ కల సాంద్రత వాళ్ళకి తెలియదు. ఉన్నతమైన కలలుగనే వ్యక్తులు తక్షణం తమ కలల్ని కార్యాచరణలో పెడతారు. మీనమేషాలు లెక్కిస్తూ.... సమస్యలొస్తాయనీ, ఏ పనిచేస్తే ఏ ఫలితం వస్తుందో అని కాలాన్ని వృథా చెయ్యరు. ఎదురొచ్చే సమస్యల్ని పరిష్కరించుకుంటూ ముందుకు సాగిపోతుంటారు.

## వాయిదా అపజయానికి తొలిమెట్టు

అవరోధాలకి, సమస్యలకి భయపడే వ్యక్తులు పరిస్థితుల్నో, ఎదుటి వారినో తప్పుబడుతూ చెయ్యదల్చుకున్న పని వాయిదా వేస్తుంటారు. వాయిదా అపజయానికి తొలిమెట్టు.. సోమరి తనం మలిమెట్టు. ఈ రెండూ తోడయితే కలలు కరిగిపోతాయి. ఆలోచనలు ఆగిపోతాయి.

- థామస్ ఆల్వా ఎడిసన్ విద్యుత్ బల్బు కను గొన్న మేధావి. తన కల సాకారానికి 10,000 సార్లు అపజయాన్ని చవిచూశాడు. తర్వాత విజయం సాధించి ప్రపంచానికి వెలుగు ప్రసాదించాడు.
- క్రియేటివిటి లేదని ఎన్నోసార్లు తిరస్కారానికి గురైనప్పటికీ వాల్ట్ డిస్నీ తన కలకి ఏనాడూ ఫుల్‌స్టాప్ పెట్టలేదు. అలా చేస్తే "ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన "డిస్నీలాండ్" ఉండేదేకాదు.

**"అధములు' విఘ్నములు సంభవించునని కార్యము లారంభింపరు.**

**"మధ్యములు" విఘ్నములెదురైన కార్యము విడుతురు.**

**"ధీరులు" ఎన్ని విఘ్నములెదురైనా చేపట్టిన కార్యమునందు విజయము కైవసము చేసు కొందురు".**

"బ్యాంకింగ్ రంగంలోకి సరికొత్తగా వచ్చి ఐ.ఎన్.జి. వైశ్యాబ్యాంకుని సొంతం చేసుకున్న కొటక్ మహేంద్రా సంస్థకి అధిపతి ఉదయ్ కొటక్. 1985లో కొటక్ క్యాపిటల్ మేనేజ్‌మెంట్ ఫైనాన్స్ ప్రారంభించి క్రమంగా బ్యాంకు స్థాపించి, బ్యాంకును ఈరోజు 20 బిలియన్ డాలర్ల స్థాయికిచేర్చి తన కల సాకారం చేసుకున్నాడు.

అంతేకాదు, తన కింద పనిచేసే ఉద్యోగుల కలలు, కోర్కెలు కనిపెట్టి, వారి కలలు సాకార మయ్యేలా చూడటంలో ఉదయ్ కొటక్‌ది ప్రత్యేక శైలి.

కలల్ని కార్యాచరణలో పెట్టిన వెంటనే విజయం వచ్చి ఒళ్ళో వాలిపోతుందని కలలు కనండి. గొప్ప సక్సెస్‌లు సాధించిన దిగ్గజాల్లో చాలామంది అప జయాన్ని ఎదుర్కొన్నవాళ్ళే.

మొదట ట్రాఫ్-ఒ-డేటా అనే కంపెనీతో మొదలు పెట్టి పెద్ద అపజయాన్ని చవిచూశాడు బిల్‌గేట్స్. అతని కల అక్కడితో ఆగిపోనీయకుండా కొద్ది కాలంలోనే 'మైక్రోసాఫ్ట్' సంస్థను స్థాపించి, విజ యానికి కొత్త భాష్యం చెప్పి ప్రపంచ ధనవం తుల సరసన నిలిచాడు.

గొప్ప కలలు కనండి. 'కల' అంటేనే నిద్రలో వచ్చేవిగా భావించకండి. మిమ్మల్ని నిద్రపోనివ్వని కలల గురించి ఆలోచించండి. వాటిని సాకారం చేసుకోవటంలో నిద్రపోకండి. విజయానికి విలాసం మీరే కావొచ్చు.

*(ఇంకావుంది)*

## హేట్సాఫ్



**"పెద్దయ్యాక ఏమవుతావు?" టీచరు ప్రశ్న.**

**"బాలీవుడ్‌లో పెద్ద హీరోనవుతా" కుర్రాడి జవాబు.**

**"అసంభవం... ఎందుకంటే, నీకూ, దానికీ సంబంధం లేదు" అన్నాడు టీచరు. కుర్రాడు మౌనం.**

**టీచరు.. కుర్రాడి తల్లితో అదే విషయం చెప్పాడు.**

**"పొరబడుతున్నారు. నా కొడుకు కలగన్నా డంటే సాధించి తీరతాడు" తల్లి జవాబు.**

•••

బాలీవుడ్ బాద్‌షా.

ప్రపంచంలోనే ఎక్కువ సక్సెస్ సాధించిన హీరోల సరసన స్థానం సంపాదించిన బాలీ వుడ్ సూపర్ హీరో షారూఖ్‌ఖాన్. కింగ్‌ఖాన్, కింగ్ ఆఫ్ బాలీవుడ్. షార్ట్‌గా ఎస్ఆర్‌కె. నటుడు, నిర్మాత, సీరియల్స్‌లో నటుడు.

1965 నవంబర్ 2న ఢిల్లీలో జన్మించాడు. చదువు తర్వాత బారీజాన్ దగ్గర యాక్టింగ్‌లో శిక్షణ. సెంట్ కొలంబస్ స్కూలు, హన్స్‌రాజ్ కాలేజీలో డిగ్రీ. తర్వాత ఎకనామిక్స్ పి.జి. ముంబయ్ వెళ్ళి బాలీవుడ్‌లో తన అదృష్టం పరీక్షించుకున్నాడు. దిల్ దరియా, సర్కస్, ఫౌజి వంటి సీరియల్స్ చేశాడు. 1992లో 'దీవానా'తో సినిమా అరంగేట్రం. 1993-94లో డర్, బాజీగర్ సినిమాల్లో యాంటీ హీరో. 1995-98 మధ్య కాలంలో రొమాంటిక్ హీరోగా, దిల్‌వాలే దుల్హ నియా లేజాయేంగే వంటి ఆల్‌టైం బ్లాక్ బస్ట ర్‌లో నటించాడు. 1999-2003 మధ్య కొన్ని అప జయాలొచ్చినా 2004-2009లో మళ్ళీ పుంజుకు న్నాడు. బాలీవుడ్ పేట్రియాటిక్ సినిమాలు... దేవదాసు, చెన్నై ఎక్స్‌ప్రెస్, హ్యాపీ న్యూ ఇయర్, దిల్‌వాలే వంటి సూపర్‌హిట్ సినిమాలు షారూఖ్ ఖాతాలో ఉన్నాయి.

బాలీవుడ్‌లో హీరో అవ్వాలన్న తన బాల్యపు కల నెరవేర్చుకునేందుకు సక్సెస్ కోసం షారూఖ్ నిరంతర శ్రమ, అతన్ని బాలీవుడ్ బాద్‌షాగా మార్చాయి.

అతని విజయాలకు గుర్తింపుగా 2005లో పద్మశ్రీ పురస్కారం లభించింది.

కల...పట్టుదల...కార్యాచరణ..సాకారం.. సక్సెస్.. కేరాఫ్ షారూఖ్.

- హేట్సాఫ్




## పుట్టుకతో వచ్చే ఇష్టం

కొందరు పిల్లలు వ్యాయామం అంటే ఇష్టపడతారు. మరికొద్దిమంది ఆ మాటను తలచుకోవడానికి కూడా ఇష్టపడరు. దీనికి కారణం తల్లి అలవాట్లేనని టెక్సాస్‌లోని పిల్లల ఆసుపత్రి వైద్యులు అంటున్నారు. తల్లికి వ్యాయామం పట్ల ఆసక్తి ఉంటే ఆమె పిల్లలకు కూడా ఆ ఇష్టం వస్తుందన్న విషయం వీరి పరిశోధనలో వెల్లడైంది. ఇదే విషయంపై వీరు ఎలుకల మీద పరిశోధనలు నిర్వహించారు. చురుకుగా తిరిగే ఎలుకలు, చురుకుగా తిరగని ఎలుకల మీద వీరు పరిశోధనలు నిర్వహించారు. చురుకుగా తిరిగే ఎలుకలకు పుట్టిన పిల్లలు కూడా చురుకుగా ఉండగా, మందకొడిగా ఉండే ఎలుకలకు పుట్టిన పిల్లలు స్తబ్దుగా ఉండడాన్ని వీరు గమనించారు. తల్లులను బట్టి పిల్లల ప్రవర్తన ఆధారపడి ఉంటుందని వీరు నిర్ధారించారు. పిల్లలకు చాలా వరకూ అలవాట్లు ఇష్టాఇష్టాలు తల్లుల నుంచే వస్తాయన్నది మాత్రం వాస్తవమని వీరు స్పష్టం చేస్తున్నారు. పిల్లల్లో కనిపించే ఒబేసిటీకి ఓ విధంగా తల్లే కారణమవుతుందని కూడా వీరు చెబుతున్నారు. ఈ విషయం మీద ఇంకా పరిశోధనలు నిర్వహించాల్సి ఉందని వీరు అంటున్నారు.



## బట్టర్ కాఫీతో బరువు తగ్గండి

ఉదయాన్నే తాగేకాఫీలో ఓ స్పూను బట్టర్ (వెన్న)కలుపుకుని తాగితే బరువు తగ్గడానికి అవకాశం ఉంది అంటున్నారు పరిశోధకులు. వెన్న తింటే లావెక్కుతారు కదా? అన్న అనుమానాన్ని వారు కొట్టిపారేస్తున్నారు. కాఫీలో వెన్న కలుపుకుని తాగడం వలన ఎక్కువ సేపు కడుపు నిండుగా ఉంటుందనీ, కనీసం మరోసారి కాఫీ తాగాలనే కోరిక కూడా కలగదనీ వారు చెబుతున్నారు. దీని వలన అదనపు క్యాలరీల బెడద తగ్గుతుందని కూడా వారు స్పష్టం చేస్తున్నారు. ఇదే విషయం మీద కొంత మంది ఊబకాయుల మీద వారు పరిశోధనలు నిర్వహించారు. సుమారు వంద మందిని రెండు గ్రూపులుగా విభజించి ఒక గ్రూపు వారికి వెన్న కలిపిన కాఫీని, మరొకరికి మామూలు కాఫీని ఇచ్చారు. కొన్ని నెలల అనంతరం రెండు గ్రూపుల బరువును పరిశీలించగా వెన్నకాఫీ తాగిన వారి బరువులో స్వల్ప మార్పు కనిపించగా, మామూలు కాఫీ తాగిన వారు కొద్దిగా బరువు పెరగడాన్ని వారు గుర్తించారు. వెన్న కాఫీ తాగిన వారిలో ఆహారం తీసుకోవాలన్న కోరిక కలగకపోవడం, గతం కన్నా వారి మెదడు చురుకుగా పనిచేయడాన్ని వారు కనుగొన్నారు. వెన్న కాఫీలో చక్కెరకు బదులుగా వెన్న కలుపుకోవాలనీ, అది కూడా వెన్న కలిపిన వెంటనే కాఫీ తాగేయాలనీ, నెయ్యి పైకి తేలేంత వరకూ ఆగకూడదనీ వారు సూచిస్తున్నారు.

## పండు కన్నా విత్తనమే మంచిది

చాలా మంది పళ్ళల్లో విత్తనాలు తీసి పడేసి గుజ్జు మాత్రమే తింటారు. కానీ ఇలా తీసిపడేసిన విత్తనాలే ఆరోగ్యానికి చాలా మంచివనీ, పండు గుజ్జు కన్నా కూడా ఇవే ఎక్కువ ఆరోగ్యాన్ని ఇస్తాయనీ అంటున్నారు పరిశోధకులు . పండులోని విత్తనాలు తినడం వలన కలిగే ప్రయోజనాల మీద వారు పరిశోధనలు నిర్వహించారు. వేసవిలో తరచూ తీసుకునే పుచ్చకాయ విత్తనాలు జుత్తు, చర్మం, గోళ్ళ ఆరోగ్యాన్ని కాపాడతాయి. వీటిని పండుతో పాటు తీసుకోవడమే మంచిదని వారు సూచిస్తున్నారు. బొప్పాయిలోని విత్తనాలను పండుతో సహా తీసుకోవడం మంచిది. ఈ విత్తనాలలో ప్రొటియోలిక్ ఎంజైమ్‌ల వలన కడుపులో ఉండే నులిపురుగులు నశిస్తాయి. ముఖ్యంగా చిన్నపిల్లల్లో నులిపురుగుల సమస్య తరచూ కనిపిస్తూ ఉంటుంది. అలాంటి పిల్లలకి ఈ విత్తనాలను ఇవ్వడం మంచిదని వారు సూచిస్తున్నారు. అయితే చిన్నపిల్లలకు వీటిని ఇచ్చే విషయంలో వైద్యుల సలహా తీసుకోవడం తప్పనిసరని వారు చెబుతున్నారు. గుమ్మడి విత్తనాలు తీసుకోవడం వలన డిప్రెషన్‌తో పాటు శరీరంలో వాపును కూడా తగ్గిస్తాయని వారు అంటున్నారు. అలాగే నిమ్మకాయ విత్తనాలు, కివి సీడ్స్ కూడా మంచి ఫలితాన్నే ఇస్తాయని వారు చెబుతున్నారు



## కొలెస్ట్రాల్‌ను తగ్గించే బెండకాయ నీరు



బెండకాయ తింటే తెలివితేటలు పెరుగుతాయన్నది చాలా మంది నమ్మకం. అదే బెండకాయ నీటిని తాగితే శరీరంలో చేరిన అధిక కొలెస్ట్రాల్‌ను, బ్లడ్ షుగర్‌ను తగ్గించుకోవచ్చు అంటున్నారు నిపుణులు. బెండకాయను మూడు లేదా నాలుగు ముక్కలుగా చేసి ముందురోజు రాత్రి వాటిని గ్లాసు నీటిలో వేసి ఉంచుకోవాలి. మరుసటిరోజు ఉదయాన్నే పరగడుపున ముక్కలను తీసివేసి ఆ నీటిని తాగితే కొలెస్ట్రాల్ స్థాయిని తేలికగా తగ్గించుకోవచ్చని చెబుతున్నారు. ఇదే విషయం మీద వారు పరిశోధనలు కూడా నిర్వహించారు. పచ్చి బెండకాయలను తినడం వల్ల మరింత ప్రయోజనం పొందవచ్చని, అలా తినడానికి ఇష్టపడని వారు ఈ విధంగా చేస్తే మంచిదని వారు అంటున్నారు. బెండకాయల్లో లభించే పోషకాలు కంటి ఆరోగ్యాన్ని కూడా కాపాడతాయని వారు చెబుతున్నారు.

-అవినాష్

# హనీమూన్

**-రాచపూటి రమేష్**



**తెల్లటి పాలనురుగు లాంటి దేహం. అప్సరసలను తలదన్నే చంద్రబింబం లాంటి ముఖంపై నాట్యమాడే భాగ్యం తమదేనన్నట్లుగా నల్లటికురుల ముంగుర్లు ఆమె చెంపలపై నాట్యమాడుతూ ఉన్నాయి. శంఖంలాంటి మెడ, పేరు మోసిన శిల్పాచార్యుడు తన శిల్ప కౌశలాన్నంతా రంగరించి రూపొందించినట్లున్న శరీర సౌష్టవం. తెల్లటి చీరలో రతీదేవిని తలదన్నేలా సిగ్గుతో తలవంచుకుని నడిచొస్తున్న ప్రణవిని ఆత్రుతతో దగ్గరకు తీసుకుని ఆమె మెడపై గాఢంగా చుంబించాడు అనిల్. అతని చేష్టలకు తత్తరపడుతూ ప్రణవి అతని బాహువులో కరిగి పోసాగింది. అనిల్ ముఖంపై అనిర్వచనీయమైన ఆనందంతో కూడిన చిరునవ్వు వెలిసింది.**

పెద్ద కుదుపుతో రైలు ఆగడంతో ఊహా లోకాల్లో విహరిస్తున్న అనిల్ ఇహలోకానికి వచ్చాడు. అతడిని గమనిస్తూ ముసిముసిగా తమలో తాము నవ్వుకుంటున్న ఎదుటి సీటు వృద్ధ జంటలో బట్ట తలతో ఉన్న పెద్దాయన "ఏం బాబూ, పెళ్లి చూపులకు గానీ వెళ్తున్నావా?" అని చిరునవ్వుతో అడిగాడు. 'లేదండీ అత్తవారింటికి వెళ్తున్నాను' తత్తరపడుతూ జవాబిచ్చాడు అనిల్. పెద్దావిడ చీరచెంగు అడ్డం పెట్టుకొని ముసిముసిగా నవ్వింది.

అనిల్, ప్రణవిల పెళ్ళై పదిహేను రోజులే అయింది. పీడబ్ల్యూడీలో ఇంజనీరుగా పని చేస్తున్న అనిల్‌కు కష్టం మీద వారం రోజుల సెలవు హనీమూన్ వెళ్లడానికి దొరికింది. తాను పదిహేను రోజుల సెలవు అడిగినా, పని ఒత్తిడి కారణంగా వారం రోజులే లీవు మంజూరుచేసిన బాసాసురుడిపై అనిల్‌కు చెప్పలేనంత కోపంగా ఉంది. పెళ్ళైన నాలుగు రోజులకే ప్రణవిని పుట్టింటి వారు సారె పెట్టి మళ్లీ పంపుతామని తీసుకొని వెళ్లిపోయారు. హనీమూన్‌కు గోవా లేదా అండమాన్ వంటి దూర ప్రాంతాలకు వెళ్లి ఎంజాయ్ చేయాలన్న అనిల్ ప్రయత్నాలకు అతని బాస్ ఎక్కువ రోజులు సెలవు ఇవ్వకుండా ఒక అడ్డు పుల్ల వేస్తే, కొత్త దంపతులు ముందుగా తన ఇష్ట దైవం బెజవాడ కనకదుర్గమ్మను దర్శించుకొని రావాలని అనిల్ తల్లి పార్వతమ్మ హుకుం, మరో పుల్ల అడ్డువేసింది. తల్లిమాట కాదనలేని అనిల్ అత్తగారింటికి నెల్లూరు వెళ్లి, అక్కడ నుండి భార్యను తీసుకొని విజయవాడ వెళ్లి నాలుగురోజులు ఉండి రావాలని ప్లాన్ చేసు కున్నాడు. తాను ఉద్యోగం చేస్తున్న మదనపల్లె నుండి తిరుపతి చేరుకొని అక్కడ నుండి ట్రైనులో నెల్లూరుకు బయల్దేరాడు.

అనిల్‌ను రిసీవ్ చేసుకోవటానికి స్టేషనుకు అతని బావమరిది సందీప్ వచ్చాడు. ఇంటి ముందు ఆటో ఆగగానే ఇంటి బయటకు వచ్చిన అనిల్ మామగారు జనార్ధనరావు సాదరంగా అల్లుడిని ఇంట్లోకి ఆహ్వానించాడు. మరదలు వాణి ఫ్యాన్ వేస్తే, అత్తగారు సుశీలమ్మ మంచి నీళ్ళు తెచ్చిచ్చి కుశల ప్రశ్నలు వేసింది.

"ప్రణవి కనపడదేం?" అనిల్ అడిగేలోగా "బావగారికి అక్కను చూడడానికి అంత ఆత్రుత ఎందుకో" అని మరదలు సరసమాడింది. అనిల్ చిరునవ్వు నవ్వాడు. "బావగారి నవ్వే మల్లెపువ్వై విరిసింది..." సందీప్ పాట అందుకున్నాడు హుషారుగా.

ట్రైనులో ఎదుటి సీటు ముసలాయన "పెళ్లి చూపులకు వెళ్తున్నావా?" అని ప్రశ్నించడం గుర్తుకు వచ్చింది అనిల్‌కు. తాను ఈ హాల్లోనే గదా ప్రణవిని మొదటిసారి చూసింది" అనుకున్నాడు. ఆనాటి పెళ్లిచూపుల దృశ్యం అతని కళ్లముందు మెదిలింది.

తల్లిదండ్రులు అక్క, బావలతో బాటూ పెళ్లి చూపులకు వచ్చిన అనిల్ ప్రణవి మీద నుండి చూపు పక్కకు తిప్పుకోలేకపోయాడు. అనిల్ అక్కయ్య అతడి దృష్టిని మరల్చి, ప్రణవిని 'నీకు వంటవచ్చా, సంగీతం, డాన్సు వగైరా వచ్చా?' అని రకరకాల ప్రశ్నలు వేసింది. అనిల్ మాత్రం ప్రణయ దేవతలా తన ముందు కూర్చుని ఉన్న ప్రణవిని ఏమీ చిక్కుప్రశ్నలు వేయదలచుకోలేదు. కానీ ప్రణవి తండ్రి జనార్ధనరావు కాసేపయ్యాక 'మీరు ప్రణవిని ఏమైనా అడగాలంటే లోనికి తీసుకెళ్ళి అడగండి బాబూ' అనడంతో అనిల్ ప్రణవి ఏకాంతంగా మాట్లాడుకునే అవకాశం దొరికింది. అనిల్ ప్రణవిని ఆమె చదువు గురించి, హాబీల గురించి ఏవో రొటీన్ ప్రశ్నలు అడిగాడు తడబడుతూ. ప్రణవి మాత్రం అనిల్ ఉద్యోగం గురించి, రెండు మూడు ప్రశ్నలడిగి "మీ అక్కయ్య నన్ను అదివచ్చా, ఇదివచ్చా?' అని ఏమేమో అడిగారు. నేను మిమ్మల్ని అలాగే కొన్ని అడగవచ్చా?" అని సందేహంగా అడిగింది.

'దానికేముంది, నిక్షేపంగా అడగండి' అన్నాడు అనిల్ నవ్వుతూ.

"మీకు షటిల్ ఆడటం వచ్చా, నాకెంతో ఇష్టం ఆ గేమ్. అలాగే కరాటే, స్విమ్మింగ్‌లాంటి వేమన్నా వచ్చా" అని అడిగింది ప్రణవి.

"షటిల్ కాదు, స్కూల్ డేస్‌లో క్రికెట్ బాగా ఆడేవాడిని. కరాటే కాదు కాని తైక్వాండోలాంటి ఆత్మరక్షణ పద్ధతులు కొన్ని నేర్చుకున్నాను. ఇక స్విమ్మింగ్ నేర్చుకునే అవకాశం రాలేదు" చిరునవ్వుతో చెప్పాడు అనిల్.

ప్రణవి పెళ్లి తర్వాత తాను ఉద్యోగం చేయాలనుకుంటున్నానని, తల్లిదండ్రుల వద్దకు రావాలనుకున్నప్పుడల్లా వచ్చి పోతుంటానని, వారు తనను చూడకుండా ఉండలేరని అన్నది. ఆమె మీద ప్రేమతో అనిల్ ఆ కండీషన్లు అన్నింటికీ ఒప్పుకున్నాడు. అనిల్ తరపున గ్రీన్‌సిగ్నల్ లభించినా, ప్రణవి తల్లిదండ్రులు కొంతకాలం తర్జన భర్జన పడి చివరికి వారి పెళ్లికి ఒప్పుకున్నారు.

ఇంతలో సిగ్గులమొగ్గలాగ అక్కడకు వచ్చిన ప్రణవి అనిల్‌ను పలకరించింది. ఉపాహారం ముగించాక జనార్దనరావు "బాబూ, నువ్వూ, అమ్మాయి వెళ్లి దీపావళికి బట్టలు కొనుక్కురండి. నా క్రెడిట్ కార్డు వాడుకోండి. పాస్‌వర్డ్ అమ్మాయికి తెలుసు" అన్నాడు.

"పదిహేను రోజులు సెలవు అడిగితే మా బాసు రాక్షసుడు వారమే ఇచ్చాడు. జర్నీకి ఒక రోజు పోయింది. పోనీలే, నాలుగు రోజులైనా మనం విజయవాడలో ఏకాంతంగా గడపొచ్చు' అన్నాడు అనిల్ ఆటోలో వెళ్తుండగా.

"మనతో బాటూ మా మామయ్య పరమేశ్వరం కూడా విజయవాడ వస్తున్నారుగా" పరధ్యానంగా అంది ప్రణవి.

**ప్రణయ దేవతలా అతడి ముందు కూర్చుందామె. చూపు తిప్పుకోలేక గట్టిగా హత్తుకున్నాడామెను. ఆమెలో ఎన్నో పులకింతలు... అతడి కౌగిలిలో అలాగే ఉండిపోయింది. ఆమె ముఖాన్ని ముద్దులతో ముంచెత్తాడు**

"మావయ్యా? ఆయనెందుకు, పానకంలో పుడకలా" కంగారుగా అన్నాడు అనిల్.

"ఏమో, మా అమ్మనడగండి" ముసిముసిగా నవ్వుతూ అంది ప్రణవి. తిరిగొచ్చాక అనిల్ అదే విషయం ప్రణవి అమ్మగారి నడిగాడు.

"మా తమ్ముడికి కూడా అమ్మవారి దర్శనం, మొక్కు ఏదో ఉందట, పైగా వాడికి విజయవాడ బాగా తెలుసు. మీకిద్దరికీ ఆ ఊరు కొత్తేగా" అన్నది సుశీలమ్మ. అనిల్ ఏమీ మాట్లాడలేక పోయాడు.

"అమ్మాయికీరోజు పీరియడ్స్ ఆఖరిరోజు. నువ్వీరోజు ఈ గదిలో పడుకో" అనిల్‌కి బెడ్ రూమ్ చూపుతూ చెప్పాడతని మామగారు. ఉసూరుమని వేడి నిట్టూర్పులు విడుస్తూ అనిల్ ఆ గదిలో పడుకున్నాడు. కానీ ప్రణవి తలపులతో, విరహవేదనతో వేగిపోతున్న అతనికి చాలాసేపు నిద్ర పట్టలేదు.

•••

"ప్రణవిని ఈ చేతులతో ఎత్తుకుని పెంచాను. మేనకోడలైనా ఆమె నాకు కూతురితో సమానం. బైదిబై నన్ను పెళ్లిలో మీరు చూసినా మరచిపోయి ఉండవచ్చు. నా పేరు పరమేశ్వర్. పెదరాపూరులో టీచరుగా పని చేస్తున్నాను. ప్రస్తుతం దసరా హాలీడేస్ కాబట్టి ఖాళీగా ఉన్నాను" అనిల్‌తో కరచాలనం చేస్తూ చెప్పారు పరమేశ్వర్. పొట్టిగా, బట్టతల, టీషర్టు, జీన్సులలో ఉన్న ఆ యాభై ఏళ్ల శాల్తీ చేతిని నీరసంగా అందుకున్నాడు అనిల్. తామిద్దరితో ఈ పొట్టి బుడంకాయ్ ఎందుకో" అనుకున్నాడు మనసులో.

"మా మామయ్య జానపద గేయాలు బాగా పాడుతాడు, పాత సినిమా పాటలు కూడా" నవ్వుతూ చెప్పింది ప్రణవి.

"కవితలు కూడా రాస్తుంటాడు. ఒరేయ్ పరమేశం, అల్లుడు గారికి దారిలో నీ కవితలూ, పాటలూ కొన్ని వినిపించు" సంబరంగా చెప్పింది సుశీలమ్మ.

"నా మొఖానికి ఇప్పుడవొక్కటే తక్కువ" నీరసంగా మూలిగింది అనిల్ మనసు.

ఉదయం తొమ్మిదింటికి స్నానమూ, టిఫినూ ముగించి ముగ్గురూ టాక్సీలో విజయవాడకు బయల్దేరారు. దారి పొడుగునా పరమేశం జోక్స్ చెబుతూ, పాత సినిమా పాటలు, తన పొట్టి కవితలతో వారిని అలరించాడు. హైవేహోటల్లో భోంచేసి, మధ్యాహ్నం మూడింటికి విజయవాడ చేరుకున్నారు.

"గవర్నరుపేటలో మంచి హోటల్స్ ఉన్నాయి. అక్కడ రూములకు ప్రయత్నిద్దాం" అన్నాడు పరమేశం. కానీ పెళ్లిళ్ల సీజను, పండగ సీజనుతో బాటూ ఏదో జాతీయ పార్టీ మహాసభలు జరుగుతూ ఉండడంతో మంచిహోటళ్లలో ఎక్కడా రూము దొరకలేదు. కొన్ని చిన్న హోటల్స్‌లో గదులు ఉన్నా అక్కడి వాతావరణం ప్రణవికి నచ్చలేదు. 'అన్నపూర్ణా'లో ట్రై చేద్దాం" అన్నాడు పరమేశ్వర్.

"ఒకటే ఫ్యామిలీ రూం ఉంది. మీరు చూస్తే ముగ్గురున్నారు" అన్నారు అన్నపూర్ణ హోటల్ రిసెప్షన్‌లో.

"నిరాశతో తిరిగి వెళ్తున్న వారిని ఆపి, "గ్రౌండ్ ఫ్లోర్‌లో ఒక రూం ఉంది. అందులో మా అకౌంటెంట్ ఉంటారు. ఆయన సెలవు పెట్టి ఊరు వెళ్లాడు. వారం రోజులు రారు. మీకు అభ్యంతరం లేకపోతే మీలో ఒకరు అక్కడ ఉండవచ్చు" అన్నాడు రిసెప్షనిస్టు.

పరమేశ్వర్ బాయ్‌తో కలిసి, ఆ గదిని చూడడానికి వెళ్లాడు. గది పెద్దగా ఉంది. నీటుగానే ఉన్నా ఒక మూల మరో చిన్నగది, తాళం పెట్టి ఉంది.

"ఆ గది ఏమిటి?" బాయ్‌ని అడిగాడు పరమేశం.

"అది స్టోర్ రూం. హోటల్ పాత రికార్డులు అందులో ఉంటాయి" అన్నాడు రూంబాయ్.

"మరి బాత్రూం లేదే" అడిగాడు పరమేశ్వర్ సందేహంగా.

"ఈ ఫ్లోర్ చివర్లో సిబ్బందికి సంబంధించిన కామన్ బాత్‌రూం ఉంది. దాన్ని వాడుకోవచ్చు" అన్నాడు రూంబాయ్ పరాకుగా.

"ఇంకా ఎక్కడ తిరుగుతారు? మీరు ఫస్ట్ ఫ్లోర్‌లోని డబుల్ రూంలో ఉండండి. నేను ఆ అకౌంటెంట్ గదిలో అడ్జెస్ట్ అవుతాను" అన్నాడు పరమేశ్వర్ అనిల్‌తో.

అనిల్ రిసెప్షన్‌లో అడ్వాన్సు చెల్లించి రసీదు తీసుకున్నాడు, రూంబాయ్ వారి లగేజి గదిలో



పెట్టాడు.

అలసటగా పక్కపై వాలిన ప్రణవిని దగ్గరకు తీసుకొని గట్టిగా హత్తుకున్నాడు అనిల్. ప్రణవికీ ఏవో పులకరింతలు రేగి అనిల్‌ను అలాగే కౌగలించుకొని ఉండిపోయింది. అనిల్ ఆమె ముఖాన్ని ముద్దులతో ముంచెత్తుతూ ఉండగా అతని సెల్ మోగింది. అనిల్ ఫోన్ తీయకపోయేసరికి, ప్రణవి సెల్‌లో నంబరు చూసి 'మావయ్య చేస్తున్నాడు. ఫోన్ తీయండి' అన్నది గోముగా.

'పానకంలో పుడక' అని విసుగ్గా ఫోన్ తీశాడు అనిల్.

"త్వరగా తయారవ్వండి. ప్రకాశం బ్యారేజి, మ్యూజియం వీలైతే మొగల్రాజపురం గుహలు చూసొద్దాం. టాక్సీ మాట్లాడాను. పావు గంటలో హోటల్‌కు వస్తోందది" చెప్పాడు పరమేశ్వర్ హడావిడిగా.

"ఈ పెద్దాయనకు ఊరు చూడాలని అంత ఆత్రం ఎందుకో. ఇంకో గంటాగి వెళ్దామని చెప్పమంటావా?" కాల్ కట్‌చేసి ప్రణవిని అడిగాడు అనిల్.

"వద్దు. మావయ్య టాక్సీ మాట్లాడేశారుగా. త్వరగా తయారవుదాం" బెడ్‌పై నుండి లేస్తూ చెప్పింది ప్రణవి. అనిల్ కూడా ఉసూరుమని లేచి తయారవసాగాడు.

అనిల్ దంపతులు, పరమేశ్వర్ కలసి టూరిస్ట్ స్పాట్లన్నీ తిరిగి వచ్చేసరికి రాత్రి తొమ్మిదయింది.

"అలంకార్‌లో భోజనం బాగుంటుంది. అక్కడ భోం చేసొద్దాం" చెప్పాడు పరమేశ్వర్. 'అలాగే కానీండి' ఆయన చేసే ఆలస్యానికి తిట్టుకుంటూ చెప్పాడు అనిల్. భోజనంతో బాటూ స్వీటూ, ఫ్రూట్ సలాడ్ కూడా తిని మీటా కిళ్లీ దట్టించాడు పరమేశ్వర్.

భుక్తాయాసంతో హోటల్ చేరుకొని వెంటనే గ్రౌండ్ ఫ్లోర్‌లోని తన రూంలో దూరి తలుపేసుకున్నాడు పరమేశ్వర్. అనిల్ లుంగీలోకి, ప్రణవి నైటీలోకి మారారు. కాసేపు టీవీలో సీరియల్ చూశాక, ప్రణవిని దగ్గరకు తీసుకోబోయాడు అనిల్.

"వదలండి. తిరిగి తిరిగి అలిసిపోయి ఉన్నాను. నాకు బాగా నిద్దరొస్తోంది" అన్నది ప్రణవి. అనిల్ కాసేపు ఆమెకు జోక్స్ చెప్పి, వాళ్ల మావయ్యలా మిమిక్రీ చేసి ఆమెను ప్రసన్నం చేసుకున్నాడు. గాఢంగా హత్తుకొని ఆమె పెదాలపై చుంబించేసరికి ప్రణవి ఒంట్లో కరెంటు పాకినట్లై, అనిల్‌ను గట్టిగా వాటేసుకుంది. ఆమె ఎద పొంగులు అనిల్‌కు గిలిగింతలు పెడ్తున్నాయి. ఆమె ముఖమంతా ముద్దులతో ముంచెత్తాడు. ఇద్దరి నరనరాల్లో ఏదో ఉత్తేజం పొంగుతోంది. రసక్రీడకు సమాయత్తమౌతుండగా దబదబా డోర్ మీద ఎవరో కొట్టారు.

'రూంబాయ్ ఏ మంచినీళ్లో కావాలేమోనని అడగను వచ్చి ఉంటాడు. ఏం అక్కర్లేదని చెప్పేస్తాను" అని అనిల్ వెళ్లి డోర్ తీశాడు. ప్రణవి బట్టలు సర్దుకొని బెడ్‌పై కూర్చుంది.

పరమేశ్వర్ హడావిడిగా లోనికి వచ్చాడు.

"ఏమైంది మామయ్యా, ఎందుకంత కంగారు?" ఆదుర్దాగా అడిగింది ప్రణవి.

"భోజనంలో ఏదో తేడా చేసింది. కడుపంతా ఒకటే గడబిడ. కామన్ టాయిలెట్లో ఎవరో తలుపు వేసుకొని తీయడం లేదు. మీ గదికి రాక తప్ప లేదు సారీ" అని బాత్రూంలోకి దూరిపోయాడు పరమేశ్వర్. పది నిమిషాల తరువాత 'హమ్మయ్య' అని కడుపు నిమురుకుంటూ బయటకు వచ్చాడు.

"తలుపు జాగ్రత్తగా వేసుకోండి. గుడ్‌నైట్" అని కింది ఫ్లోర్‌కు వెళ్లిపోయాడు పరమేశ్వర్. ఆయన అవస్థ చూసి కాసేపు నవ్వుకున్నారు ఇద్దరూ. అనిల్ ప్రణవిని దగ్గరకు తీసుకోబోతుండగా మళ్లీ తలుపు చప్పుడైంది. ఇద్దరూ ఒకరి మొఖాలొకరు గాబరాగా చూసుకున్నారు.

"పాపం మళ్లీ మామయ్య" అని ప్రణవి వెళ్లి ఈసారి తలుపు తీసింది. పరమేశ్వర్ ఈసారి ఏమీ మాట్లాడకుండా నేరుగా బాత్రూంలోకి దూసుకెళ్లాడు. పావుగంట భారంగా గడిచాక, తిరిగి వచ్చాడు. "మావయ్యా, పోనీ ఇక్కడే పడుకో ఈ రోజుకు" అంది ప్రణవి. "వద్దులేమ్మా, కడుపు నొప్పి తగ్గినట్లుంది" అని భారంగా వెళ్లిపోయాడు పరమేశం.

పది నిమిషాల తరువాత అనిల్ ప్రణవిపై చేయి వేయబోతూ ఉంటే "ఉండండి, మావయ్య మళ్లీ వస్తాడేమో, నాకు బాగా నిద్ర వస్తోంది' అని దూరంగా జరిగింది ప్రణవి. మరో ఐదు



నిమిషాల్లో ఆమె గాఢంగా నిద్రపోతోంది. అనిల్‌కు మాత్రం నిద్ర పట్టలేదు ఆ రాత్రి.

●●●

మరుసటి రోజు పరమేశ్వర్ ఆ దంపతులను టాక్సీలో కనకదుర్గ గుడికి, హేయ్‌లాండ్‌కు, బోటులో అమరావతికీ తీసుకెళ్లాడు. తిరిగొచ్చేసరికి పొద్దుపోయింది. ముందు జాగ్రత్తగా పరమేశ్వర్ కడుపు నొప్పికి మెడికల్ షాప్‌లో టాబ్లెట్స్ తెచ్చుకొని వేసుకొని పడుకున్నాడు. హనీమూన్‌కని తమని పిలుచుకొని వచ్చి, టూరిస్టుల్లా తిప్పుతున్న పరమేశ్వర్‌పై పీకల వరకూ కోపంగా ఉంది అనిల్‌కు. కానీ పెద్దాయన్ని ఏమీ అనలేక కోపాన్ని మనసులోనే దిగమింగుకున్నాడు.

అనిల్ ముఖం కడుక్కొని గదిలోకి వచ్చేసరికి, ప్రణవి నైటీలోకి మారి అలసటగా పడుకొని ఉంది. ఎంతసేపటి నుంచో దాచుకొని ఉన్న విరహం అనిల్‌కు ఆమెను చూసేసరికి దావాగ్నిలా పొంగింది. ఆమెను గట్టిగా వాటేసుకొని పడుకున్నాడు. ఆమె ఎద ఎత్తులు మన్మథబాణాల్లా తాకి అతనికి గిలిగింతలు పెట్టసాగాయి. అలసిపోయి ఉన్నా ప్రణవికి అనిల్ చర్యలు ఒంట్లో నూతనోత్సాహాన్ని కలిగించాయి. తమకంతో భర్తకు పూర్తిగా సహకరించసాగింది. అనిల్ ప్రణవి పూల రేకుల్లాంటి బుగ్గలపై శంఖంలాంటి మెడపై ముద్దుల వర్షం కురిపించసాగాడు. ప్రణవి సిగ్గుల మొగ్గ అవుతుండగా, మళ్లీ డోర్‌పై దబదబా శబ్దమయ్యింది.




"పానకంలో పుడకలా మీ మామయ్యను పిలుచుకొచ్చాము చూడు, అందుకు ఒప్పుకున్నందుకు నా చెప్పుతో నేనే కొట్టుకోవాలి" అని అనిల్ కోపంగా పక్కకు జరిగాడు. ప్రణవి బట్టలు సర్దుకొని లేచి కూర్చుంది. తలుపు తియ్యకు. లోపల నుండే మీ మామయ్యను వెళ్లిపొమ్మని చెప్పు" అని అనిల్ ఏదో చెప్పబోయేంతలో, ఆమె వెళ్లి తలుపు తెరిచింది.

"పాడు ఎలుకలు, పాడు పందికొక్కులు" అని తిట్టుకుంటూ గదిలోకి ప్రవేశించాడు పరమేశ్వర్. అనిల్‌ను చూసి, "సారీ బాబూ, మిమ్మల్ని డిస్ట్రబ్ చేసినట్లున్నాను" అన్నాడు అపాలజెటిక్‌గా. అనిల్‌కు ఒళ్లు మండింది.

"ఫర్వాలేదంకుల్, మేమింకా నిద్రపోలేదు" అంది ప్రణవి.

"అదికాదమ్మా నా గదిలో ఇంకో చిన్నగది ఉందన్నానే, హోటల్ వాళ్లవి ఏవో పాత సామాన్లు అందులో ఉన్నాయట. ఎలుకలు, పందికొక్కులు అక్కడ చేరి వీరవిహారం చేస్తూ నానా రణగొణ ధ్వనులు చేస్తూ ఉంటే ఎంతకూ నిద్రపట్టలేదు. అప్పటికీ రూం బయటకు వచ్చి, మేనేజర్‌ను అడిగి చాప దిండు తీసుకొని బయట పడుకున్నాను. కానీ ఒకటే దోమలు. ఇక ఉండబట్టలేక మీ గదికి వచ్చాను" చంకలో ఉన్న చాప, దిండు చూపుతూ అన్నాడు పరమేశ్వర్.

"ఫర్లేదులే అంకుల్. ఈ రూంలోనే పడుకోండి. బాగా అలసిపోయి ఉన్నారు కదా" నవ్వుతూ అంది ప్రణవి. అనిల్ ఆమె వంక కొరకొర చూశాడు. ప్రణవి అనిల్‌ను చూసి ముసిముసి నవ్వులు నవ్వింది.

అనిల్ కూడా విధిలేక "పడుకోండి అంకుల్, పొద్దుపోయింది" అన్నాడు. వెంటనే పరమేశ్వర్ ఒక మూల చాప పరచుకొని ఐదు నిమిషాల్లోనే గుర్రుపెట్టి నిద్రపోసాగాడు. మళ్లీ ఆ రాత్రి కాళరాత్రే అయింది ఆ నవ దంపతులకు.

●●●

పరమేశ్వర్‌తో విసిగిపోయి ఉన్నాడేమో, మరుసటి రోజు ఉదయమే తిరిగి నెల్లూరుకు బయల్దేరి పోదామని అన్నాడు అనిల్. "మీ అమ్మగారు విజయవాడ వెళ్తే కోటిలింగాల ఆలయాన్ని తప్పక దర్శనం చేసుకొని రమ్మని ఫోన్లో చెప్పారు" చిన్నగా చెప్పింది ప్రణవి. వెంటనే అనిల్‌కు బయల్దేరేముందు తల్లి తనతో కూడా ఆ విషయం చెప్పిన విషయం గుర్తుకు వచ్చింది.

'కోటిలింగాల ఇక్కడకు దగ్గరే, గుడి చాలా బాగుంటుంది. త్వరగా రెడీకండి" అని పరమేశ్వర్ అక్కడే స్నానం ముగించి రెడీ అయ్యి, రిసెప్షన్‌లో కెళ్లి కూర్చున్నాడు. అనిల్, ప్రణవిలు త్వరత్వరగా తయారై కిందకు వెళ్లారు. టాక్సీలో ముగ్గురూ కోటిలింగాల తీర్థం చేరుకున్నారు.

"శివుడిని దర్శనం చేసుకునే ముందు నదిలో స్నానం చేసి వెళ్లాలని మా అమ్మ చెప్పింది. రండి, స్నానం చేసొద్దాం" తల్లి తనకు పదే పదే చెప్పిన మాటలు గుర్తొచ్చి చెప్పాడు అనిల్. ముందు జాగ్రత్తగా ప్రణవి ముగ్గురికీ విడి బట్టలు ఒక బేగ్‌లో సర్ది తెచ్చింది. పరమేశ్వర్, అనిల్ స్నానాలు ముగించి పొడి బట్టలు కట్టుకున్నారు. "నువ్వు స్నానం చేసిరా" ప్రణవితో చెప్పాడు అనిల్. ఆమె కాసేపు తటపటాయించి పక్కనే ఉన్న ఆడవాళ్ల స్నానఘట్టంలో స్నానం చేయడానికి రాతి మెట్లు దిగసాగింది. ఆఖరి మెట్లపై పాచి ఉండడం గమనించని ప్రణవి సర్రున జారి నీటిలో పడింది. ఆమె వేసిన కేకకు అటుతిరిగిన అనిల్‌కు నీటిలో కొట్టుకుపోతున్న ప్రణవి కనిపించింది. అతని గుండెలు గుభిల్లుమన్నాయి. 'తనకా ఈత రాదు. జన సంచారమూ పెద్దగా లేదు' టెన్షన్‌తో ఏం చేయాలో అర్థం కాక మనసు మొద్దు బారినట్లైంది.

హఠాత్తుగా పరమేశ్వర్ గబగబా మెట్లు దిగి నీళ్లలోకి దూకాడు. గజ ఈతగాడిలా ప్రణవి కొట్టుకుపోతున్న వైపు ఈదుకుంటూ వెళ్లాడు. అనిల్ ఆ దృశ్యాన్ని ఆశ్చర్యంగా చూశాడు. ఐదు నిమిషాల్లో ప్రణవి వద్దకు చేరుకున్న పరమేశ్వర్ శ్వాస పీల్చుకోవటానికి అప్పటికే ఇబ్బందిపడుతున్న ప్రణవిని జాగ్రత్తగా ఎత్తుకొని ఒడ్డుకు చేర్చాడు. ప్రథమ చికిత్స తరువాత తేరుకున్న ప్రణవి కాసేపు భయంతో వణికిపోయింది.

దైవదర్శనం చేసుకొని గుడి ప్రాంగణంలోని ఒక అరుగుపై కూర్చున్నారు ముగ్గురూ. "మరేం ఫర్వాలేదు. అంతా దైవఘటన. ఏం దిగులు పడకండి" అన్నాడు పరమేశ్వర్. అనిల్ గుండెలు ఇంకా వేగంగా కొట్టుకుంటున్నాయి.

మీ అమ్మగారు మనల్ని బెజవాడ వెళ్లమన్నప్పుడూ మా ఇంట్లో వాళ్లు కంగారు పడ్డారు. ఇక్కడ కృష్ణానది ఉంది కదా. పెళ్ళైన నెలలో నాకు జలగండం ఉందని మా సిద్ధాంతి వాళ్లకు చెప్పాడట. అందుకే యే తిరుపతికో పంపిస్తామని వాళ్లు చెప్పినా మీ అమ్మగారు ఒప్పుకోలేదు. కోటిలింగాల తీర్థం తప్పనిసరిగా చూసి రావాలని మీ పెద్దవాళ్లు చెప్పినప్పుడు మా అమ్మ మరీ కంగారు పడింది. కారణం ఇక్కడ దేవుడిని దర్శించుకునే ముందు తప్పనిసరిగా నదీ స్నానం చేయాలిగా. అందుకే రానన్నా, మా మామయ్యను బలవంతంగా మనతో బయల్దేరదీసింది. ఆయనకు గజఈతగాడుగా పేరుంది. ఎన్నో పోటీల్లో, స్విమ్మింగ్‌లో పతకాలు గెల్చుకున్నాడు" చిన్నగా చెప్పింది ప్రణవి.

అనిల్ మనసు ఝల్లుమంది. "ఈవేళ పరమేశ్వర్ గారు తమతో లేక పోయి ఉంటే? తలచుకోవడానికే అతనికి భయం వేసింది. తాను రెండు రోజులుగా ఎంతో తిట్టుకుంటున్న పెద్దాయనే తన భార్యను నీటిలో కొట్టుకొని పోకుండా కాపాడాడు' మనసులోనే పరమేశ్వర్‌కి కృతజ్ఞతలు చెప్పుకున్నాడు అనిల్.

గదికి వెళ్లగానే పరమేశ్వర్ ఎవరో మిత్రుడిని చూసి, భోంచేశాక తిరిగి వస్తానని వెళ్లిపోయాడు. అనిల్ మనసు మళ్లీ రసడోలికల్లో మునిగి తేలడానికి సమాయత్తమైంది.

*సెల్:98667 27042*

# వంటలు

## చింతచిగురు పులిహోర



**కావలసినవి:** బియ్యం - 2 కప్పులు, చింతచిగురు - కప్పు, శనగపప్పు - టేబుల్ స్పూన్, మినపప్పు - టేబుల్ స్పూన్, ధనియాలు - టేబుల్ స్పూన్, ఎండుమిర్చి - 4, నువ్వులు - టేబుల్ స్పూన్, నూనె - 2 టేబుల్ స్పూన్లు, ఉప్పు - తగినంత, కరివేపాకు - 2 రెమ్మలు

**తయారీ:** చింత చిగురును శుభ్రంగా కడిగి ఆరనివ్వాలి. వీలైతే కాస్త ఎండలో పెడితే మంచిది. తరువాత కాస్త నూనెలో వేయించి పక్కన పెట్టుకోవాలి. బాణలిలో నువ్వులు, మినపప్పు, ధనియాలు, శనగపప్పు వేసి వేయించాలి. చివరగా ఎండుమిర్చి కూడా వేసి వేయించి దించాలి. చల్లారిన తర్వాత వీటితోపాటు చింతచిగురు కూడా మిక్సీలో వేసి పొడి చేసి ఉంచాలి. అన్నం ఉడికించి ఉంచాలి. బాణలిలో నూనె పోసి కాగాక పోపు దినుసులన్నీ వేసి వేయించాలి. తరువాత చింతచిగురు పొడి, ఉప్పు, కరివేపాకు వేసి ఓ నిమిషం వేగాక ఉడికించిన అన్నం వేసి కలిపి దించాలి. అంతే, టేస్టీ టేస్టీ పులిహోర రెడీ!

## వంకాయతో చింతచిగురు

**కావలసినవి:** వంకాయలు - అరకేజీ, చింతచిగురు - ఒకటిం బావు కప్పు, సన్నగా తరిగిన ఉల్లిపాయ ముక్కలు - కప్పు, నూనె - పావు కప్పు, పసుపు - చెంచా, ఉప్పు - తగినంత, పచ్చిమిర్చి - ఐదు, ఎండుకొబ్బరిపొడి - రెండు టేబుల్ స్పూన్లు, ధనియాలపొడి - చెంచా, జీల కర్ర - చెంచా, శనగపప్పు - చెంచా, ఆవాలు - చెంచా, కూరకారం - అర చెంచా

**తయారీ:** ముందుగా వంకా యల్ని ముక్కల్లా తరిగి పెట్టుకోవాలి. ఇప్పుడు బాణలిలో నూనె వేడిచేసి జీలకర్ర, ఆవాలూ, శనగపప్పును వేయించు కోవాలి. అవి వేగాక ఉల్లిపాయ ముక్కలు వేసేయాలి. తర్వాత వంకాయ ముక్కలు, పసుపు వేసి మూత పెట్టేయాలి. కాసేపటికి వంకాయముక్కలు కొద్దిగా మగ్గుతాయి. అప్పుడు కడిగిన చింతచిగురు, పచ్చిమిర్చి వేసి బాగా కలపాలి. చింతచిగురు మగ్గి, వంకాయ ముక్కలు వేగాక తగినంత ఉప్పూ, కొబ్బరిపొడి, ధనియాలపొడి, కారం వేసి బాగా కలపాలి. కూర దగ్గర అయ్యాక దింపేస్తే చాలు.



## నువ్వులతో చింతచిగురు



**కావలసినవి:** చింతచిగురు - కప్పు, నువ్వులు - మూడు చెంచాలు, ఆవాలు- చెంచా, ధని యాలు - చెంచా, మెంతులు - పావు చెంచా, ఎండుమిర్చి - పది, పచ్చిమిర్చి - ఐదు, నూనె - ఒక టేబుల్‌స్పూను, కరివేపాకు - రెండు రెబ్బలు, మినపప్పు, శనగపప్పు - అరచెంచా చొప్పున, ఇంగువ - చిటికెడు, ఉప్పు - తగినంత

**తయారీ:** బాణలిలో నూనె వేడిచేసి ఇంగువా, నువ్వులూ, ఆవాలూ, ధనియాలూ, మెంతులూ, ఎండుమిర్చి, మినపప్పూ, శనగ పప్పూ వేసి వేయించుకోవాలి. అన్నీ వేగాక దింపేసి కరివేపాకూ, కడిగిన చింతచిగురు తాలింపులో వేయాలి. ఈ తాలింపు చల్లారాక మిక్సీజార్‌లోకి తీసుకుని పచ్చిమిర్చి, తగినంత ఉప్పు వేసుకుని మెత్తగా రుబ్బుకుంటే చాలు. నోరూరించే చింతచిగురు పచ్చడి సిద్ధం. కావాలనుకుంటే ఇందులో కొద్దిగా నిమ్మరసం కూడా పిండుకోవచ్చు.

## చింతచిగురు మటన్



**కావలసినవి:** మటన్ - అరకేజీ, అల్లం వెల్లుల్లి పేస్టు - రెండు టేబుల్ స్పూన్లు, పసుపు - చెంచా, ఉప్పు - తగినంత, చింతచిగురు - కప్పు, ఉల్లిపాయలు - రెండు, పచ్చిమిర్చి - 3, లవంగాలు- 3, దాల్చినచెక్క - చిన్న ముక్క, కారం - టేబుల్ స్పూన్, నూనె - పావుకప్పు, గరం మసాలా - టేబుల్‌స్పూన్, ఉప్పు - తగినంత

**తయారీ:** కుక్కర్‌లో మటన్ ముక్కలూ, అల్లంవెల్లుల్లి పేస్టూ, పసుపూ, కొద్దిగా ఉప్పు, చిన్న కప్పు నీళ్ళు పోసి మూత పెట్టేయాలి. నాలు గైదు విజిల్స్ వచ్చాక దింపేయాలి. ఇప్పుడు ఓ బాణలిలో నూనె వేడిచేసి అందులో దాల్చిన చెక్క, లవంగాలు వేసుకోవాలి. తరువాత ఉల్లి పాయ, పచ్చిమిర్చి ముక్కలూ వేసి వేయించాలి. ఉల్లి పాయ ముక్కలు వేగాక కడిగిన చింతచిగురు, తగినంత ఉప్పు వేసి మంట తగ్గించేయాలి. కాసేపటికి చింతచిగురు ఉడుకుతుంది. అప్పుడు ముందుగా ఉడికించి పెట్టుకున్న మటన్‌తో పాటు కారం, గరంమసాలా వేసి బాగా కల పాలి. ఇది గ్రేవీలా అయ్యేందుకు మరికాసిని నీళ్ళు పోసి కొన్ని నిమిషాలయ్యాక దింపేస్తే చాలు.

## చింతచిగురు పెరుగు పచ్చడి

**కావలసినవి:** పెరుగు - 200 గ్రా, కొబ్బరి తురుము - 100 గ్రా, ఉప్పు - తగినంత, పచ్చి శనగపప్పు - 10 గ్రా, మినపప్పు - 10 గ్రా, ఆవాలు - టీస్పూను, కరివేపాకు - రెండు రెమ్మలు, చింతచిగురు - 20 గ్రా, మిరప్పొడి - 10 గ్రా, ఎండుమిర్చి - 5గ్రా, నూనె - టీ స్పూన్



**తయారీ:** పెరుగులో ఉప్పు, కొబ్బరి తురుము కలపాలి. బాణలిలో నూనె వేడిచేసి ఆవాలు, ఎండుమిర్చి, పచ్చిశనగపప్పు, మిన పప్పు, కరివేపాకు వరుసగా వేసి వేగిన తరువాత చివరగా చింతచిగురు, మిరప్పొడి వేయాలి. చింతచిగురు మెత్తబడ్డాక దించేసి, పెరుగు మిశ్రమంలో కలపాలి.

అంతే, పెరుగు పచ్చడి రెడీ!



5

# కామరూప

-డాక్టర్ ధేనువకొండ శ్రీరామమూర్తి
సెల్: 98852 97983

**సియాన్సి జరిగిన దగ్గర నుండి వసుంధర అన్యమనస్కు రాలైంది. ఆధ్యాత్మిక సంస్కృతి ఏమిచెపుతున్నదో, ఉపాసనా మార్గం జీవితానికి ఏ విధంగా ఉపకరిస్తుందో ఆమెకు ఇప్పుడిప్పుడే అవగతమవుతున్నది.**

**ఆరోగ్యపరమైన విషయాలు దాక్షాయిణి, శ్రీమతి చూసుకుంటున్నారు. వారికి కావల్సిన సకల సౌకర్యాలు అందించడానికి సీత సిద్ధంగా ఉంది. వసుంధర మనస్సంతా ఒక్కసారి మరలా సియాన్సీ ప్రక్రియ చూడాలని ఉవ్విళ్లూరుతున్నది. సుబ్రమణ్యాన్ని పిలిచి వేలూరు అమ్మాళ్ దగ్గరకు వెళ్దామని అడిగింది.**

"ఎందుకోగాని, జీవితంలో నాకు ఎదురైన సంఘటనల వివరాలు తెలుసుకోవాలని ఉంది. వీలవుతుందా?" అడిగింది సుబ్రమణ్యాన్ని.

"స్పిరిట్ వరల్డ్‌లోని వారిని, ఈ సంఘటనకు సంబంధమైన వారిని ఆహ్వానిద్దాం. మనం వేలూరు అమ్మాళ్ దగ్గరకు వెళ్లివద్దాం. మూడు రోజులు పడుతుంది. ఇక్కడ పర్వాలేదనుకుంటే వెళ్దాం".

"ఇప్పుడేమీ ఇబ్బందులు లేవు, అంతా సవ్యంగానే ఉంది. మనస్సు దాని మీదనే లగ్నం అయింది. ఆరోజు నుంచి".

"నేను ప్రయాణ ప్రయత్నాలు చేస్తా, రవిని కూడా రమ్మంటా" అన్నాడు సుబ్రమణ్యం.

●●●

తిరుపతి వచ్చేప్పటికి రాత్రి అయింది. అక్కడే రూమ్ తీసుకొని ఉదయమే కాట్పాడి వెళ్లే ప్రయాణం ఏర్పాటు చేసుకున్నారు. ఎవరిలోనూ ప్రయాణ బడలిక లేదు.

తెల్లవారుజామునే తిరుపతి నుండి బయల్దేరారు. కాట్పాడి రైల్వేజంక్షను. స్టేషను ఎదురుగా పెద్దచెట్లు. వాటి మధ్యలో రెండు పూరిపాకలు. పాకల చుట్టూ అల్లుకున్న తీగలు. మధ్యమధ్య పూలతో శోభాయమానంగా ఉన్నాయి ఆ పాకలు.

వీరు చేరేటప్పటికే పాకల ముందు రెండు కార్లున్నాయి.

సుబ్రమణ్యం పాక ముందున్న స్త్రీ దగ్గరకు వెళ్లి, తాము వచ్చిన వివరాలు చెప్పి కాగితం మీద పేరు రాసి ఆమెకు అందించాడు. అది చూసి "తెలుగా?" అంది.

"ఆమ...." అన్నాడు సుబ్రమణ్యం.

"తమిళ్ తెరియుమా".

కాట్పాడి తమిళనాడులో ఉంది. సంభాషణ అంతా తమిళంలో ఉంటుంది. సుబ్రమణ్యం గతంలో కేరళ, తమిళనాడులో కొంతకాలం గడపటం వలన తమిళ, మలయాళ భాషలు వచ్చాయి.

లోపలికి వెళ్లిన వాళ్లు బయటకు వచ్చారు. ఒక మహిళ బయటకువచ్చి చూపుడువేలు బొటనవేలు మధ్యలో నిమ్మకాయ ఉంచుకొని, సూర్యునివైపు తిరిగి నిమ్మకాయను చూపుతూ ఏదో మంత్ర మననం చేస్తున్నది. కొంచెం సేపు అయ్యాక లోనికి వెళ్లింది.

ఆమె బయటకు వచ్చి సుబ్రమణ్యం బృందాన్ని లోనికి పిలిచింది. ముగ్గురు లోనికివెళ్లారు. ఒక మూల పెద్ద ప్రమిదలో అఖండ దీపం వెలుగుతోంది.

ఎత్తుపీఠం మీద దీర్ఘకాయంతో జడలు కట్టిన శిరోజాలతో అఘోర సంప్రదాయంలోని భైరవిగా ఆకర్షణీయంగా ఉంది త్రిజటామాయి.

కూర్చోమని చేతివేలితో సంజ్ఞ చేసింది. నేల ముగ్గులు అలంకరించినట్లు ఉంది.

నవ్యవీక్లి-లక్ష్మీనారాయణ జైని మెమోరియల్ ఛారిటబుల్ ట్రస్ట్ సంయుక్త నిర్వహణలో

# ద్వితీయ బహుమతి పొందిన నవల

గదిలో ఎట్లాంటి విగ్రహాలు, ఫోటోలు లేవు.

హిమాలయాల్లోని సిద్ధాశ్రమంలో చాలాకాలం ఉండి సాధనలో సిద్ధి సాధించింది త్రిజటామాయి. వేలూరు అమ్మాళ్‌గా ప్రసిద్ధమైంది.

ఒక వైపు మూలగా ధుని వెలుతురు. మధ్య మధ్యలో దానిమీద సాంబ్రాణి చల్లుతున్నారు. మంచి సుగంధ వీచికలు గది అంతటా ప్రసరిస్తున్నాయి.

పరిచారిక స్త్రీ నిమ్మకాయ రెండువేళ్ల మధ్య ఉంచి సూర్యునికి అభిముఖంగా నిల్చొని కొద్దిసేపు అయ్యాక లోనికి వచ్చి తలుపు వేసింది.



వాతావరణం గంభీరంగా ఉంది. గదినిండా చీకటి అలముకుంది. చేతిగంట ధ్వని గంభీరంగా మోగింది.

త్రిజటమాత బిగ్గరగా ఆవులించింది. తెరలు తెరలుగా ఆవులిస్తూనే ఉంది. కొంతసేపు అయ్యాక ఆవులింతలు ఆగిపోయినాయి.

ఒక ధోరణిలో మాట్లాడటం మొదలెట్టింది. పూర్తి యాసతో కూడిన ఆ ప్రాంత మాండలిక తమిళంలో చెప్పుకుపోతున్నది.

"వసూ, వసూ..." పిలుపుతో ఆశ్చర్యపోయింది వసుంధర.

## జరిగిన కథ

తల్లి కోరిక మేరకు అమెరికా నుండి తిరిగొచ్చి ఆసుపత్రి ప్రారంభిస్తాడు డాక్టర్ రామచంద్రుడు. ప్రియురాల్ని త్యాగం చేసి తల్లి చెప్పిన అమ్మాయినే పెళ్ళాడి అడ్జస్ట్ అయిపోతాడు. కాలేజీరోజులనాటి ప్రియురాలు దాక్షాయణి అతడికి అండగా నిలుస్తుంది. సీత, నీలిమలకు కృత్రిమ పద్ధతిలో పిల్లలు కలిగేలా విజయవంతంగా ఏర్పాట్లు చేస్తుంది దాక్షాయిణి .

ఆ తరువాత..

"రామచంద్రుని జన్మాంతర సంస్కారం వలన ఒక జ్ఞాన సంపన్నుడు పుట్టబోతున్నాడు. వంశ ప్రతిష్ఠ ఇనుమడిస్తుంది" అని చెప్పి గంభీర ముద్రలో ఉండిపోయింది మాయి. సంభాషణ తమిళంలోనే కొనసాగుతోంది. సుబ్రమణ్యం శ్రద్ధగా వింటూ అనువదిస్తున్నాడు.

"లలిత... నీ ఆడబిడ్డ... చిన్నపిల్ల అని చూడక మూర్ఖంగా వయసుకు మించిన పనులు చేయించావు.. ఆమె గత జన్మలో ఉపాసిని... సంస్కార భావాలతో మన ఇంట్లో జనించింది".

"అది అది..." తడబడ్డది వసుంధర.

"వంటచేస్తూ ఆ పిల్ల ఒళ్లు కాలి బూడిదయ్యింది".

"అమ్మా....!" అంటూ అరిచి కళ్లు తిరిగి పడిపోయింది వసుంధర.

"లలిత మన కుటుంబంలో గొప్ప ఉపాసిని. జన్మాంతర వాసనలతో గోప్యంగా ఉపాసన చేసుకునేది. నీ మూర్ఖం వలన గమనించలేదు.

ధ్యాన సమయంలో అగ్నికి ఆహుతైంది. ఆ నెపం సామాన్యులకు తెలియక నీ ఆరడి వలననే జరిగింది. ఆ సంఘటనకు నీవే కారణం అని ఆ నింద నీ మీద పడింది.

అది జరిగిన కొద్ది కాలానికే లక్ష్మీనరసింహం గారితో నాకు గల సన్నిహితత్వం, నేను ఆయన నుంచి కొన్ని తంత్ర ప్రక్రియలు నేర్చుకోవాలనే ప్రయత్నంతో, తరచుగా ఆయనను కలిసేవాణ్ణి. కాని కాల

మృత్యువుతో నా మరణం జరిగింది. వయస్సు తక్కువ అవటం వలన నా మరణం అకాల మృత్యువుగా అనుకున్నారు. ఏదో మంత్రం వికటించింది ఆ నెపం లక్ష్మీ నరసింహం గారి వలన జరిగింది అని ప్రచారం, దానితో నీకు ఆయనపై వ్యతిరేకత ఏర్పడింది.

మన కుటుంబంలో జరిగిన రెండు సంఘటనలు సంకల్పంతో జరిగినవే. కేవలం అపోహలు సృష్టించబడ్డాయి.

ఇప్పుడు జరిగే కాలంలో రవికి కుమార్తె లలిత అంశతో వస్తుంది. ఆమెకు ఇప్పటికీ జన్మ సంస్కార భావాలు ఉంటాయి. చిన్ననాటి నుండే జ్ఞాన మార్గంలో ఉంటుంది. ఇప్పుడు సూక్ష్మశరీరంతో ఉంది, అనతికాలంలో శరీర ధారణ జరుగుతుంది" చాలా వివరంగా చెప్పడం జరిగింది.

●●●

స్పృహ కోల్పోయిన వసుంధర ముఖంపై నీళ్లు చల్లి శీతలోపచారం చేశారు. కళ్లు తెరిచింది. మాయి మెల్లగా లేచి నిలబడింది. ఆమె జడలు కట్టిన శిరోజాలు నేలను తాకుతున్నాయి. వసుంధర దగ్గరకు వెళ్ళి ఆమె నుదుటిపై తన బొటన వ్రేలితో గట్టిగా ఒత్తింది. ఆ స్పర్శ వసుంధర శరీరంలో ప్రతి అణువణువును తాకినట్లయింది.

అందరూ నిశ్చేష్టులయ్యారు. పూర్తి నిశ్శబ్దం.

'వసూ, వసూ, ఇప్పుడు నీకు వచ్చిన సందేశం గమనించి ప్రవర్తించు. నేను గమనిస్తున్నా' ఇంకా ఏమో అర్థం కాని మాటలు వినిపించాయి. గొంతు శ్రావ్యంగానే ఉంది గాని అర్థం కాలేదు. వినిపించడం ఆగిపోయింది.

వేలూరు మాయి గోడకు ఆనుకొని పక్కకు ఒరిగి పడుకుంది. బయటకు వెళ్లమని అందరికీ సూచించారు అక్కడి సహాయకులు.

సుబ్రమణ్యం మంచి తిథి నిర్ణయించుకుని సుందరకాండ పారాయణం ప్రారంభించాడు. వినాయక, సరస్వతీ, వాల్మీకి ప్రార్థనలతో స్తుతిస్తూ పారా యణ ప్రారంభమైంది. లక్ష్మీనరసింహం గారి ఆదేశాను సారం సుందరకాండ పూర్తయ్యాక సర్పసూక్త పారా యణ కూడా చేసేవారు.

ధూపదీప నైవేద్యాలతో పారాయణ కార్యక్రమం జరిగేది.

ప్రతిరోజు నియమ నిష్టలతో కార్యక్రమం జరిగేది. ఏడు రోజులు పారాయణ కార్యక్రమం జరిగింది. చివరి రోజు తమల పాకులతో పూజ, నైవేద్యం, సంతర్పణ కార్యక్రమం జరిగింది.

●●●

దాక్షాయిణికి ఏ కొంచెం సమయం దొరికినా నీలాంబరి గదిలోకి వెళ్లి ముచ్చట్లు ప్రారంభించేది. నీలాంబరి వ్యక్తిగత జీవితంలోకి వెళ్లి ప్రశ్నించేది కాదు. ఆమె తనంతట తాను చెప్తే తప్ప, ముందుగా తను చొరవగా ఏమీ అడగదు.

తనను రామచంద్రుడు తాకిన సందర్భం గురించి చెప్పింది నీలాంబరి. నీలాంబరికి వీరి గత కాలపు ప్రేమ వృత్తాంతం తెలీదు.

"అది ప్రేమ అయి ఉండకపోవచ్చు. కేవలం ఎమోషనల్ ఎట్రాక్షన్ మాత్రమేనేమో, నిజంగా అతను ఆ విధంగా తాకాలనుకుంటారా?" సంభాషణ తేలిక పరిచేందుకు అంది దాక్షాయిణి.

"నిజం నమ్మండి... అతని కళ్ళలోనూ కనిపించింది" నిశ్చయంగా అంది నీలాంబరి.

"ఏ ఇద్దరి మధ్య ఏ కెమిస్ట్రీ వర్క్ చేస్తుందో ఎప్పుడూ ఊహించలేం" అనుకుంది దాక్షాయిణి.

"నీ పరిస్థితిలో అలా ఊహించవచ్చు. ఆయన ఆ విధంగా ఎఫైర్ పెట్టుకుంటాడని అనుకోను. ఒక వేళ ఆ విధంగా జరిగినా అది ఎమోషనల్ ఎఫైర్ అనుకుంటా" అంది దాక్షాయిణి.

"ఏమో మరి"

"రియల్ ఫీలింగ్స్ తెలియాలంటే కొంత టైం పడుతుంది. ప్రశాంతంగా స్థిమితంగా ఉండు" సలహా ఇచ్చింది దాక్షాయిణి.

దాదాపు 17 రకాల ఎఫైర్స్‌ని మ్యారేజ్ కౌన్సెలర్స్ పేర్కొంటారు. ఇది ఏ రకంలోకి వస్తుందో! ఒకటే కారణం కాకుండా అనేక భావాలు ఆయా సందర్భాలు కూడా. అప్పటి మానసిక శక్తి అంచనా ముఖ్యం. ఈ అమ్మాయి మానసికశక్తి ఏ స్థాయిలో ఉందో!! రామచంద్రుడిలో మార్పు వచ్చిందో? ఏమో?

స్నేహపూరిత ఓదార్పుతో నీలాంబరి భుజం తట్టింది దాక్షాయిణి.

●●●

నీలాంబరిని మొదట చూసినప్పుడు రామచంద్రుడి ఆలోచనలు ఆమె చుట్టూ పరిభ్రమించాయి.

ఈమెతో ఒక మంచి స్నేహం అయితే బాగుండు అనిపించింది. మరి సీతకు తనకు మధ్య అంతరం ఏర్పడింది. అది మానసికమో, శారీరకమో అసంతృప్తి ఏర్పడింది, అయిష్టమా? దాక్షాయిణిపై ప్రేమ




**భార్యతో మానసికంగా అంతరం ఏర్పడింది రామచంద్రుడికి. ఆమెకు దూరమైపోయాడు. ప్రేమించిన ప్రియురాలు దాక్షాయిణి దృఢచిత్తురాలై వైద్య సంస్థను సంస్కరించే పనిలో నిమగ్నమైంది. సరోగసీ మదర్‌గా అతడి బిడ్డకు ప్రాణం పోస్తున్న నీలాంబరిపై ఇప్పుడతని ఆలోచనలు పరిభ్రమిస్తున్నాయా! మరి మాజీ ప్రియురాలిపై అతడికున్న ప్రేమ ఏమైపోయింది? రామచంద్రుడి మానసిక పరిస్థితి ఏమిటి?**

ఏమయింది? ఇప్పుడు గౌరవం ఏర్పడిందా? నీలాంబరి కనపడేవరకూ ఇవి బయటపడలేదా?

తనలో మిస్సింగ్ థాట్ ఏమిటి? రామచంద్రుడిలో అనేక ఆలోచనలు మెదడును చుట్టుకొని చిక్కుముడిలా తయారయ్యాయి.

దాక్షాయిణి స్థిరచిత్తురాలైంది. ఒక డెస్టినీ ఏర్పరుచుకుంది. సంస్థ బాగోగులకు పూర్తిగా అంకితమైపోయింది. తన పరిస్థితే ఆశ్చర్యకరంగా, ఆందోళనకరంగా మారింది. దీనికి ఏదైనా రిలీఫ్ కావాలి అనుకున్నాడు రామచంద్రుడు.

ప్లేస్‌చేంజ్ అవసరమనిపించింది. పాండిచ్చేరి వెళ్లి అరవిందాశ్రమంలో కొద్దిరోజులు ఉందామని చాలా కాలంగా కోర్కె. తన సిద్ధాంతాల వలలో చిక్కుకొని కొట్టుకుంటున్న రోజుల నుంచి సైన్స్, తర్కం, హేతువాదం మొదలయినవన్నీ ఒక దాని తరువాత ఒకటి అతన్ని సంతృప్తి పరచలేక పోయాయి. సైంటిఫిక్ దృష్టి నుంచి ఆధ్యాత్మిక సంస్కృతి లోని విషయాలపట్ల ఆకర్షణ తెలుసుకోవాలనే కుతూహలం మొదలైంది రామచంద్రుడిలో.

అరవిందులు తన సిద్ధాంతంలో భౌతికవాదానికి కూడా సముచిత స్థానం కల్పించిన ఆధ్యాత్మిక వేత్త. ఆధ్యాత్మిక భౌతికవాదాలు ఒకదానికొకటి వ్యతిరేకం కాదనే నూతన దృష్టికి ఒరవడి పెట్టిన తత్వవేత్త. తర్కవితర్కాలు చెలరేగిన మనస్సులు ఘర్షణ విడిపోయి ప్రశాంతత ఏర్పడి నూతన దృక్పథానికి అంకురార్పణ కలిగింది. మనస్సు విశాలమయింది. ఇప్పుడు ఏ సిద్ధాంతాలు, మమకార వికారాలు లేవు, మధుర ప్రశాంతతే!!

ఆ స్థితిలోనే దాక్షాయిణి గదిలోకి వచ్చింది, అతన్ని చూస్తూనే 'ఏమిటి? ఏదోలోకంలో ఉన్నట్లున్నారు, ఏదో దీర్ఘాలోచనలో ఉన్నారు?" అన్నది.

చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు.

"ఏంటి రామ్ ఏమైంది".

"కొద్దిరోజులు అరవిందాశ్రమం వెళ్లివద్దామని నిర్ణయం. నా బాధ్యతలు అన్నీ నీకు డెలిగేట్ చేస్తున్నాను. భరించాలి మరి!" అన్నాడు రామచంద్రుడు.

"ఎప్పుడైనా నీ నిర్ణయం కాదన్నానా."

దగ్గరగా చేరి స్నేహహస్తం అందించాడు.

●●●

పుదుచ్చేరిలోని అరవిందాశ్రమం ఊరి మధ్యలోనే ఉంది. ఆశ్రమం చుట్టూ మరికొన్ని ఇండ్లు ఉన్నాయి. అరవిందుల ఆశ్రమం మన మనస్సులో హత్తుకుపోయిన పూర్వకాలపు మునుల ఆశ్రమంలా ఉండదు. అరవిందులు నివసించిన ఇల్లు ఊరి మధ్య ఉన్న పెద్దమేడ. అక్కడే వారి సమాధి.

ఆ ప్రాంతంలో అయస్కాంత కిరణ తరంగాలు ప్రభావితంగా ఉంటుంది. ఆకర్షణీయమైనది. ఆశ్రమంలో పెద్దగా ఉందో భోజనశాల, శుభ్రపరిచిన పళ్ళాలు ఒక చోట ఉంటాయి. ఎవరికివారు పళ్ళెం పట్టుకొని వెళ్ళాలి. టేబుల్స్ మీద ఆహారపదార్థాలు అమర్చబడి ఉంటాయి. ఎవరికి వారు పళ్ళెం పట్టుకొని నడుస్తూ ఉంటే ఆ టేబుల్ దగ్గరగా ఉన్న సహాయక స్త్రీలు, పురుషులూ ఒక్కొక్కరు ఆహార పదార్థాలను పళ్ళెంలో వడ్డిస్తుంటారు. కొంచెం దూరంలో కూర్చొని తినే టేబుల్స్ ఉంటాయి. భోజనశాల అంతా చాలా నిశ్శబ్దంగా ఉంటుంది.

భోజనాలు అయ్యాక తిన్న పళ్ళాల్ని నిర్దేశించిన తొట్టెల్లో ఏడు రకాల లోషన్స్‌తో శుభ్రపరచే కార్యక్రమం ఉంటుంది. అక్కడి పరిశుభ్రత చాలా ఆకర్షణీయంగా ఉంటుంది.

ఆశ్రమానికి కొద్దిదూరంలో 'ఆరోవిల్' ఉంది. 50 దేశాల నుండి వచ్చిన దాదాపు 3000 కుటుంబాలు ఆరోవిల్‌లో స్థిర నివాసం ఏర్పరుచుకున్నాయి. ప్రత్యేకమైన జీవనశైలితో వివిధదేశాల సంస్కృతులను తనలో ఇముడ్చుకున్న వినూత్న ప్రపంచం. 'ఆరోవిల్'. అరవిందుల దార్శనికతలో, మదర్ నిర్మాణ పర్యవేక్షణలో దాదాపు 20 కిలోమీటర్ల విస్తీర్ణంలోని ఆధునికత మేళవించిన టౌన్‌షిప్ విల్లుపురానికి దగ్గరలో ఉంటుంది. ప్రపంచ ప్రఖ్యాత ఆర్కిటెక్ రోగర్ యాంకర్ దీనికి రూపకర్త. 1968లో ఫిబ్రవరి 28వ తేదీన ఆవిష్కరణ జరిగింది.

మాతృమందిరం నగరానికి ఆత్మవంటిది. అందులోనే యోగాక్లాసులు ఉంటాయి. ప్రత్యేకమైన శైలిలో, మహోన్నత జీవనశైలిలో ఉంటుంది ఆరోవిల్.

విజిటర్స్ సెంటర్‌లో నమోదు చేసుకొని ఒక వారం ఉండే విధంగా రామచంద్రుడు ఏర్పాటు చేసుకున్నాడు.

అక్కడే చిరకాల మిత్రుడు రాజేశ్వరశర్మ కలిశాడు. ఒకే గదిలో ఉండేట్లు ఏర్పాట్లు చేసుకున్నారు. తరచుగా అరవిందాశ్రమానికి వస్తున్నట్లు చెప్పాడు రాజేశ్వరశర్మ.

కేంద్ర పరిశోధనా సంస్థలో సైంటిస్ట్‌గా చేస్తున్నాడు. మనస్సును అధిగమించిన అతీత మానసిక ప్రవృత్తి పొందడం అనే అరవిందుల ఫిలాసఫీ మీద రాజేశ్వరశర్మకు ఆసక్తి కలిగింది. 'దివ్యజీవనం' అనే గ్రంథం చదివి ఆకర్షితుడైనాడు. భౌతికవాదం, ఆధ్యాత్మికవాదం వ్యతిరేకం కాదు అనే భావం సైంటిస్టులో ఆసక్తి రేపింది.

వారి సంభాషణలో వృత్తిపరమైన, కుటుంబ సమస్యల మీద ఇద్దరూ అసలు ప్రస్తావనే చేసుకోలేదు. ఆధ్యాత్మిక విషయాల మీద మాట్లాడుకుంటున్నారు.

అతీత మానసిక ప్రవృత్తి ఆధ్యాత్మిక మార్పులో తుది మార్పు, మనస్సు అనేది మానసిక ప్రవృత్తి మారాక ఆనందాన్ని పొందుతుంది.

అరవిందులు రాసిన అనేక ఆధ్యాత్మిక గ్రంథాలు విలువైన ఆలోచనలను రేకెత్తిస్తాయి. వారి 'సావిత్రి' అపురూప గ్రంథం. వేదాంత పరమైన విశేషచర్చ పుష్కలంగా ఉంటుంది. కపాలిశాస్త్రి వంటి వారు సుదీర్ఘ భాష్యాలు రచించారు. కావ్యకంఠ గణపతిముని 1928వ సంవత్సరంలో ఆగస్టు నెలలో అరవిందులను కలిసి అక్కడే 15 రోజులు ఆశ్రమంలో గడిపారట.

తనకు తెలిసిన ఎన్నో విశేషాలు రాజేశ్వరశర్మ చెప్పుకుపోతున్నాడు రామచంద్రుడికి.

దర్శనానికి వెళ్దామని బయల్దేరారు ఇద్దరూ. రామచంద్రుడి మనస్సు అతినిర్మలంగా ఉంది. ఆశ్రమ సందర్శనం ఊహించుకుంటూ మనస్సు ఆనందంతో పొంగి పొర్లుతూ ఉంది.

అంతవరకు తను ఏ ఆశ్రమానికీ వెళ్ళలేదు, ఏ మహర్షినీ చూడలేదు. అరవిందుల ప్రభావం తన మీద ఏ విధంగా ఉంటుందో! ఊహ మాత్రంతోనే శరీరం జలదరించింది.

అరవిందులు తాను నివసించిన మేడమీద గదిలో నిలువెత్తు చిత్రపటం ఉంది. సజీవంగా ఉన్నట్లు భ్రమ కలుగుతోంది. మదర్ చిత్తరువు కూడా ప్రక్కనే ఉంది.

ఆ గది దగ్గరకు చేరటానికి నాలుగైదు మజిలీలు ఉంటాయి.

ఆ గదిలోకి ప్రవేశించే క్షణంలో తాను వశం తప్పుతున్నాననిపించింది రామచంద్రుడికి. అరవిందులు తలవంచుకుని కూర్చున్నట్లు చిత్తరువులో ఉంది. మానసిక భ్రాంతి కలిగిందో ఏమో, రవీంద్రులు తలపైకెత్తి రామచంద్రుని వంక సజీవంగా చూసినట్లు ఒక్క క్షణం ఆ భావం కలిగింది.

ఒక్కక్షణం రామచంద్రునికేమీ తోచలేదు. బయటికి వచ్చాక రాజేశ్వరశర్మ భుజంతట్టి "వారి ప్రభావం నీ మీద ఎంత ప్రగాఢంగా పడిందో, ఏమిటో? అది నిన్ను ఎంతవరకు ఉత్తేజితున్ని చేస్తుందో ఇప్పుడు చెప్పలేం రామచంద్రా! కాలమే నిర్ణయించాలి" అన్నాడు.

సైంటిస్ట్ రాజేశ్వరశర్మ అతిథి గృహానికి వచ్చాక మాట్లాడుతూ "ఆధ్యాత్మికవాదులు పరిణామవాదాన్ని కాదనరు. వారనేదల్లా శాస్త్రపరిశోధనల ద్వారా తేలని సృష్టి రహస్యాలు, ప్రకృతి రహస్యాలు ఆధ్యాత్మిక పరిశోధనల ద్వారా స్పష్టమవుతాయి".

"చనిపోయినవారి ఆత్మలు కనిపిస్తాయా?" రామచంద్రుడు ప్రశ్నించాడు.

"కొన్ని సందర్భాలలో ఆధ్యాత్మిక ప్రదర్శనలు జరిగేచోట ఆత్మలు ఎక్టోప్లాజం ధరించి ప్రత్యక్షమవుతాయి. ఒకొక్కప్పుడు మీడియంలకు కనిపిస్తాయి. వారు ఆ చనిపోయిన వారిని వర్ణిస్తుంటే వారిని ఎరిగిన వారు సులువుగా గుర్తించగలుగుతారు" వివరణ ఇచ్చాడు సైంటిస్ట్ శర్మ.

నాలుగవ రోజు రాజేశ్వరశర్మకు కృతజ్ఞతలు తెలియచేసి బయల్దేరాడు.

"హరిద్వార్, ఋషికేశ్ వెళ్లి వచ్చావా?" ప్రశ్నించాడు శర్మ.

"లేదండీ".

"ఇది మంచి సీజను. నేను వెళ్లే ప్లానులో ఉన్నాను. మీరు వస్తే కలిసి వెళ్దాం. తోడు ఉంటుంది".

"మీరు వెళ్లి వచ్చారా?" ప్రశ్నించాడు రామచంద్రుడు.

"పోయిన సంవత్సరం వెళ్లాను. డివైన్ లైఫ్ సొసైటీ శివానంద ఆశ్రమంలో కొద్ది రోజులు ఉన్నాను. అద్భుతమైన ప్రదేశం" అన్నాడు శర్మ.

"మీరు వెళ్లేటప్పుడు చెప్పండి, ప్రయత్నిస్తా" అన్నాడు రామచంద్రుడు.

పాండిచ్చేరి యాత్ర ఎంతో ప్రశాంతత కలిగించిందన్న తృప్తితో తిరుగు ప్రయాణమయ్యాడు రామచంద్రుడు.

●●●

ఒకేసారి తాము ఇటు కాట్పాడి, అటు రామ



## కోలీవుడ్‌లో తేలనున్న రెజీనా

తొలిసినిమాతోనే మెగా హీరోయిన్‌గా ముద్ర పడినా, అవకాశాలు మాత్రం ఆమడ దూరంలోనే ఉండిపోయాయి. తనతోటి హీరోయిన్లు సినిమాల మీద సినిమాలు చేసుకుంటూ పోతూ ఉంటే ఆ హీరోయిన్ మాత్రం ఇంట్లో గోళ్ళు గిల్లుకుంటూ కూర్చుంటోంది. చేతిలో ఒకే ఒక్క తెలుగు సినిమా ఉంది. అది కూడా పూర్తయితే తెలుగులో దుకాణం బంద్ అయినట్టే అంటున్నారు టాలీవుడ్ జనాలు. ఈపాటికే ఆ హీరోయిన్ ఎవరో తెలిసి పోయి ఉంటుంది. రెజీనా. ప్రారంభంలో కేవలం నటన మీదే దృష్టిపెట్టిన రెజీనాను గ్లామర్ హీరోయిన్‌గా గుర్తించలేకపోయారు టాలీవుడ్ దర్శకనిర్మాతలు. తను గ్లామర్ ఒలకబోయడానికి రెడీ అన్నా ఎవరూ ముందుకు రావడం లేదు. దానికి కారణం పెరిగిపోతున్న ఆమె వయస్సే అంటున్నారు. ఇక టాలీవుడ్‌తో లాభం లేదనుకుని కోలీవుడ్‌లో తన ప్రయత్నాలు ప్రారంభించింది రెజీనా. ఆమె ప్రయత్నాలు ఫలించి ఓ రెండు సినిమాల్లో అవకాశాలు వచ్చాయట! దాంతో యమ ఉత్సాహంగా టాలీవుడ్‌కి టాటా చెప్పేసి కోలీవుడ్‌కి చెక్కేయడానికి రెడీ అయిపోతోంది రెజీనా.

చంద్రుడు పాండిచ్చేరి వెళ్లడం వసుంధరకు ఆశ్చర్యం కలిగించింది.

ఉభయులు కలిశాక వారి అనుభవాల్ని సంతోషంగా పంచుకున్నారు.

రవి అమెరికా ప్రయాణానికి సిద్ధమవుతున్నాడని వసుంధర చెప్పింది. రమ్యను ఇక్కడే ఉంచమని అంది.

"శ్రీమతి గారి సలహా తీసుకుందాం. ఆమె వెళ్ల వచ్చంటేనే ప్రయాణం" అన్నాడు రామచంద్రుడు.

"కాంప్లికేషన్స్ లేవు గానీ ట్రాన్సిట్ లేకుండా ఉంటేనే మంచిది" అంది దాక్షాయిణి.

మరునాడు శ్రీమతి సలహా తీసుకున్నారు. కొద్దిగా మధ్యలో స్పాటింగ్ ఉంది. 5వ నెలలో స్కాన్ చేసే దాకా వద్దు అని శ్రీమతి సలహా ఇచ్చింది.

రవి మాత్రం వెళ్లడానికి సిద్ధమయ్యాడు. తను సంపూర్ణ ఆరోగ్యంగా ఉన్నాననే విశ్వాసాన్ని డిక్లేర్ చేశాడు.

రవి ఒక్కడే బయల్దేరాడు అమెరికాకు వయా దుబాయ్ మీదుగా ప్రయాణం.

తన హ్యూస్టన్ ఫ్లయిట్‌కి ఇంకా మూడు గంటల టైం ఉంది. న్యూయార్క్ జె.ఎఫ్.కె. ఎయిర్‌పోర్టు. లగేజీ చెకిన్ అవడంతో చేతిలో చిన్న హ్యాండ్‌బ్యాగ్ ల్యాప్‌టాప్ ఉన్నాయి. సుదీర్ఘ ప్రయాణంతో ఫ్లయిట్‌లో కూర్చొని కాళ్ల తిమ్మిర్లు ఎక్కాయి. లాంజ్‌లో కాస్త అటూఇటూ తిరిగి కూర్చొని టైం చూసుకొని రమ్యకు ఫోన్ చేశాడు. రింగ్ అయింది కానీ రిసీవ్ చేసుకోలేదు.

వెయిటింగ్ లాంజ్‌లో అందరూ ఎలక్ట్రానిక్ వస్తు వాడకంతో అక్కడి ప్రపంచం మునిగిపోయింది.

వేటికోసమో పరుగుపెడుతూ ఎక్కడో ఉన్న వారిని ఫోన్లలో పలుకరిస్తూ, మృదువుగా ఫోన్లలో మాట్లాడుకుంటూ అటూ ఇటూ నడుస్తున్నారు.

ఒకసారి మెయిల్ చెక్‌చేద్దామనుకుంటూ ల్యాప్‌టాప్ ఓపెన్ చేశాడు. చెక్ చేసుకుంటూ రిప్లై ఇచ్చుకుంటూ మునిగిపోయాడు.

"ఎక్స్‌క్యూజ్‌మీ" అని పక్క నుంచి వినబడింది.

అప్పుడు తల ఎత్తి చూశాడు. పక్కన ఇండియన్ నేషనల్ లేడీ, ఎప్పుడు వచ్చి కూర్చుందో గమనించనేలేదు. ఆమె వంక చూశాడు తన కాళ్ల దగ్గర ఏదో పడి పోయిందని చూపించింది. దానిని అందిస్తూ చిరునవ్వు నవ్వాడు రవి.

ఆమె తన కళ్ళల్లోకి సూటిగాచూస్తూ "థాంక్ యు" అంది.

ఆమె చూపులు, ఆమె చిరునవ్వు తనని చుట్టుముట్టిన ఫీలింగ్ కలిగింది రవికి.

ఆమెను చూశాక ఎక్కడో పరిచితమైన మొహంలా అనిపించింది. ఆమె రూపం అతన్ని కట్టిపడేసింది.

సభ్యతగా ఉండదు, తలపక్కకు తిప్పుకోవాలనిపించినా, ఆమెతో మాట్లాడాలని బలమైన ఆకాంక్ష.

"మీరు తెలుగువారా" తనే పలకరించాడు.

"లేదు నేను హైదరాబాద్‌లో పెరిగాను. కర్నాటక మాది, ఆయన తెలుగువారు".

"ఓ!"

కాసేపటి క్రితం పరిచయమైన ఆమెతో మాట్లాడటం అవసరమా? అంతఃస్వరం నిలదీస్తోంది. ఆమెకు పెళ్ళయింది. అంతర్లీనంగా ఏవో హెచ్చరికలు.

తన బ్యాగ్, ల్యాప్‌టాప్ అక్కడే పెట్టి రెస్ట్‌రూమ్ దాకా వెళ్ళి వస్తానని జాగ్రత్తలు చెప్పి వెళ్లాడు. అలా దూరం కావటం ఒక నెపం అని తనకు తెలుసు.

ఆమెతో అంత దగ్గరగా మాట్లాడాను ఏమిటి? అతనికి ఆశ్చర్యమేసింది. తప్పుచేస్తున్నానా? పరస్పర విరుద్ధ ఆలోచనలు మనసుని పైకి లేపకుండా లోపలకు అదిమి పెట్టాడు.

రవి తిరిగి వచ్చాక "ఇప్పుడు చెప్పండి, మీరేం చేస్తుంటారు?" ఆసక్తిగా అడిగింది.

"హ్యూస్టన్‌లో మల్టీనేషనల్ కంపెనీలో వర్క్ చేస్తున్నాను" అన్నాడు రవి.

"నా పేరు శోభ"

"ఓ, ఐ యామ్ రవి" అన్నాడు.

"మా వారు యం.యన్.సి.లోనే మార్కెటింగ్" అని తన గురించి చెప్పింది.

ఫ్లయిట్ ఎనౌన్స్‌మెంట్ రావడంతో ఇద్దరు బయల్దేరారు. పరస్పరం ఫోను నంబర్లు నోట్ చేసుకున్నారు.

ఒక్కక్షణం సామీప్యస్థితిలో ఉండాలి అని పించింది ఇద్దరికీ. అనిమేష అనుభూతి ఒక మైకం.

బైబై చెప్పుకుంటూ దూరమయ్యారు.

•••

"యాత్ర ఎలా జరిగింది? ఏమిటి విశేషాలు" దాక్షాయిణి ఉత్సాహంగా అడిగింది వసుంధరను.

"కొంచెం కష్టం, కొంచెం ఇష్టంగా జరిగింది".

"ముందు కష్టం చెప్పండి".

"గతకాలపు నీలినీడలు, తెలిసీ తెలియని రోజుల, మూర్ఖపు అనుభవాలు, మా ఆడబిడ్డ వంట చేస్తూ కాలి చనిపోవటం".

"అంత యాప్ట్‌గా చెప్పారా?" ఆశ్చర్యపడింది.

"నాకు నిజంగా భయమేసి, స్పృహ కోల్పోయాను దాక్షాయిణి. తరువాత తెప్పరిల్లాను" అంది వసుంధర.

"నిజంగా ఆశ్చర్యం, అట్లా చెప్పడం, ఏదీ తెలియని వారు మన సంగతులు చెప్పడం?"

"రామచంద్రుని నాన్నగారు, అదే స్వరం, అదే గొంతు, అయితే రామచంద్రుడికి మంచి సంతానం కలుగుతుందని కొడుకు జ్ఞాని అవుతాడని, ఆయన ఆశీర్వచనం, సంతోషం కలిగించే విషయం".

"మరి రమ్య విషయం"

"సంభాషణ అటు పోలేదమ్మా! మొదటి విషయానికే షాక్ అయ్యాను".

"అసలు నాకు నమ్మబుద్ధి కావటంలేదు. కాని మీరు ప్రత్యక్షంగా మీ అనుభవాల్ని చెప్తుంటిరీ!"

"నిజంగా చెపుతున్నాను. లక్ష్మీనరసింహంగారు నాకు అన్న వరుస. దూరపు బంధువు. కాని ఆయన ఉపాసనలు, ప్రశ్నలు, చిట్కాలు వాటిపై మా బంధువులలో ఒక అపప్రధ ఉంది. అది మా మనస్సులలో నాటుకుపోయింది. రవి ఊరు వెళ్లివచ్చాక అక్కడ ఆయన కృత్రిమ గర్భధారణ ద్వారానే సంతానం కలుగుతుందని చెప్పడం, సుబ్రమణ్యం సియాన్సీతో మారిపోయింది నా అభిప్రాయం" అంది వసుంధర.

"అంత నమ్మకంగా ఉందా ఇప్పుడు".

"మరి మన సంగతులు తెలీని వారు చెప్పడం, ఆత్మీయంగా ఆత్మల పలకరింపులు నమ్మకాన్ని దృఢం చేశాయి.

"మీ అవగాహన చాలా కరెక్ట్. నా ఉద్దేశం. ఆధ్యాత్మిక వాదులు జరిపిన పరిశోధనలను కొట్టి వేయవలసిన అవసరం లేదు" అంది దాక్షాయిణి.

"ఆప్తులను పోగొట్టుకొని దుఃఖించేవారికి ఆ ఆత్మలు వచ్చి, తమ ఆప్తులను తరచూ చూస్తూనే ఉన్నామని చెబితే అంతులేని ఆనందం కలుగుతుంది" అంది వసుంధర.

"అసలు చనిపోయిన వారి ఆత్మలతో మాట్లాడే ప్రయోగాలు నిరంతరం కొనసాగుతూనే ఉన్నాయి" అంది దాక్షాయిణి.

"మనకు జరగటం లేదే?"

ఇటువంటి శాస్త్రం ఒకటి ఉందని జనబాహుళ్యానికి తెలీదు. సర్ విలియం క్రూక్స్, సర్‌విలియం బారెట్, ప్రొఫెసర్ హెన్రీ బెర్గ్‌సన్ లాంటి శాస్త్రవేత్తలు తీవ్రంగా పరిశోధనలు చేశారు. మయర్స్ స్మారకార్థం 1940 కేంబ్రిడ్జ్ ట్రినిటీ కాలేజీలో స్కాలర్ షిప్ ఏర్పాటయింది.

హార్వర్డ్ విశ్వవిద్యాలయం వారు పరిశోధనల నిమిత్తం స్కాలర్‌షిప్స్ ఏర్పాటుచేశారు. వివరించింది దాక్షాయిణి.

"ఇంతగా పరిశోధనలు జరుగుతున్నాయన్న మాట. మనమేదో మూఢనమ్మకం అన్న ఒక్క మాటతో కొట్టి పారేస్తున్నాం" ఆశ్చర్యం వెలిబుచ్చింది వసుంధర.

**(ఇంకా వుంది)**



# బ్రెయిన్ పవర్ పెంచే సంగీతం

సంగీతం ద్వారా పిల్లల్లో బ్రెయిన్ పవర్ పెరుగుతుందని తాజా అధ్యయనాలు వెల్లడించాయి. పుట్టిన బిడ్డ బ్రెయిన్ నెల రోజులకే సంగీతానికి ప్రతిస్పందిస్తుందనీ, ఆ ధ్వని తరంగాల తేడాలను చాలా సులభంగా పిల్లల మెదడు గుర్తించగలదనీ బ్రెయిన్ యాక్టివిటీ స్కానింగ్ ద్వారా పరిశోధనల్లో బహిర్గతమైంది. రకరకాల ట్యూన్స్ వినిపించడం ద్వారా పిల్లల మెదడును చాలా షార్ప్‌గా తయారు చేయవచ్చు. మ్యూజిక్ వల్ల పిల్లల మెదడు శక్తిసామర్థ్యాలు పెరగడంతో పాటు ఉచ్చారణా పటిమ, ప్రసంగ సామర్థ్యం కూడా బాగా మెరుగుపడుతుందని అమెరికా పరిశోధకులు ప్రకటించారు. సంగీత శిక్షణా కేంద్రాలకు వెళ్ళిన తొమ్మిది నెలల వయసు పిల్లల మెదడులోని కీలకమైన అంతర్భాగాలు షార్ప్‌గా ప్రతిస్పందించాయని స్కానింగ్‌లో తేలింది. పిల్లలు భాష బాగా నేర్చుకోవడమే కాదు, పలు విదేశీ భాషల్ని కూడా సులభంగా నేర్చుకోగలుగుతారు. ప్రతీదీ గుర్తుపట్ట



డమే ముఖ్యమైన పనిగా ఉండే పిల్లల్లో తరువాత ఏం జరుగబోతోందనే గ్రహణశక్తి సంగీతం ద్వారా పెరుగుతుందంటున్నారు. ధ్వనులు, వెలుగులు, ఉద్వేగాలతో నిండిన సంక్లిష్ట ప్రపంచంలో పిల్లలకు సంగీతం టానిక్‌లా దీర్ఘకాలిక ప్రభావం చూపిస్తుందని ఈ అధ్యయన సూత్రధారి Patricia Khul చెప్పారు. మనదేశంలో బాల్యం నుండే పిల్లలకు శాస్త్రీయ లలిత సంగీతం నేర్పించినట్టుగానే బ్రిటన్‌లో మధ్యతరగతి తల్లిదండ్రులు 'మంకీ మ్యూజిక్' వైపు మొగ్గు చూపిస్తున్నారు. ఈ మంకీ మ్యూజిక్ అక్కడెంతో పాపులరైంది. వాషింగ్టన్ విశ్వవిద్యాలయానికి చెందిన డాక్టర్ ఖుల్ ఎంపిక చేసిన 39 మంది పిల్లల్ని రెండు గ్రూపులుగా చేసి వారానికి మూడు రోజులు వంతున మూడు వారాలపాటు మొదటి గ్రూప్‌నకు ఆటపాటలు, రెండో గ్రూప్‌కు కేవలం మ్యూజిక్ ప్లే సెషన్స్ నిర్వహించారు. ఆ తర్వాత స్కానింగ్ పరీక్షలు చేశారు. ఆటపాటల్లో ఉన్నవారు చాలా చురుగ్గా ఉన్నప్పటికీ రెండో గ్రూపు పిల్లల బ్రెయిన్ రీజియన్స్ సంగీతం పట్ల శక్తివంతంగా ప్రతిస్పందించినంతగా మొదటిగ్రూపు పిల్లల బ్రెయిన్ స్పందించలేదని సైన్స్ జర్నల్ నివేదిక వెల్లడించింది. వివిధ సంగీత వాయిద్యాలపై శిక్షణ పొందడానికీ, బ్రెయిన్ పవర్ అద్భుతంగా పెరగడానికీ మధ్య లింకు ఉందని పలు అధ్యయనాలు ఇప్పటికే వెల్లడించాయి. అందువల్ల నెల పిల్లలుగా ఉన్నప్పటి నుండే మ్యూజిక్ వినిపించడం వల్ల పిల్లల మేథో వికాసానికి పునాదులు పడతాయంటున్నారు.







**నిశ్చల**
ఉండవిల్లి.ఎమ్
**ధర:** 100 రూపాయలు
**పేజీలు:** 188
**ప్రతులకు:** ప్రముఖ పుస్తక కేంద్రాలు

ప్రేమ.. ఒక అందమైన అనుభూతి. 'ప్రేమ' జడివానలో ఎవరైనా సరే తడిసి ముద్దవ్వాల్సిందే! ఆ తొలివలపు ఆకర్షణలో, భవిష్యత్తు గమ్యం మరచి, అధోగతి పాలవుతున్న యువతుల ఆర్తనాదాలే ఈ నవలకు ఊపిరి. అనేక మలుపులతో విభిన్న మనస్తత్వాలతో కూడిన పాత్రలను పరిచయం చేస్తూ సాగిన నవల ఇది. టీనేజ్‌లో ఉన్న యువతులు నేటి సమాజంలో ఎలా వంచించబడుతున్నారో తెలియజేయడంలో రచయిత విజయం సాధించారనే చెప్పవచ్చు. సమస్యలతో ఆత్మహత్యకు పాల్పడే వారికి ఈ నవలలోని ప్రధాన పాత్ర స్ఫూర్తి దాయకం. పొంతన లేని పాత్రలతో కొంత అస్పష్టత ఉన్నా, కొన్ని పాత్రలు ఎందుకు వస్తాయో అర్థం కాకున్నా చివరివరకూ చదివేలా నవలను తీర్చిదిద్దారు ఉండవిల్లి.

**ఇద్దరూ ఇద్దరే**
దూరి వెంకటరావు
**ధర:** 80 రూపాయలు
**పేజీలు:** 120
**ప్రతులకు:** విశాలాంధ్ర బుక్‌హౌస్‌లు, శ్రీగణేష్ బుక్‌హౌస్, విజయవాడ
రచయిత మొబైల్: 9666991929

ఇద్దరు మధ్యతరగతి స్నేహితురాళ్ళ వైవాహిక జీవన సమరమే దూరి వెంకటరావు గారి నవల ఇద్దరూ ఇద్దరే. 2007లో ఒకానొక దినపత్రికలో సీరియల్‌గా ప్రచురితమైంది. ఇప్పుడు పుస్తక రూపంలో అందుబాటులోకి వచ్చింది. ఈ నవల. వివాహ జీవితంలో వాళ్ళు ఎదుర్కొన్న సమస్యలు, వాటినుంచి బయట పడిన




వైనం కళ్ళకు కట్టినట్టుగా ఆవిష్కరించారు రచయిత. సాధారణ మధ్యతరగతి జీవితాలలోని మనో విశ్లేషణలు, ఆలోచనల తీరు, వాళ్ళ చిన్న చిన్న కోరికలు కళ్ళకు కట్టాయి. నవలలోని పాత్రలు సమాజంలో మన చుట్టూ ఉండే పాత్రలను తలపిస్తాయి. ఈ విషయంలో రచయిత నవలను నడిపించిన శైలి ఆద్యంతం ఆసక్తికరం.

-లక్ష్మీ నర్మద.వి.

## స్వీకారాలు

**ఇన్‌కమ్‌టాక్స్ ఫండమెంటల్స్ అండ్ టిప్స్**
డా.కె.కిరణ్‌కుమార్
**ధర:** 100 రూపాయలు,
**పేజీలు:** 168
**ప్రతులకు:** శ్రీవైభవ పబ్లికేషన్స్, దివ్య సాయి అపార్ట్‌మెంట్స్, విద్యానగర్, హైదరాబాద్-44
సెల్ 9494700022

**మీ ఇన్‌కమ్‌టాక్స్ ఆదాకు 100 మార్గాలు**
డా.కె.కిరణ్‌కుమార్
**ధర:** 100 రూపాయలు
**పేజీలు:** 160
**ప్రతులకు:** శ్రీవైభవ పబ్లికేషన్స్, ఫ్లాట్ 102,దివ్య సాయి అపార్ట్‌మెంట్స్, విద్యానగర్, హైదరాబాద్-44
సెల్ 9494700022

**గ్రీకు పురాణ గాథలు**
ఆదిరాజు వీరభద్రరావు
**ధర:** 60 రూపాయలు,
**పేజీలు:** 78
**ప్రతులకు:** నవచేతన, విశాలాంధ్ర బుక్‌హౌస్‌లు

**అజరామరం**
ఎమ్వీరామిరెడ్డి
**ధర:** 80 రూపాయలు,
**పేజీలు:** 104
**ప్రతులకు:** ప్రముఖ పుస్తక దుకాణాలు

**సాత్విక భావాల సౌందర్య శిల్పి**
దాట్ల దేవదానం రాజు
రచన: సౌభాగ్య
**ధర:** 60 రూపాయలు,
**పేజీలు:** 70
**ప్రతులకు:** నవోదయ బుక్‌హౌస్, ప్రజాశక్తి

**విస్ఫోటనం**
గొట్టిపర్తి యాదగిరిరావు
**ధర:** 50 రూపాయలు,
**పేజీలు:** 56
**ప్రతులకు:** ఫోన్ 040-27678430





# అమ్మల మార్కెట్!

**ఆ మార్కెట్‌లోకి అడుగు పెడితే మహిళా సామ్రాజ్యంలోకి అడుగు పెట్టిన అనుభూతి కలుగుతుంది. సువిశాలమైన ఆ మార్కెట్‌లో ఎటు చూసినా మహిళా అమ్మకం దారుల మాటలే వినిపిస్తూంటాయి. కొనుగోలు దారులతోనూ అమ్మకం దారులతోనూ మార్కెట్ ఎప్పుడూ నిత్యకల్యాణం పచ్చతోరణంలా కళ కళలాడుతూ ఉంటుంది. మార్కెట్‌లో ఒక్క అమ్మకం దారులే కాదు దాదాపు కొనుగోలు దారులు కూడా మహిళలే కనిపించడం ఈ మార్కెట్ ప్రత్యేకత. సూర్యోదయం నుంచి సూర్యాస్తమయం దాకా స్త్రీల బేరసారాలతో ఆ మార్కెట్ సందడి సందడిగా ఉంటుంది. పురుషులకి అక్కడ ప్రవేశం లేదు. వింతగా ఉంది కదూ కేవలం మహిళలకోసం మహిళలే నిర్వహిస్తున్న ఈ మార్కెట్ పేరు 'ఇమా కేథిల్' (అంటే అమ్మల మార్కెట్) అని అర్థం. మహిళలు మాత్రమే నిర్వహిస్తున్న అరుదైన ఈ మార్కెట్ ప్రపంచంలోనే మొట్టమొదటిది. ఆ విశేషాలు...**

### అతి ప్రాచీనమైనది

మణిపూర్ రాజధాని ఇంఫాల్‌లో ఈ మార్కెట్ ఎప్పుడు ప్రారంభమైందో చెప్పడం కష్టమే అంటారు స్థానికులు. దాదాపు ఐదు వందల సంవత్సరాల చరిత్ర దీనికి ఉంది. దీనిని 16వ శతాబ్దంలో ప్రారంభించారని చెబుతారు. 16వ శతాబ్దంలో ఇక్కడి పురుషులందరూ రాజుగారి సేవలో రాజ్య సంరక్షణలో నిమగ్నమైపోతే కుటుంబ పోషణ కోసం, ఆదాయం కోసం మహిళలు బయటకి రావలసి వచ్చిందనీ, ఆదాయం కోసం ఈ మార్కెట్ ఏర్పాటు చేసుకుని వివిధ రకాల వస్తువుల అమ్మకాల ద్వారా కుటుంబాన్ని పోషించేవారనే కథనం ఒకటి ప్రాచుర్యంలో ఉంది. ఈ కథనం ఎంత వరకూ నిజం అన్నది మాత్రం ఎవరూ చెప్పలేరు. ఏమైనా అతి పురాతనమైన ఈ మార్కెట్ పర్యాటక స్థలంగా కూడా విరాజిల్లుతోంది. మణిపూర్‌కి వచ్చే విదేశీయులు ఈ మార్కెట్‌కు రాకుండా, ఇక్కడ వస్తువులు కొనుగోలు చేయకుండా మాత్రం వెళ్ళరు.

### పెళ్ళయిన స్త్రీలు మాత్రమే

ఇక్కడ ఉండేది మహిళలే అందులోనూ పెళ్ళయిన స్త్రీలు మాత్రమే ఇక్కడ వస్తువులను అమ్మేందుకు వీలుంది. మార్కెట్ స్త్రీలు తమకు తాముగా విధించుకున్న కట్టుబాటు ఇది. మార్కెట్‌లో స్థలాన్ని ఒకసారి సొంతం చేసుకుంటే అది తరతరాలుగా ఆ మహిళ కుటుంబానికే సొంతం అవుతుంది. ఆ స్థలాన్ని మరొకరు ఆక్రమించుకోవడం కానీ, సొంతం చేసుకోవడం కానీ నిషిద్ధం. ఈ మార్కెట్‌లో 89 సంవత్సరాల వయస్సుగల మహిళకు షాపు ఉంది. ఐదు తరాలుగా ఆమె వంశస్థులు ఇక్కడ అమ్మకాలు సాగిస్తున్నారట! వయస్సు పైబడినా మార్కెట్‌ను వదలడానికి ఇష్టపడడం లేదు ఆ మహిళ. ఆమె తరువాత ఆ షాపును నిర్వహించడానికి వీలుగా తన వారసులను రోజూ వెంట తెచ్చుకుని వ్యాపార మెళకువలు నేర్పుతోంది. తన తల్లి తనకు నేర్పించలేదనీ, ఇప్పుడు తను మాత్రం నేర్పుతున్నానని చెబుతోంది. ఇలాంటి మహిళలు ఇక్కడ ఎంతోమంది ఉన్నారు.

### అన్ని రకాల వస్తువులూ

కుటుంబానికి కావలసిన అన్ని వస్తువులూ ఈ మార్కెట్‌లో లభిస్తాయి. ఒక్కసారి ఈ మార్కెట్‌లోకి అడుగుపెడితే ఇంకో షాపుకి వెళ్ళే అవసరం ఉండదు అంటారు స్థానిక మహిళలు. కూరలు, పళ్ళు, నిత్యావసర వస్తువులతో పాటు వంటింటికి కావలసిన అన్ని వస్తువులూ ఒక భవనంలో లభిస్తాయి. మరో భవనంలో అన్ని రకాల దుస్తులు, స్వెట్టర్లు, దుప్పట్లు సహా లభిస్తాయి. సంప్రదాయ దుస్తులే కాకుండా మోడ్రన్ డ్రస్సులు కూడా ఇప్పుడిప్పుడే ఇక్కడ లభిస్తున్నాయి. మరో భవనంలోకి ప్రవేశిస్తే మాంసాహారం ఉంటుంది. చికెన్, మటన్, చేపలు అన్ని రకాలూ ఉంటాయి. మరో భవనంలో తినుబండారాలు, పిల్లలకు కావలసిన స్నాక్స్, ఆటవస్తువులు దొరుకుతాయి. దుస్తులు, కూరగాయలు, పళ్ళకి డిమాండ్ ఎక్కువగా ఉంటుంది.

### రాజకీయాలకు వేదిక

మార్కెట్ నిర్వహించే మహిళలకు రాజకీయాల మీద ఆసక్తి ఎక్కువే! మధ్యాహ్న సమయంలో భోజనం చేసేటప్పుడు, ఆ తరువాత రాష్ట్ర రాజకీయాల గురించి సుదీర్ఘ చర్చలు జరుగుతాయి. ఎన్నికల సమయంలో అయితే ఏ పార్టీకి ఓటు వేస్తే





తమకు ప్రయోజనం చేకూరుతుందో కూడా కొన్ని సార్లు భోజనాల సమయంలోనే నిర్ణయించేసు కుంటారు. ఎన్నికల సమయంలో రాజకీయనాయ కులు ఎక్కువగా ఈ మార్కెట్ మీద దృష్టి పెడు తుంటారట! ఇక్కడ మహిళల ఓట్లు దోచు కోవడానికి రాజకీయ పార్టీలు పడరాని పాట్లు పడుతుంటాయి. ఎవరెన్ని హామీలు ఇచ్చినా తమ సమస్యల మీద దృష్టి సారించేవారికే తాము ఓటు వేస్తామని వీరు చెబుతారు. సుమారు నాలుగువేల మంది ఇక్కడ అమ్మకాలు నిర్వ హిస్తున్నా, వీరిలో విభేదాలు తక్కువే! అందరూ కలిసిమెలిసి పనిచేసుకుంటూంటారు. చిన్నచిన్న విభేదాలు తలెత్తినా మార్కెట్ సొసైటీద్వారా పరిష్క రించుకుంటారే తప్ప పోలీస్ స్టేషన్ల చుట్టూ తిరగడం తక్కువ అని ఓ మహిళా అమ్మకందారు చెప్పిన మాటలు ఈ మార్కెట్ ఐకమత్యానికి మచ్చుతునకలు.

### ఆదాయం ఫర్వాలేదు

ఒక్కొక్క మహిళా సంవత్సరానికి లక్ష నుంచి రెండు లక్షల వరకూ సంపాదిస్తోంది. గతంలో మార్కెట్‌కి డిమాండ్ ఎక్కువగా ఉండేది. మారిన పరిస్థితులు, షాపింగ్ మాల్స్ కారణంగా మార్కెట్‌కి వచ్చేవారికి సంఖ్య స్వల్పంగా తగ్గింది అంటున్నారు. ఎక్కువగా సంప్రదాయ వస్తువులకే పెద్దపీట వేసే ఈ మార్కెట్‌లో ఇప్పుడిప్పుడే ఆధునిక పోకడలు కనిపిస్తు న్నాయి. వినియోగదారులను ఆకర్షించడానికి తాము కూడా కొద్దిగా మారినట్టు మార్కెట్ మహిళలు వివరిస్తున్నారు. చాలామంది మహి ళల కుటుంబాలు ఈ మార్కెట్ మీదే ఆధారపడి జీవిస్తున్నాయి. మగవారు తమకు కావలసిన వస్తువులు తీసుకొచ్చి ఇస్తారనీ, వారి ఆదాయం కన్నా తమ ఆదాయమే ఎక్కువ అని కొంతమంది మహిళలు చెబుతున్నారు. పిల్లల చదువులూ, పెళ్ళిళ్ళూ అన్నీ ఈ మార్కెట్ ద్వారా తమకు వచ్చే ఆదాయంతోనే పూర్తి చేస్తున్నామంటున్నారు ఇక్కడి వారు.

## లైసెన్సులు లేవు

మార్కెట్‌లో వ్యాపారం చేసుకునే దాదాపు 300 మంది మహిళలకు లైసెన్సులు లేవు. వీరిలో చాలా మంది ఎన్‌కౌంటర్‌లో చని పోయిన వారి భార్యలే కావడం విశేషం. వీరే కాకుండా మార్కెట్‌లోని మహిళల్లో దాదాపు 20 శాతం మంది కుటుంబ పెద్దను కోల్పో యిన వారే ఉన్నారు. తమకు లైసెన్సులు ఇప్పిం చా లని ఇప్పటికే చాలా మంది అధికారులకు మొరపెట్టుకున్నా లాభం లేకపోయిందని, ఈ విషయంలో రాజకీయ నాయకులు కూడా తమకు ఏ మాత్రం సహకరించడం లేదని ఈ మహిళలు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. లైసెన్స్ లేకపోతే మార్కెట్‌లో తాము వ్యాపార లావాదేవీలు సాగించలేమనీ, తమ కుటుం బాలు వీధిన పడే ప్రమాదం ఉందని వారు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. సాధ్యమైనంత త్వరగా తమకు లైసెన్సులు ఇప్పించాలని వీరు కోరుతున్నారు. అంతేకాకుండా ఈ మార్కెట్‌లో తొమ్మిది శాతం మైనార్టీ మహిళలకు కేటా యించాలని స్థానిక మహిళలు కోరుతున్నారు.



### చేతి వృత్తులకు ప్రాధాన్యం...

మణిపూర్ సంప్రదాయాన్ని తెలియజెప్పే వస్తువులు, చేతితో తయారు చేసిన వస్తువులు ఇక్కడ ఎక్కువగా లభించడం ఈ మార్కెట్ ప్రత్యేకత చేతితో అల్లిన స్వెట్టర్లు, ఇంట్లో తయారుచేసిన బొమ్మలు, పదార్థాలు ఇక్కడ ఎక్కువగా లభిస్తాయి. శుచీ, శుభ్రతతో పాటు నాణ్యతకీ పెద్ద పీట వేస్తామంటారు మార్కెట్ మహిళలు. సంప్రదాయ సిద్ధంగా పండించిన ఉత్పత్తులు ఇక్కడ ఎక్కువగా దొరుకుతాయి. ఇటీవల కాలంలో వీటికి ఆదరణ ఎక్కువ కావడంతో ఈ మార్కెట్‌లో లభించే ఉత్పత్తులకు మంచి గిరాకీ లభిస్తోందని మహిళలు చెబుతున్నారు.

### మార్కెట్ మార్పు

పురాతనమైన ఈ మార్కెట్‌ను మరొక విశాలమైన ప్రదేశంలోకి తరలించాలని అక్కడి ప్రభుత్వాలు ఎంతగానో ప్రయత్నించాయి. మార్పునకు మహిళలు ఒప్పుకోకపోవడంతో, ఉన్న ప్రదేశంలోనే కొత్త భవనాల నిర్మాణం చేపట్టారు. నిర్మాణంలో నాణ్యత లోపించడం వలన కొన్ని భవనాలకు కట్టిన ఆరునెలలకే బీటలు వారి ఎప్పుడు కూలిపోతాయో తెలియని పరిస్థితి ఉందని మార్కెట్‌లోని మహిళలు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. ఈ విషయాన్ని మార్కెట్ సొసైటీ ద్వారా రాష్ట్ర ముఖ్యమంత్రి దృష్టికి తీసుకువెళ్ళినా లాభం లేకపోయిందనీ, త్వరగా మార్కెట్ భవనాలకు మరమ్మతులు చేయించి కొన్ని కనీస అవసరాలు కల్పించాలని వారు కోరుతున్నారు. మార్కెట్ చుట్టూ బారికేడ్స్ ఏర్పాటు చేసి పోలీసులు ఇక్కడి మహిళలకు రక్షణ కల్పిస్తున్నారు.

-భారతి



# వెలుగు

ఇందూ రమణ

**"అలా బజార్లోకి వెళ్ళొస్తాను".**

**ఊతకర్ర పట్టుకొని మంచం మీద నుండి నెమ్మదిగా లేచాడు భగవతిరావు.**

**"వేగంగా వెళ్ళిరండి.. సరుకులన్నీ నిండుకున్నాయ్.. మీరు ఏదన్నా తెస్తేనే ఇంట్లో పొయ్యి వెలిగేది" వంట గదిలో ఓ మూల దిగులుగా కూర్చున్న భార్య అపర్ణ అంది.**

**"చూస్తాను.. చూస్తాను... దొరికితే తెస్తాను. ఎవరైనా మనవాళ్ళు దొరక్క పోరు" లోలోనే గొణుక్కున్నట్టు అంటూ రోడ్డు మీదకు నెమ్మదిగా కర్ర ఊతంతో చేరుకున్నాడు భగవతిరావు.**

అడుగులో అడుగు వేసుకుంటూ నడుస్తున్న వాడు ఎదురుగా వస్తున్నతన్ని చూసి టక్కున ఆగి పోయాడు. చేత్తో 'పొది' పట్టుకొని గబగబా నడుచు కుంటూ వస్తున్నాడు చిట్టాబత్తుల ఎర్రయ్య. తల దించుకుని భగవతిరావును దాటి నడుచు కుంటూ వెళ్ళిపోతున్నాడు.

"ఏరా! ఎర్రయ్యా! ఎలాఉన్నావ్?" తనని దాటి పోబోతున్న ఎర్రయ్య భుజం పట్టి బల వంతంగా ఆపినట్టే ఆపాడు భగవతిరావు.

"మీరా బాబయ్యా! దండా లండయ్యా! ఇదిగో... ఈ పక్కనే ఉన్న పంచాయతీ ఈవో గారికి గెడ్డం గీకాలట. కబురంపేరు. ఆలీసమ్మై పోనాది. వత్తానయ్యా!" అంటూనే ముందుకు పరుగందుకున్నాడు ఎర్రయ్య.

'ఒకప్పుడు తన ముందు నిల బడి చెప్పులేసుకోవడానికి కూడా గడ గడలాడేవాడు. ఈ రోజు తనని చూసీ చూడనట్లు ఎలా పారిపోతున్నాడు వెధవ. అధికారంలో ఉన్నప్పుడు కుక్కలా వెంటపడి తిరిగేవాడు. ఇప్పుడు అంత కానిపని తానేం చేశాడో? ఆలోచిస్తూనే అడుగులో అడుగు వేసుకుంటూ 'తొలిపావంచ' దగ్గరకు చేరు కున్నాడు.

దేవుడి గుడికి మెట్ల మార్గంలో వెళ్లాలనుకునే వారు 'తొలి పావంచ' దగ్గరున్న కాలభైరవస్వామి పాదాల దగ్గర కొబ్బరికాయకొట్టి అక్కడున్న హుండీలో ముడుపులు, మొక్కుబడులు వేసి 'గోవిందా గోవిందా' అని దేవుడ్ని స్మరించుకుంటూ మెట్లు ఎక్కు తున్నారు.

తొలిపావంచ పక్కనే ఎత్తైన రాతిచప్టా మీద ఎక్కి కూర్చున్నాడు భగవతిరావు.

ఒకప్పుడు తానిలా ఇక్కడ ఎంత హుందాగా హోదాగా కూర్చునేవాడు?

గతం గుర్తొచ్చేసరికి గుండె గుబులుగా, మనసు దిగులుగా అనిపించిందతనికి.

●●●

"అయ్యగోరండీ... అయ్యగోరండీ... నేనండి... ఎర్రయ్యనొచ్చాను" బైట గొంతుచించుకు పిలు స్తున్న ఎర్రయ్య పిలుపు చెవిన సోకి నిద్ర నుండి మేల్కొన్నాడు భగవతిరావు. రాత్రి తాగిన విదేశీ మద్యం మత్తు ఇంకా వదల్లేదు. తెలివి మీదున్నా మంచం మీద నుండి లేవడానికి మగత దిగక... బద్ధకం వదలక తిరిగి రగ్గు కప్పుకుని ముసుగు



తన్ని కళ్ళు మూసుకున్నాడు.

'రోజూ తెల్లారగట్లే అయ్యగారింటికి వచ్చి ఆయన్ని నిద్ర లేపి ఒళ్ళంతా నూనె రాసి నలుగుపెట్టి పట్టిపట్టి ఒళ్ళు రుద్ది స్నానం చేయించకపోతే ఇంకేమన్నా ఉందా?' మనసులోనే అనుకున్నాడు ఎర్రయ్య. గేటు బైట నిలబడ్డ ఎర్రయ్య లోపలనుండి ఎప్పుడు కబురొస్తుందోనని ఎదురుచూస్తూ నిలబడ్డాడు.

"ఒరేయ్ ఎర్రయ్యా! అలా ఇంటి వెనుక నుండి పెరట్లోకి వచ్చెయ్యరా! నీకు రోజూ చెప్పాలా?" లోపల నుండి వచ్చిన కేకకి ఉలిక్కిపడి కాలికున్న చెప్పులు గేటు బైట విప్పేసి పరుగందుకున్నాడు ఎర్రయ్య.

భగవతిరావు ఒళ్ళు ఒత్తుతూ "అయ్యా! మా ఇంటిదానికి ఒంట్లో బాగాలేదయ్యా. తమరో అయిదొందలు సర్దితే నెలకో వంద చొప్పున అమ్మగోరి చేతికిచ్చి అప్పు తీర్చుకుంటానయ్యా" వినయంగా అడిగాడు ఎర్రయ్య.

"ఎల్లెల్లరా ఎర్రయ్యా. నా దగ్గర డబ్బు చెట్లకి కాస్తోందనుకున్నావా? అయినా టీకి టికానాలేని వాడివి అయిదొందలు అప్పు ఎలా తీరుస్తావురా?" చిరాగ్గా అన్నాడు. మరిక ఏం మాట్లాడలేకపోయాడు ఎర్రయ్య.

రాష్ట్రంలోనే పేరెన్నికగన్న ప్రముఖ పుణ్య క్షేత్రానికి అధికారి భగవతిరావు. అతనిక్రిందో పాతికమంది ఉద్యోగులు పని చేస్తుంటారు. రోజు కూలీలు ఎంతమంది పని చేస్తున్నారో ఆయనకే తెలీదు. కమీషన్ల మీద పనిచేసే క్షుర కులు, కాంట్రాక్టు పద్ధతిపై పనిచేసే వాళ్ళు లెక్కకు మించే ఉన్నారు.

ఆ రోజు శనివారం.

యాత్ర మస్తుగా ఉంది. తూర్పు నుండి వచ్చిన భక్తులే ఎక్కువగా ఉన్నారు. క్యూలన్నీ కిక్కిరిసి ఉన్నాయి. ఇసుక వేస్తే రాలనంత మంది భక్తజనం బారులుతీరి ఉన్నారు. 'ఈ రోజు తనపంట పండిందనుకున్నాడు భగవతిరావు. రోజూ కంటే ఈ రోజు నాలుగు రూపాయలు ఎక్కువే రావాలి వస్తాయి' అనుకున్నాడు. రాత్రి యాత్ర సద్దుమణిగాక అన్ని సెంటర్లనీ చూడ్డానికి వెళ్ళాడు.

భగవతిరావును చూస్తూనే అక్కడ పని చేస్తున్న గుమాస్తా పరుగున ఆయన వెనకే తోకలా ఉన్న బంట్రోతు బంగారయ్య దగ్గరకు వెళ్ళి దొంగలా అటూ ఇటూ చూస్తూ నోట్లు చుట్ట జుట్టి టక్కున బంట్రోతు చేతికిచ్చాడు. గుమస్తా వెళ్ళాక క్షురకుల నాయకుడు ఎర్రయ్య వచ్చి బంగారయ్య చేతిలో అయిదు వందల నోటు పెట్టి వినయంగా చేతులు కట్టుకు నిలబడ్డాడు.

వాళ్ళు ఎంతిచ్చిందీ నెమ్మదిగా ఆయనకే వినపడేలా చెవి దగ్గర గుసగుసగా చెప్పాడు బంగారయ్య.

'ఈరోజు యాత్ర బాగా కుమ్మేసింది. అయినా, అయిదొందలే ఇచ్చాడు' అనుకుంటూ మనసులోనే యాత్రీకుల్ని, వాళ్ళల్లో తలనీలాలు అర్పించిన భక్తుల్ని అంచనా వేస్తుంటే, అయ్యగారి చూపుల్ని చేష్టల్ని పసి గట్టేశాడు ఎర్రయ్య.

"భక్తులు తెలివి మీరిపోయారయ్యా. గుండు గీశాక డబ్బులిమ్మని అడుగు

**అతడొకప్పుడు మకుటంలేని మహారాజు. చేయకూడనివన్నీ చేశాడు. రోజువారీ మామూళ్ళతో జల్సాలు చేశాడు. కన్నూమిన్నూ కానరాలేదు. సర్వం పోగొట్టుకున్నాడు. రిటైరయ్యాడు. కొడుకులు పరాయిదేశాలకెళ్ళి బతుకుతున్నారు. చింత చచ్చినా పులుపు చావలేదన్నట్టున్నాడతను. ఇప్పుడతని ఇంట్లో పొయ్యి వెలిగే పరిస్థితి లేదు. రోజూ వెతుకులాటే! ఆ పూటకి గ్రాసం తెమ్మని పంపింది భార్య. అతడేంచెయ్యగలిగాడు?**

తుంటే టిక్కెట్టు తీశాం కదా. మళ్ళా మీకెందుకు డబ్బులివ్వాలని అడుగుతున్నారయ్యా. మా వాళ్ళు మీతో అదే చెప్పమన్నారు" నమ్రతగా అన్నాడు ఎర్రయ్య.

"సరే లేవోయ్. మీకు రావల్సిన టికెట్ల మీద కమీషన్లు లెక్కకట్టి మరీ తీసుకుంటారు. అది చాలదన్నట్టూ భక్తుల దగ్గర ఎంతెంత లాగేస్తున్నారో నాకు తెలీదనుకోకు. పదవోయ్ చూద్దాం ఈళ్ళ సంగతి. పదా పోదాం" అంటూ విసురుగా ప్రసాదాల సెంటర్ కేసి నడిచాడు భగవతిరావు.

అక్కడ సిద్ధంగా ఉన్న గుమస్తా నేరుగా వచ్చి డబ్బుల్ని చిన్న కవర్లో ముడుపులా కట్టి భగవతిరావు చేతిలోనే పెట్టాడు.

"మీరోయ్. ఏం చేస్తారో... ఎలా సంపాదిస్తారో... మూడో కంటికి కూడా తెలీకుండా కథంతా చక్కగా నడిపించేస్తారు. భక్తులు ముడుపులు కట్టి హుండీలో ఎలా పడేస్తారో... మీరూ అంతే గుట్టుగా మూటకట్టి నా జేబులో వేస్తారు. తప్పు చేసినా ఒప్పు చేసినా కంటిరెప్పకి కూడా తెలీకుండా తతంగమంతా గమ్మత్తుగా నడిపిస్తారోయ్" అన్నాడు నవ్వుతూ.




"మాదేముందిసార్. మీ ఆశీస్సులుండబట్టే కదా సార్ ఇదంతా" అన్నాడా గుమస్తా.

అక్కడ నుండి వచ్చేస్తూ "అర్చకులు, కాంట్రాక్టరు సహా అందరూ ఇవ్వాల్సినవి ఇచ్చేశారోయ్?" అడిగాడు భగవతిరావు.

"ఇచ్చేశారయ్యా. అందరూ కవర్లల్లో పెట్టి ఇచ్చారయ్యా. ఇవిగో" అంటూ చొక్కాజేబులోంచి డబ్బు కవర్లు తీసి ఇవ్వబోయాడు బంగారయ్య.

"ఈ బ్యాగ్‌లో పెట్టు. నీ దగ్గర నా దగ్గర స్థిరంగా ఉండేవి కావివి ఎలా వస్తాయో అలాగే వెళ్ళిపోతాయి. రేపు ఉదయాన్నే టౌన్‌కెళ్ళి సింగపూర్ కస్టమ్స్ నోటిఫైడ్ షాప్‌లో పాత బకాయి కట్టేసి కొత్తగా ఏమైనా మార్కెట్లోకి సెంట్ బాటిల్స్, ఇంపోర్టెడ్ వైన్ ఏదన్నా వస్తే తీసుకురమ్మని మన ఈరేసుగాడికి చెప్పు. ఆడికి ఈ కవర్లో ఎంతుందో లెక్కెట్టి ఇయ్యి. నువ్వో వందుంచుకో బంగారి" అతనికేసి చూసి అన్నాడు భగవతిరావు.

"అయ్యా! ఎప్పుడూ ఈ డబ్బంతా నన్నే లెక్కపెట్టమంటారు. ఇదిలాగే ఆ ఈరేసుగాడికి ఇచ్చెయ్యమంటారు. ఇంటికి ఇసుమంతైనా పట్టుకెళ్ళరు. ఏందయ్యా ఇదంతా?" ఆరిపోతున్న దివిటీలో నూనె పోస్తూ అన్నాడు బంగారయ్య.

రాత్రి దేవాలయం మూసేశాక మెట్ల మార్గంలో మాట్లాడుకుంటూ నడుస్తూ దిగుతున్నారు. కాగడా వెలుగులో కొండ దిగడం రోజూ ఆ ఇద్దరికీ అలవాటే.

"ఓరి బంగారీ. ఎవరైనా ఎన్నాళ్ళుంటార్రా? ఉన్నంతకాలం ఆనందంగా అనుభవించాల్రా? వందనోటు చూసి మురిసి పోవడం కాదురా. దాంతో పొందే ఆనందం అనుభవించి మనల్ని మనం మైమరచిపోవాల. ఇంట్లో దాయడానికి ఇది డబ్బురా. డబ్బా కాదు. దర్జాగా బ్రతకడానికి కిక్కిచ్చే డబ్బురా" ఉల్లాసంగా అన్నాడు.

'అప్పనంగా సంపాదించినదంతా బూడిదలో పోసిన పన్నీరే అవుతోంది. ఇంటికెళ్ళేసరికి ఈయనకి ఖాళీ జేబులే మిగులుతాయి. భగవంతుడు కూడా అవసరమనుకున్న వాళ్ళకి ఆసరా ఇవ్వడు' మౌనంగా ఉండిపోయిన బంగారయ్య మనసులోనే అనుకున్నాడు.

కొండపై నుండి కిందకి దిగే మెట్ల మార్గం గాఢాంధకారంగా ఉంది. మిణుకు మిణుకుమని వెలుగుతున్న దివిటీ పట్టుకుని దారి చూపిస్తున్నాడు బంగారయ్య.

అలవాటైన మార్గం కావడంతో ఎలాంటి చీకు చింతా లేకుండా నెమ్మదిగా మాట్లాడుకుంటూ కిందికి దిగేశారు ఇద్దరూ.

భగవతిరావు సర్వీసంతా మూడు పువ్వులు ఆరుకాయలుగా సాగిపోతోంది. నాలుగు దిక్కుల నుండి అప్పనంగా వచ్చి పడిపోతున్న వాటాల సొమ్ముతో జల్సాలు చేయడం తప్ప ఒక్క పైసా కూడా వెనకేయడం తెలీదతడికి.

మహారాజులా గర్భాలయంలో ఉన్న దేవుడికిమల్లే సకల సౌఖ్యాలతో సరదాలు, సరస సల్లాపాలతో ఆడుతూ పాడుతూ కాలం హాయిగా గడిపేశాడు.

కొడుకులిద్దరికీ ఉద్యోగాలు రావడంతో పెళ్ళిళ్ళు చేసుకుని పెళ్లాలతో విదేశాలకు చెక్కేశారు. అప్పులు, ఆస్తులు మీరే అనుభవించండని చెప్పి మరీ విదేశాలకు పారిపోయారు. భగవతిరావు కించిత్ కూడా బాధ పడలేదు. పదవీ విరమణ చేశాక వచ్చే డబ్బుతో ఇంటి మీదున్న అప్పులు తీర్చేసి పెన్షన్‌తో భార్యాభర్తలిద్దరమే కదా దర్జాగా బ్రతికేయవచ్చనుకున్నాడు.

కానీ అతను అనుకున్నట్టు ఏదీ జరగలేదు.

ఇంకో రెండు రోజుల్లో భగవతిరావు పదవీ విరమణ చేయబోతున్న తరుణం వచ్చేసింది.

అదే సమయంలో దేవాదాయశాఖ కమీషనర్ ఆ దేవాలయానికి తనిఖీ నిమిత్తం వచ్చీ రావడంతోనే కొండమీద ఉన్న అన్ని సెంటర్లలోనూ ముమ్మరంగా తనిఖీలు ప్రారంభించాడు. ప్రసాదాల సెంటర్లో తనిఖీలు చేస్తుండగా, క్యాష్ కౌంటర్లో కట్టలు కట్టలు రీసేల్ టికెట్లు కమీషనర్ కంటబడ్డాయి. అవన్నీ భక్తులకు అమ్మిన ప్రసాదం టికెట్లు! ప్రసాదాలు సప్లై చేసే సిబ్బంది ఆ టిక్కెట్లు చించెయ్యకుండా తిరిగి క్యాష్ కౌంటర్లోకి జేరేస్తున్నారని కమీషనర్ ఇట్టే కనిపెట్టేశాడు.

ఒక దిట్టానికి రెండొందల లడ్డూలు దిగుబడి రావాలి. ఇక్కడ వీళ్ళు అదే దిట్టానికి లడ్డు సైజు తగ్గించి మూడొందల లడ్డూలు తయారుచేస్తున్నారని అందర్నీ ఆరాతీసి కనుక్కున్నాడాయన. అలాగే నూటయాభై గ్రాములు ఉండాల్సిన పులిహోర ప్యాకెట్టును వంద గ్రాములతోనే నింపుతున్నారని, మిగతా దానితో ఎగస్ట్రా ప్యాకెట్లు చేసి అమ్ముకుంటున్నారని తెలుసుకున్నాడు.

ప్రసాదాల టికెట్లు రీసేల్‌చేసి ఆ పాపాన్ని అందరూ పంచుకుంటున్నారని కమీషనర్ గ్రహించేశాడు. జరుగుతున్న మోసం అంతా ఆరా తీసి నిందితులందర్నీ పట్టుకున్నాడు. భక్తులకు చేరాల్సిన ప్రసాదాల్లో జరుగుతున్న ఈ గోల్‌మాల్ అంతటికీ దేవాలయం ముఖ్య అధికారే సూత్రధారి అనీ, కంచే చేను మేసిందన్నట్టు దీనంతటికీ ఆయనదే పూర్తి బాధ్యతని తేల్చి ప్రధాన ముద్దాయిగా భగవతిరావుపై కేసు బుక్ చేశాడు. వెంటనే అతన్ని సస్పెండ్ చేశాడు కమీషనర్. అన్ని పత్రికల్లోనూ, టీవీల్లోనూ అదే విషయం ప్రముఖంగా ప్రసారమైంది.

అంతేకాదు. ఈ తతంగమంతా ఎన్నో ఏళ్ళుగా సాగుతోందనీ, దీనిలో కోట్ల రూపాయల కుంభకోణం జరిగిందనీ లెక్కలు తేల్చి రిపోర్టు తయారు చేశాడు కమీషనర్. భగవతిరావుతో పాటే ఇందులో భాగస్వాములైన వాళ్ళందర్నీ అక్కడికక్కడే సస్పెండ్ చేశాడు.

ఈ గొడవ రాష్ట్రమంతా సంచలనమై కూర్చుంది.

రెండు రోజుల్లో రిటైర్ కావాల్సిన భగవతిరావు సస్పెండ్ కావటంతో కట్టుబట్టలతో రోడ్డు మీద నిలబడ్డాడు. రిటైర్ అయితే చేతికి అందుతాయనుకున్న లక్షల రూపాయలు రాకపోగా పెన్షన్ కూడా ఆగిపోయింది. ఈ కేసులు తేలే వరకూ ఎలాంటి ఫైనల్ సెటిల్‌మెంట్స్ జరగవని తేల్చి చెప్పేశారు పై అధికారులు.

భగవతిరావు సస్పెండ్ అయ్యాడని తెలియగానే అప్పుల వాళ్ళందరూ ఇంటిమీదకొచ్చిపడ్డారు. వాళ్ళ బాధ భరించలేక ఇంటిని అమ్మేసి అప్పులన్నీ తీర్చేసి అద్దె ఇంట్లో తలదాచుకున్నాడు భగవతి

రావు. ఇంత జరిగినా కొడుకులిద్దరూ తల్లి దండ్రులకేసి కనీసం కన్నెత్తి చూడలేదు.

భగవతిరావు కూడా కొడుకులున్నారనే ఆశ వదిలేసుకున్నాడు.

"సార్! కూర్చునే కునుకుతున్నారు. అసలే ఎత్తు చప్టా. కింద పడితే తల పగులుద్ది. జాగ్రత్త" ఎవరో భక్తుడు వచ్చి భుజం తట్టి చెప్పేసరికి ఉలిక్కిపడి ఇహానికొచ్చాడు.

ఆ భక్తుడికేసి కృతజ్ఞతగా చూసి సర్దుకుని కూర్చున్నాడు భగవతిరావు.

అతను నవ్వుతూ భగవతిరావు కేసి చూసి భార్యాపిల్లలతో కలిసి తొలిపావంచ దగ్గరకు చేరుకున్నాడు. కాలభైరవ స్వామి దగ్గర కొబ్బరికాయ కొట్టి ఫ్యాంటు వెనుక జేబులో నుండి పర్సు తీశాడు. అక్కడున్న హుండీలో ఐదువందల రూపాయల నోటుతీసి వేశాడు. తిరిగి పర్సు జేబులో పెట్టుకోబోతూ జార విడిచాడు. అది కింద పడిపోయింది. ఆ విషయం అతను గమనించకుండా భార్యాపిల్లల్ని తీసుకుని 'గోవిందా.... గోవిందా' అని అరుచుకుంటూ ముందుకు సాగిపోయాడు.

రాతి చప్టామీద కూర్చున్న భగవతిరావు అంతా గమనిస్తూనే ఉన్నాడు. కానీ, వెళ్లిపోతున్న ఆయన్ని కేకేసి చెప్పడానికి భగవతిరావుకి మనసొప్పలేదు. మనసులో దురాశ పుట్టింది.

నెమ్మదిగా లేచి తొలి పావంచ దగ్గరకు వెళ్లాడు. భక్తులంతా ఎవరి గోల్లో వాళ్ళున్నారు. అడుగులో అడుగు వేసుకుని వెళ్తూ పర్సు మీద ఓ కన్నేసే ఉంచాడు. నెమ్మదిగా తొలిపావంచ దగ్గరకు చేరుకుంటూనే పర్సుమీద కాలేసి నెమ్మదిగా వంగి పర్సు చేత్తో తీసి, అక్కడ నుండి గబగబా ఇంటిదారి పట్టాడు. పర్సు పోగొట్టుకున్న వ్యక్తి తిరిగి వెనక్కి వచ్చినా వచ్చేస్తాడేమోనన్న ఆందోళనతో అడుగులు తడబడుతున్నా లేని ఓపిక పుంజుకుంటూ వడివడిగా నడుస్తున్నాడు. మధ్యలో ఎక్కడ ఆగినా చేతికందిన పర్సు పోయే ప్రమాదం ఉందని ఇంటికేసే అడుగులేస్తున్నాడు భగవతిరావు. ఇల్లు చేరగానే హాయిగా గుండెల్నిండా గాలి పీల్చుకున్నాడు.

"వచ్చేశారా! రండి. రండి. వంట అయిపోయింది. ఉదయం నుండి ఏమి తినలేదు కదా రండి వడ్డించేస్తాను" వంట గదిలో నుండి భార్య అపర్ణ నవ్వుతూ ఎదురొచ్చి అంది.

భార్య మాటవిని ఆశ్చర్యంతో ఒక్కక్షణం నివ్వెరపోయాడు.

"మీరు ఇమ్మన్నారని మన ఎర్రయ్య కిరాణా దుకాణం నుండి సరుకులన్నీ తెచ్చి ఇచ్చి మరీ వెళ్లాడండి. అయ్యగారికి కాళ్ళొత్తి చాన్నాళ్ళయిందమ్మగోరూ అనిచెప్పి బాధ పడ్డాడండి. ఓరోజు తీరుబడిగా వచ్చి మీకు ఒళ్ళంతా నూనె రాసి నలుగు కూడా పెడతానన్నాడండీ" ముసిముసిగా నవ్వుతూ అమితానందంతో చెప్పింది అపర్ణ.

భగవతిరావుకి నోట మాట రాలేదు. మొద్దుబారిపోయింది.

'తానెలాంటి తప్పుచేశాడో తనకిప్పుడు అర్థమైంది. అధికారంలో ఉన్నంత కాలమూ కన్నూమిన్నూ కానకుండా, ఉచ్చ నీచం తెలీకుండా స్వార్థంతో ప్రవర్తించాడు. దానికి తగ్గ ఫలితం అనుభవిస్తున్నాడు. అయినా ఇంకా తనలో స్వార్థం చావలేదు. తనలో ఉన్న దుర్మార్గుడు చావలేదు. తనిప్పుడు అధికారంలో లేకపోయినా అభిమానంతో ఆరాధనతో తనకి సేవచేయడానికి వస్తానన్న ఎర్రయ్యని తలచుకునే సరికి' సిగ్గనిపించింది భగవతిరావుకి.

'చాలు తను అనుభవిస్తున్న నరకంలాంటి ఈ శిక్ష చాలు. కుక్కతోక వంకరలా తన బుద్ధి ఇప్పటికీ మారకపోతే తను మనిషే కాదు. తానిన్నాళ్ళూ చేసిన పాపఫలం అనుభవిస్తూనే ఉన్నాడు. తనని కట్టుకున్న పాపానికి భార్యని కూడా హింసిస్తున్నాడు. భగవంతుడా! నన్ను క్షమించకు' మనసులోనే బాధపడుతూ తొలి పావంచ దగ్గరకు కాళ్ళీడ్చుకుంటూ బయలుదేరాడు.

"ఎక్కడికండి మళ్ళీ వెళ్ళిపోతున్నారు. రండి కాస్త భోజనం చేయండి" ఇంట్లోకి వస్తూనే మళ్ళా గాబరాగా వెళ్ళిపోతున్న భర్తని పిలిచిందామె.

"వస్తా... ఇప్పుడే వచ్చేస్తా!" అంటూనే 'ఆ భక్తుడి పర్సు అతనికి అందచేయాలి' అనుకుంటూనే దర్జాగా, ఠీవీగా తల ఎత్తుకుని ఇంట్లో నుండి బైటకి అడుగేశాడు భగవతిరావు.

సెల్: 99511 71696

## మనమీదేనర్రోయ్!

సరసి







# ఆరోగ్య సంరక్షణకు కొబ్బరినీళ్ళు, చెరకురసం

**ఎండలు మండిపోతున్నాయి. ఇలాంటి ఎండల్లో బయట తిరిగే వాళ్లను సేదదీర్చి శక్తిమంతుల్ని చేసేవి సహజ పానీయాలే. ఏ చెట్టుకిందో కూర్చుని ఎండకు ఒక్క కొబ్బరి బొండమో, చెరుకురసమో తాగారే అనుకోండి శరీరానికి ఎంత సాంత్వన చేకూరుతుందో మాటల్లో చెప్పలేం. ఎండాకాలంలో కృత్రిమ శీతలపానీయాలకన్నా ఈ పానీయాలే చాలా బెటర్ కూడానూ! మరి కేవలం సాంత్వన చేకూర్చడమే కాదు కొబ్బరిబొండం, చెరుకురసం తాగితే దాంట్లో అనేక ఆరోగ్య రక్షణ అంశాలు కూడా దాగి ఉన్నాయి అంటున్నారు వైద్యులు. మరి ఆ రహస్యాలేంటో తెలుసుకుందామా!**

కొబ్బరిబొండం, చెరుకురసం ఇవన్నీ సాధారణ మానవునికి అందుబాటులో ఉండే పానీయాలే! చెరుకులో సుక్రోజ్ అధికంగా ఉంటుంది. పీచు తక్కువగా ఉంటుంది. అందుకే పారిశ్రామిక రంగంలో ముఖ్యమైన పంటగా చెరుకు ప్రసిద్ధి పొందింది. ఇక కొబ్బరి చెట్టు గురించి ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. దాని పీచు దగ్గర నుంచి నీళ్ల వరకూ అంతా ఉపయోగమే!

### చెరుకు నుంచే చక్కెర

చెరుకు ప్రధానంగా సుక్రోజ్ నుంచి మనకు లభిస్తుంది. దీన్ని చెరుకు నుంచి వేరు చేసి శుద్ధి చేయడానికి ప్రత్యేకమైన ఫ్యాక్టరీలు ఉన్నాయి. చెరుకు నుంచి ఇథనాల్, చక్కెరను తయారు చేస్తారు. చెరుకును పులియబెట్టగా తయారైందే ఇథనాల్. బెల్జియం దేశంలో పెద్ద ఎత్తున ఇథనాల్ తయారవుతుంది. ప్రపంచంలో తయారయ్యే చక్కెరలో 70 శాతం చక్కెర చెరుకు నుంచే తయారవుతుంది. అందుకే చెరుకు గొప్పదనాన్ని గుర్తించి అక్టోబర్ 15న చెరుకు దినోత్సవంగా జరుపుకుంటున్నారు.

### చెరుకు రసంతో లాభాలెన్నో

క్రమం తప్పకుండా రోజూ చెరుకు రసం తాగితే రక్తంలోని గ్లూకోజు నిల్వలన్నీ సరైన స్థాయిలో కొనసాగుతాయి. దీని వల్ల అధిక బరువు సమస్య తగ్గించుకోవచ్చు. వైరస్, బ్యాక్టీరియా, ప్రోటోజోవా వల్ల సంక్రమించే అంటువ్యాధుల నుంచి రక్షణ కల్పించి రోగ నిరోధక వ్యవస్థను మెరుగు పరుస్తుంది.

కేవలం చెరుకు మాత్రమే కాదు చెరుకు ఉప ఉత్పత్తుల్లో ఉండే యాంటీ ఆక్సిడెంట్స్‌లో రోగ నిరోధక గుణాలు ఉన్నట్టు పరిశోధకులు కనుగొన్నారు. రోజూ చెరుకు రసం తాగడం వల్ల మానసిక ఒత్తిడి తగ్గి, వ్యాధి నిరోధక శక్తి పెరుగుతుంది అలాగే రక్తం గడ్డకట్టకుండా ఉంటుందట. ఆ పనులన్నీ జరగడానికి కారణమయ్యే ఎసిటైల్ కొలైన్ అనే పదార్థం సహజంగా విడుదలయ్యేలా చేసే శక్తి చెరుకురసానికి ఉంది.

### ఇబ్బందులు తొలగిస్తుంది

ఎండాకాలంలో ఒంట్లో నీరు సరిగ్గా అందకనో లేక ఒంట్లో వేడిచేసో చాలామందికి మూత్రం సాఫీగా విడుదల కాక ఇబ్బందులు ఎదుర్కొంటారు. అలాంటి సమయంలో చెరుకురసం తాగితే మూత్రం సాఫీగా విడుదల అవుతుంది. మూత్రపిండాలు కూడా చక్కగా పనిచేస్తాయి. క్రమం తప్పకుండా చెరుకురసం తాగితే, జ్వరం లేక వడదెబ్బ లాంటి ఇబ్బందుల వల్ల కోల్పోయిన ప్రోటీన్లను తిరిగి పొందవచ్చు. చెరుకు రసాన్ని నిమ్మరసంతో కానీ, కొబ్బరి నీళ్లతో కానీ పలుచగా చేసి తాగితే మూత్రనాళంలో వచ్చేమంటను, శృంగారం ద్వారా సంక్రమించే వ్యాధులను తగ్గిస్తుంది. అంతే కాకుండా మూత్రపిండాలలో ఉండే రాళ్లు, ప్రొస్టేట్ గ్రంధి వాపు తగ్గించడంలో కూడా చెరుకురసం ఎంతగానో సహాయపడుతుంది.

### క్యాన్సర్ వ్యాధికి మందు

చెరుకు రసానికి ఉన్న క్షారగుణం క్యాన్సర్‌పై



## ఎవరైనా తాగవచ్చు

చక్కెర తినడం వల్ల కొందరికి అనారోగ్య సమస్యలు ఎదురవుతాయి చెరుకురసం వల్ల ఆ ఇబ్బందు లేవీ ఉండవు. చెరుకురసంలో సాధారణ చక్కెర లేమీ ఉండవు. అందువల్ల మధుమేహంతో బాధపడేవారు కూడా చెరుకు రసం తాగవచ్చని సూచిస్తున్నారు. చెరుకురసంలో ఉన్న ఫెనోలిక్స్ ప్లేవనాయిడ్స్ యాంటీ ఆక్సిడెంట్లతో సమానంగా పని చేస్తాయి. ఇవి ఫ్రీరాడికల్స్ ఉత్పత్తికి అడ్డుపడతాయి. శరీరంలో ఫ్రీరాడికల్స్ వల్ల ఎన్నో రకాల రోగాలు వస్తాయి. శరీరంలో ఫ్రీరాడికల్స్‌ను బయటకు పంపించి వేయడానికి చెరుకు రసం ఎంతగానో ఉపయోగపడుతుంది. అందులో ఉండే యాంటీ ఆక్సిడెంట్లు ఫ్రీరాడికల్స్‌కు అడ్డుకట్ట వేస్తాయి. తద్వారా మనం రోగాల బారిన పడకుండా ఎంతో సహాయపడతాయి. మానవులలో మలేరియా, మధుమేహం, చర్మక్యాన్సర్‌లలో పొరలు దెబ్బతినడానికి లిపిడ్ పెరాక్సిడేషన్ కారణం అవుతుంది. చెరుకు రసం దానిని ఆపుతుంది. లిపిడ్ పెరాక్సిడేషన్‌ను ఆపడం ద్వారా శరీరభాగాలలో ఉండే వివిధ రకాల పొరల్ని ఇది రక్షిస్తుంది. ఒక పరిశోధన ద్వారా చెరుకు రసం ద్వారా ప్లాస్మిడ్ డీఎన్ఏ రక్షింపబడుతుందని తేలింది. అంతేకాక శరీరానికి అవసరమయ్యే ఈ-కొలి బ్యాక్టీరియా జీవించి ఉండేటట్లు చేసే గుణాలు చెరుకురసానికి ఉన్నట్లు తేలింది.

పోరాటానికి ఎంతగానో ఉపయోగపడుతుంది. వివిధ రకాల ఔషధాలకు కూడా లొంగని రొమ్ము క్యాన్సర్‌ను నిరోధించడంలో కూడా ఇది బాగా పనిచేస్తుంది. ప్రత్యేకించి ఇది ప్రొస్టేట్, రొమ్ము క్యాన్సర్‌పై గట్టిగా పోరాడుతుంది. అంతేకాక ఉదరం, మూత్రపిండాలు, గుండె, కళ్లు, మెదడు, శృంగార అవయవాలను దృఢంగా ఉంచడంలో ఉపయోగపడుతుంది. పచ్చకామెర్ల వ్యాధితో బాధపడుతున్నవారు చెరుకురసంలో, నిమ్మరసం కలిపి తాగుతూ ఉంటే చాలా తొందరగా ఆ సమస్య నుంచి కోలుకుంటారు. కాల్షియం, పొటాషియం, ఇనుము, మెగ్నీషియం, ఫాస్ఫరస్ మొదలైన ఎన్నో రకాల పోషకాలు, విటమిన్లు తాజాగా ఉండే చెరుకు రసం నుంచి లభిస్తాయి. క్రీడాకారులు చెరుకు రసం తాగడం వల్ల వారిలో రీహైడ్రేషన్ బాగుంటుందని అనేకరకాల పరిశోధనల్లో తేలింది.

### ప్రాచీన కాలం నుంచే

చెరుకుగడ నమిలి తినడం ద్వారా శరీరం దృఢంగా, ఆరోగ్యంగా ఉంటుందని భారతీయ వైద్య విధానంలో పేర్కొనబడింది. అలాగే చెరకుగడ వేళ్లు, కాండాన్ని ఆయుర్వేద వైద్యంలో చర్మం, మూత్ర నాళాలకి సంబంధించిన, వ్యాధుల నివారణకు, అంటువ్యాధుల నివారణకు, శ్వాసనాళాలకు సంబంధించిన వ్యాధులను తగ్గించడానికి బాలింతల్లో పాలు వృద్ధి చెందడానికి, రక్తహీనత, మలబద్ధంకం, శారీరక బలహీనత, గుండెజబ్బులు తదితర జబ్బులు తగ్గించడానికి ఎక్కువగా ఉపయోగిస్తారు. ఇంకా పచ్చకామెర్ల వ్యాధి తగ్గడానికి వీటిని ఉపయోగించేవారని కొన్ని రకాల ఆయుర్వేద గ్రంథాలలో రాసుంది. అతి ప్రాచీన కాలం నుంచి భారతదేశంలో ఆయుర్వేద, యునాని వైద్యాలలో చెరుకు రసం ఎక్కువగా వాడబడుతుంది. ఉష్ణ మండల ప్రాంతాల్లో చెరుకురసం ఆరోగ్యాన్ని కలిగించేదిగా, అధిక పోషక విలువలు కలిగిన పానీయంగా గుర్తింపు పొందింది.

### కొబ్బరినీరు ఎంత తాగితే అంత మేలు

దాహార్తి తీర్చడానికి, శరీరం చలువ చేయడానికే కాదు, కొబ్బరి నీళ్ళు ఎంత ఎక్కువ తాగితే అంత మంచిదని వైద్యులు సూచిస్తున్నారు. కొబ్బరి నీళ్ళలో 24 కేలరీల శక్తి ఉంటుంది. ముఖ్యంగా లేత కొబ్బరి బొండాల్లో 90 నుంచి 95 శాతం నీరు ఉంటుంది. ఇందులో అనేక ఖనిజాలు, పోషకాలు ఉంటాయి. ఇంకా రక్తం లోని ఎలక్ట్రోమేట్ సమతూకాన్ని కొబ్బరినీరు కాపాడుతుంది. కొబ్బరి నీరు వాతపిత్తాలను తగ్గిస్తుంది. అల్సర్ రోగులు కొబ్బరి నీరు సేవనం ద్వారా ఉపశమనం పొందవచ్చు. ఒక గ్లాసు కొబ్బరి నీళ్ళు ఒక సెలైన్ వాటర్‌బాటిల్‌తో సమాన మైనదని వైద్యులు చెబుతున్నారు. జీర్ణశక్తి మెరుగ్గా ఉండడానికి కొబ్బరి నీళ్ళు చాలా సహకరిస్తా యట. కొబ్బరినీళ్ళలో ఫైబర్ ఎక్కువగా ఉంటుంది. శరీరానికి కావాల్సిన ఫైబర్ అందనట్ల యితే నీరసించిపోతారు కాబట్టి వారం రోజుల పాటు కొబ్బరినీరు తాగితే శరీరానికి తగినంత ఫైబర్ అందే అవకాశం ఉంది. వేసవిలో కామెర్లు, పసికర్లు వ్యాధులు రాకుండా ఉండాలంటే రోజూ కొబ్బరి బొండాల నీరు తాగడం మంచిది.

## బరువు తగ్గుతారు

కొబ్బరి తింటే బరువు పెరుగుతామేమో అని కొందరు భయపడుతుంటారు. కానీ కొబ్బరి తినడం వల్ల బరువు తగ్గే అవకాశం ఉందట. దానికి కారణం అందులో ఉండే శాచురేటెడ్ కొవ్వు పరిమాణమేనని ఓ అధ్యయనంలో వెల్లడైంది. కొబ్బరిలో ఫ్యాటీ యాసిడ్లు తక్కువ కనుక తేలికగా జీర్ణం అయిపోతుంది. దీనివల్ల శరీరంలో కొవ్వు నిలువలు ఏర్పడకుండా ఉంటాయి. జీర్ణ వ్యవస్థలో ఉండే ఎంజైమ్‌లు కొబ్బరిని జీర్ణం చేయడంతో పాటు దీనిలో ఉండే పోషకాలు, ఖనిజాలు, విటమిన్లు శరీరానికి అందించడంలో తోడ్పడతాయి. అందులో ఉండే మీడియం చెయిన్ ట్రైగ్లిజరైడ్స్ అనే శాచురేటెడ్ కొవ్వుల వల్ల శరీరంలో కొవ్వు చాలా వేగంగా కరిగించడమే కాక కొవ్వు నిల్వల్ని తగ్గించడంలో తోడ్పడుతుందని ఈ పరిశోధనల ద్వారా తేలింది.

### గర్భిణీలకు చాలా మంచిది

కొబ్బరి నీళ్ళలో గర్భిణీలకు అవసరమైన పోషకాలు పుష్కలంగా లభిస్తాయని పరిశోధకులు చెబుతున్నారు. కేరళలోని కొబ్బరి అభివృద్ధి బోర్డు నిపుణులు ఈ విషయం వెల్లడించారు. గర్భిణిలు కొబ్బరినీళ్ళు తాగితే వారికి అవసరమైన ఫ్లూయిడ్స్, ఎలక్ట్రోలైట్స్, మెగ్నీషియం, కాల్షియం, విటమిన్ సి, క్లోరైడ్స్, రిబోఫ్లేవిన్‌లాంటివి కొబ్బరినీళ్ళ ద్వారా దండిగా లభిస్తాయి. గర్భిణీలు నిత్యం కొబ్బరి నీళ్ళు తాగడం వల్ల గర్భాశయంలో ఉన్న సమస్యలు చక్కబడి అండం ఎదుగుదలకు తోడ్పడుతుంది.



సుఖ ప్రసవం అయ్యే అవకాశాలు కూడా ఉంటాయి. బిడ్డ ఆరోగ్యంగా పెరుగుతుంది. అంతేకాకుండా నిత్యం కొబ్బరి బొండం తాగడంవల్ల రోగనిరోధక శక్తి పెరుగుతుంది. గర్భిణీలలో రక్తపోటు తొలగించేందుకు కూడా కొబ్బరినీళ్ళు ఉపయోగపడతాయి. బ్యాక్టీరియాలను బయటకు పంపి యూరినరీ ఇన్ఫెక్షన్లు రాకుండా ఇది తోడ్పడుతుంది. నిర్జలీకరణం, అలసట వంటి లక్షణాల నుంచి బయటపడేందుకు దోహదం చేస్తాయి. వైరస్‌లతో పోరాడే శక్తి కూడా వీటికి ఉంది. శీతాకాలంలో కూడా కొబ్బరి బొండం తాగవచ్చు. జలుబు లాంటి సమస్యలేవీ రావు.

**- విజేత**




# ఆ హోటల్ గదిలో ఏం జరిగింది?

**'గుడ్ సమయానికి వచ్చావు' డిటెక్టివ్ శరత్‌ని ఆహ్వానిస్తూ అన్నాడు ఇన్‌స్పెక్టర్ విజయ్.**

**'మిగతా వారి పని అయిపోయిందా?' అడిగాడు శరత్.**

**'అయిపోయింది. నీ కోసమే ఎదురు చూస్తున్నాం' అన్నాడు విజయ్.**

ఇద్దరూ లిఫ్టులో పైకి వెళ్తుంటే చెప్పాడు విజయ్. 'హతుడి పేరు భాస్కర్. యాభై అయిదేళ్లుంటాయి. వ్యాపారి. ఈ హోటల్‌లో దిగటం ఇదే ప్రథమం. వ్యాపార నిమిత్తం వస్తే ఎప్పుడూ ఫైవ్ స్టార్ హోటల్‌లో ఉండేవాడు. ఈసారి మాత్రం ఈ మారుమూల అంతగా ప్రాచుర్యం లేని ఈ హోటల్‌లో గది తీసుకున్నాడు. నిన్న మధ్యాహ్నం వచ్చాడు. తెల్లారి నుంచి బయటకు రాకపోతే హోటల్ వాళ్లు డూప్లికేట్ 'కీ'తో తలుపు తీశారు. బెడ్‌పై మరణించి ఉన్నాడు. నిద్రలో గుండెపోటు వచ్చిందని డాక్టర్ అనుమానం. వాళ్ళవాళ్ళకి కబురు పెట్టాం. వస్తూండవచ్చు' చెప్పాడు విజయ్.

'గుండెపోటుతో మరణిస్తే నా అవసరం ఏంటి?' అడిగాడు శరత్ నవ్వుతూ.

'ఉంది. అతడి భార్యకు ఇది సహజ మరణం అనిపించటం లేదట. అతడు గుండె సమస్యకి జాగ్రత్తలు తీసుకుంటాడట. అంతేకాక, ఎప్పుడూ ఉండే ఆ ఫైవ్‌స్టార్ హోటల్‌కి భార్య ఫోనుచేస్తే, 'సార్.. నిద్రపోతున్నారు. డోన్ట్ డిస్టర్బ్ అని చెప్పారట. మరి అతడు ఆ హోటల్‌లోనే లేడుకదా. ఈ హోటల్‌లో ఉన్నాడు కదా? వాళ్ళెందుకలా చెప్పారు? ఇది అతడి భార్య అనుమానం? దీనివెనుక ఏదో ఉందనీ, నిన్ను పిలిపించమనీ అడిగింది' చెప్పాడు విజయ్. తల పంకించాడు శరత్.

ఇద్దరూ గదిలోకెళ్ళారు.

మంచం మీద నిద్రిస్తున్నట్టుంది శవం. శవాన్ని జాగ్రత్తగా పరిశీలించాడు శరత్. ఎలాంటి గాయాలు లేవు. కానీ నొప్పితో బాధపడినట్టు మంచం మీద అటూ ఇటూ పొర్లిన సూచనలున్నాయి. ముఖం కూడా బాధను సూచిస్తోంది. మంచం పక్కనే ఉన్న టేబుల్‌మీద గాజు గ్లాసు ఉంది. దాన్ని తీసుకుని ప్లాస్టిక్ కవర్‌లో వేశాడు శరత్. షెల్ఫ్‌లో కొన్ని మందులు కనిపించాయి. వాటిని తీసుకున్నాడు. సోఫాని పరిశీలించాడు. అతడి కళ్లు చిన్నవయ్యాయి. మరింత జాగ్రత్తగా చూశాడు. సోఫాలో కొన్ని ఫైబర్లు, వెంట్రుకలు దొరికాయి. వాటిని ప్లాస్టిక్ కవర్లలో వేసుకున్నాడు.

'ఇతడిని కలవటానికి ఎవరైనా ఫ్రెండ్స్ వచ్చారా?' మేనేజర్‌ని అడిగాడు శరత్.

'లేదు' చెప్పాడు మేనేజర్.

'ఒక గెస్ట్ వెళ్లి మరో గెస్ట్ వచ్చేలోగా గదిని కేవలం ఊడుస్తారా లేక వాక్యూం క్లీన్ చేస్తారా?' అడిగాడు శరత్.

'ఎక్కువ రెంట్ పలికే ఇలాంటి గదుల్ని వాక్యూం క్లీన్ చేస్తాం. కింది స్థాయి గదులను ఊడుస్తాం' చెప్పాడు హౌస్‌కీపర్.

ఆలోచిస్తూ తల ఊపాడు శరత్.

•••

ఆమె కళ్లు తుడుచుకుంటూ చెప్పింది. 'ఆయనకి గుండెలో సమస్య ఉందని చెప్పారు కానీ గుండెపోటు వచ్చేంత లేదని చెప్పారు డాక్టర్లు. మందులు వాడుతూ జాగ్రత్తలు తీసుకుంటే సరిపోతుందని చెప్పారు. పైగా ఆయన ఉంటానన్న చోటు వేరు. ఉన్నచోటు వేరు. ఇందులో ఏదో కుట్ర జరిగిందని నా అనుమానం' అంది.

తల ఊపాడు శరత్. నా అసిస్టెంట్ రాము, మీ వారు ఎప్పుడూ ఉండే హోటల్‌కే వెళ్లి కనుక్కున్నాడు. మీవారు ముందుగా ఆ హోటల్‌లోనే దిగారు. కాసేపటికి ఓ చిన్న సూట్‌కేసు తీసుకుని బయటకు వెళ్తూ ఎవరు ఫోన్ చేసినా డిస్టర్బ్ చేయవద్దన్నారని చెప్పమన్నాడట. మీకూ వాళ్ళు అదే చెప్పారు.

'అంటే.. ఆయన రెండు హోటళ్ళలో గదులు తీసుకున్నారా?' అడిగిందామె.

'ఈ హోటల్‌లో అప్పటికప్పుడు బుక్ చేసుకున్నారు. వచ్చినప్పటి నుంచీ హోటల్ వదలి వెళ్లలేదు' చెప్పాడు శరత్.

ఇంతలో రాము గదిలోకి వచ్చాడు. 'బాస్.. నువ్వు చెప్పినట్టు చుట్టుపక్కల గదుల వాళ్ల సమాచారం సేకరించాను. ఇదిగో జాబితా' అని అందించాడు. 'వీటిల్లో మీకు పరిచితమైన పేర్లు ఉన్నాయా?

**హోటల్ గదిలో గుండెపోటుతో మరణించాడు వ్యాపారి భాస్కర్. కానీ అతడి భార్య డిటెక్టివ్ శరత్‌ని ఆశ్రయించింది. అది సహజ మరణమే కదా! మరి డిటెక్టివ్ అవసరం ఏమొచ్చింది? శరత్ ప్రశ్నించాడు. మృతుడు రూమ్‌లో నిద్రపోతున్నాడని అతడి భార్యకు హోటల్ సిబ్బంది ఫోన్‌లో చెప్పారు. కానీ అసలా హోటల్‌లోనే అతడు దిగలేదు. మరి అతనెక్కడున్నాడు? అసలేం జరిగింది?**

అని దాన్ని చూపించాడు శరత్'

ఆమె జాబితా చదివి తల అడ్డంగా ఊపింది.

'ఈ ఊళ్లో ఎవరితో వ్యాపార సంబంధాలున్నాయో తెలుసా?' అడిగాడు.

'నా అన్నయ్యతో.. కానీ వాళ్లింట్లో ఉండరాయన'.

రాము వైపుచూశాడు శరత్. రాము తల ఊపి వెళ్లిపోయాడు.

ఇంతలో ఫోరెన్సిక్ నిపుణుడు ఫణి నుంచి ఫోను వచ్చింది. అతడు ఫోనులో చెప్పిందివిని లేచాడు శరత్. 'మీరు మీ అన్నయ్య ఇంట్లో ఉంటారుగా, మిమ్మల్ని మళ్లీ కలుస్తాను' అన్నాడు.

•••

'గ్లాసు మీద రెండు రకాల వేలి ముద్రలున్నాయి. ఒకటి మృతుడు భాస్కర్‌ది. రెండవది తెలియటం లేదు' చెప్పాడు పూరి.

విజయ్‌వైపు చూశాడు శరత్.

'నేను మా దగ్గర ఉన్న నేరస్థుల వేలి ముద్రలతో పోలుస్తాను' అన్నాడు విజయ్.

'అంటే గదిలో ఎవరినో కలిశాడన్నమాట భాస్కర్' అన్నాడు శరత్.

'అవును. నువ్వు పంపిన ఫైబర్, హెయిర్ ఎనాలిసిస్ రిపోర్టులు కూడా వచ్చాయి. అది మగవాళ్లు వేసుకునే ప్యాంట్ మెటీరియల్ ఫైబర్. అలాగే వెంట్రుకలు కూడా మగ వారివే' చెప్పాడు ఫణి.

'పోస్ట్‌మార్టమ్ రిపోర్టు వచ్చిందా?' అడిగాడు శరత్.

'వచ్చింది. మధ్యాహ్నం మూడు, నాలుగు నడుమ మరణం సంభవించి ఉంటుంది'

'అంటే... అతడు గదిలోకి వచ్చి చేరిన గంటలో ప్రాణం పోయింది' అన్నాడు శరత్.

'నువ్వు పంపిన గ్లాసు లోపలి భాగాన్ని కెమికల్ ఎనాలిసిస్ చేశాను. అతడు తాగిన ద్రావకంలో మందు కలిపారు. అది కృత్రిమంగా గుండె నొప్పిని కలిగించే డ్రగ్'.

'అంటే ఇది హత్యే' అన్నాడు విజయ్.

'నేనూ అదే అనుమానించాను. సాధారణంగా గుండె నొప్పి నివారణకు మందులున్నట్టే, రక్తపోటు పెంచి, గుండె నొప్పి కలిగించే మాత్రలూ ఉన్నాయి. అలాంటి మాత్రలు అందించటం వల్ల వ్యక్తిలో గుండెనొప్పి కృత్రిమంగా కలిగించవచ్చు. సరైన వైద్యం అందకపోతే మరణం సంభవిస్తుంది' చెప్పాడు శరత్.

గ్లాసులోపలి భాగంలో అంటి ఉన్న రసాయనాల ద్వారా ఈ విషయం తెలుసుకోగలిగాం' చెప్పాడు ఫణి.

'హోటల్ గదిలో అతన్ని కలిసిందెవరో ముందు

తెలుసుకోవాలి' అన్నాడు శరత్.

●●●

'వ్యాపార శత్రువులు, ఆస్తిలో వాటా కోసం తగాదాలూ ఏమీ లేవు బాస్. అతడి సెల్‌ఫోన్‌లో కూడా అనుమానాస్పదమైన కాల్స్‌గానీ, మెసేజీలుగానీ లేవు' చెప్పాడు రాము.

'అతడి ఎఫ్.బి. ఎకౌంట్?' అడిగాడు శరత్.

ఫోను అందించాడు రాము.

ఫోను తెరవగానే ఫేస్‌బుక్ ఎకౌంట్ తెరచు కుంది. అతని స్నేహితుల జాబితా, హోటల్‌లో గెస్టుల జాబితాతో పోల్చాడు. ఎవరూ లేరు. అందులో 'ప్రేమ'తో చాట్ శరత్‌ను ఆకర్షించింది. ప్రేమకు ఇతడికీ ఏదో గొడవ! అదేంటో అర్థం కాలేదు శరత్‌కి. వెంటనే కత్తి ఉమేశ్ కుమార్‌కి ఫోన్ చేసి పిలిపించాడు. అతడికి సెల్‌ఫోన్ ఇచ్చి 'ఫేస్‌బుక్‌లో ప్రేమ అనే ఆవిడ అడ్రసు, ఫోన్ నెంబర్ వెతుకు' అన్నాడు.

'ఓస్... అదెంత పని' అన్నాడు ఉమేష్. కాసేపటికి ఓ ఫోను నెంబరు శరత్‌కు అందించాడు. వెంటనే శరత్ ఆ నెంబరుకు ఫోను చేశాడు.

స్విచాఫ్ వస్తోంది.

రామువైపు చూశాడు. 'నెంబరు ఆధారంగా అడ్రసు కనుక్కో' అన్నాడు.

●●●

'ఎవరు మీరు? ఎవరు కావాలి?' తలుపు తెరచి శరత్, రాము వైపు అయోమయంగా చూస్తూ అడిగింది ప్రేమ.

'మీరేనా ప్రేమా?' అడిగాడు శరత్.

'అవును'.

'భాస్కర్ పేరు వినగానే ప్రేమ ముఖం మాడిపోయింది. ఆమె పెదిమలు వణకసాగాయి. భాస్కర్ మరణించాడు' అంది మెల్లిగా.

'కాదు హత్యగావించబడ్డాడు' అన్నాడు శరత్.

ఆమె ముఖం పాలిపోయింది. అంతలోనే ఆమె కళ్లల్లో నీళ్ళు.

'భాస్కర్ చావుకి కారణం నేనే. అతడికి నీనాను పరిచయం చేశాను. భాస్కర్‌కి దగ్గరయ్యేందుకు నన్ను పావులా వాడింది. భాస్కర్ నా ఫేస్‌బుక్ ఫ్రెండ్. అతడికోసం నాతో ఫ్రెండ్‌షిప్ చేసింది నీనా. మెల్లిగా భాస్కర్‌ను తన గుప్పెట్లో పెట్టుకుంది. భాస్కర్ మమ్మల్ని ఇగ్నోర్ చేశాడు. అతడి భార్యను కూడా దూరం చేయాలని ప్రయత్నించింది. అతడు ఇక్కడికి వచ్చింది నీనాను కలవటానికే. ఇంతకు ముందు రెండుసార్లు కలిశాడు'

'నీనా వివరాలు చెప్పండి' అడిగాడు శరత్. ఆ వివరాలు రాసుకుని 'నీనాకు పెళ్లి కాలేదా?' అడిగాడు శరత్.

'సుఖంగా సంసారం చేసుకుంటోంది. తాను భర్తతో ఉంటుందట. భాస్కర్ మాత్రం పెళ్లాన్ని వదిలేయాలట. అందుకే నీనాను అన్‌ఫ్రెండ్ చేసి భాస్కర్‌ని హెచ్చరించా. అతడు వినలేదు' చెప్పింది ప్రేమ.

●●●

'నీనా అంటే నేనే. ఏం కావాలి?' అడిగిం దామె.

'లోపలకు రావచ్చా?' అడిగాడు శరత్. ఇంతలో 'ఎవరు నీనా?' అంటూ వచ్చాడు ఆమె భర్త.

తనని తాను పరిచయం చేసుకున్నాడు శరత్. 'భాస్కర్ గురించి కొన్ని వివరాలు కావాలి' అడిగాడు శరత్.

'అలాంటి వాడెవ్వడూ మాకు తెలియదు. గెటౌట్' అని శరత్‌ని తోసి తలుపు వేయబోయాడు ఆమె భర్త.

తలుపును తన్ని లోపలకు వచ్చాడు శరత్.

నీనా భర్త శరత్‌పైకి లంఘించాడు. శరత్ అతడి చేయి గాలిలోనే పట్టుకుని మెలి తిప్పాడు. బాధగా అరిచాడతడు.

'కెవ్వు'మని అరిచి శరత్‌పైకి దూకబోయింది నీనా. విజయ్ ఆమెని పట్టు కున్నాడు.

●●●

'నీనా, భరత్‌లది అన్యోన్య దాంపత్యం. ఫేస్‌బుక్ వారి దాంపత్యంలో విషాన్ని చిలికింది. నీనాకు భాస్కర్ పట్ల ఆకర్షణ జనించింది. ఎలాగైనా అతడిని తన వాడిని చేసుకోవాలనుకుంది. అలాగని భరత్‌పై కోపం, ద్వేషం లేదు. కానీ భాస్కర్‌పట్ల ఆకర్షణ. దాంతో ప్రేమ ద్వారా భాస్కర్‌కు దగ్గరైంది. భాస్కర్‌కి అతని స్నేహితులను దూరం చేసింది. భార్యని వదిలేయమంది. భాస్కర్‌తో రెండుసార్లు సన్నిహితంగా ఉంది కూడా. ఇంతలో భాస్కర్‌కు దూరమైన ఓ ఫ్రెండు నీనా భర్తకు ఈ విషయం చెప్పాడు. భరత్ ప్రశ్నించగానే నిజం ఒప్పుకుంది నీనా. భాస్కర్‌పట్ల ప్రేమలేదనీ, ఇకపై నిజాయితీగా ఉంటానని నమ్మించింది. అప్పటి నుంచీ ఎఫ్‌బీలో నీనా పేరుతో భాస్కర్‌తో 'చాట్ చేశాడు భరత్. అతడిని ఊరికి రప్పించాడు. అతడు రాకముందే హోటల్‌లో గది తీసుకున్నాడు. ఎవ్వరికీ భరత్ పేరు తెలియకపోవటంతో అతన్ని గుర్తుపట్టలేకపోయారు. భాస్కర్‌ని కలిశాడు. అతడు తాగే నీళ్లలో కృత్రిమంగా గుండెనొప్పి కలిగించే మందు కలిపాడు. వచ్చేశాడు. తన నేరం ఎవరూ పసికట్టలేరనుకున్నాడు. కానీ గ్లాసులోని రసాయనం, నేరం జరిగిందని చెప్తే, సోఫాలో దొరికిన ఫైబర్లు, వెంట్రుకలు భరత్ నేరాన్ని నిరూపిస్తున్నాయి' వివరించాడు శరత్.

**-కస్తూరి మురళీకృష్ణ**
**సెల్: 98496 17392**



# వింత వింత మ్యూజియములు

## మే 18 ఇంటర్నేషనల్ మ్యూజియమ్స్ డే సందర్భంగా

**చరిత్రకు ఆనవాళ్ళు మ్యూజియములు. పురాతన వస్తువులకు నెలవు. చరిత్రలో జరిగిన విశేషాలను భావితరాలకు అందించడానికి ఆ కాలంలో ఉపయోగించిన వస్తువులన్నింటినీ ఒక చోటచేర్చి వాటిని సంరక్షిస్తారు. ఇలాంటి పురావస్తువులను ప్రదర్శనశాలల్లో ఉంచి సంరక్షించుకోవడమంటే మానవజాతి చరిత్రను భద్రపరుచుకోవడమే.**

ఈ ప్రదర్శనశాలల్ని సందర్శిస్తే ప్రాచీన చరిత్రపై మనకు అవగాహన కలుగుతుంది. అప్పటి చరిత్ర, ఆనాటి ప్రజల జీవనశైలి, వారి కళాత్మకత, ఆచరించిన సాంస్కృతిక విలువలు ఎలా ఉన్నాయో తెలుసుకోగలుగుతాం. మన చరిత్రపట్ల అవగాహన ఏర్పరుచుకోవడం ద్వారా వర్తమానంలో ప్రవర్తించడమెలాగో, భవిష్యత్తును ప్లాన్ చేసు కోవడమెలాగో కట్టెదుట మనకు సంపూర్ణ దృశ్యా విష్కరణ జరుగుతుంది. అందుకే పురావస్తు ప్రద ర్శనశాలల్ని సందర్శించడం మనకు తప్పనిసరి అవసరం.

కేవలం విజ్ఞానం, వినోదం అందించడమే కాదు, ఈ మ్యూజియములు మనల్ని ఆశ్చర్య చకితుల్ని చేస్తాయి. మనల్ని అబ్బురపరిచే ఇలాంటి ఎన్నో రకాల మ్యూజియములున్నాయి. వాటిని చూస్తే ఇలాంటి మ్యూజియములు కూడా ఉన్నాయా! అనుకోక తప్పదు. ప్రపంచ వ్యాప్తంగా 202 దేశాలలో 55 వేల మ్యూజియములున్నట్లు అంచనా. ప్రపంచంలోనే అత్యంత వింతైన మ్యూజియముల గురించి వింటే ఆశ్చర్యపోవడం గ్యారెంటీ! మరి అలాంటి వింతైన మ్యూజియముల గురించి తెలుసుకోండి!

### బ్యాగుల మ్యూజియం

పువ్వుల్లో డబ్బులు దాచుకోవచ్చు, టెలిఫోన్‌లో అలంకరణ వస్తువులను పెట్టుకోవచ్చు, చేపను చేతికి తగిలించుకోవచ్చు ఏంటివన్నీ అనుకుంటున్నారా? మన ఊహకు అందని రూపాల్లో ఉండే బ్యాగులను గుర్తించి ఆ మ్యూజియంకెళితే తెలుస్తుంది. బ్యాగులు, పర్సులు అనగానే మనకు ఎప్పుడూ ఉపయోగించే మామూలు బ్యాగులే గుర్తుకు వస్తాయి. కానీ ఎన్నడూ చూడని వింత రూపాల్లో ఉండే బ్యాగుల్ని ఈ మ్యూజియంలో మనం చూస్తాం. దీన్ని తస్సీస్ మ్యూజియంగా పిలుస్తారు. ప్రపంచ వ్యాప్తంగా ఉన్న బ్యాగుల మ్యూజియములన్నింటి కంటే ఇదే అతి పెద్దది. ఈ మ్యూజియంలో ఐదువేలకు పైగా వెరైటీలు ఉన్నాయి. రకరకాల జంతువులు, ఆకారాలు, రంగులు, మెటీరియల్స్‌తో ఉన్న బ్యాగుల నమూనాలు ఇక్కడ చూడొచ్చు. ఇవే కాదు వీటి రంగులు కూడా వింతగా ఉంటాయి. పుస్తకాలనే బ్యాగులుగా మలిచినట్లు కలపతో చేసిన వైవిధ్యమైన బ్యాగులను ఇక్కడ చూడగలం. అందమైన బొమ్మలున్న బ్యాగులు ఇక్కడున్నాయి. ఈ బ్యాగులను ప్రదర్శించే విధానం కూడా సందర్శకులను ఎంతో ఆకట్టుకుంటుంది. గ్లాస్ మెటీరియల్‌తో బ్యాగ్‌ల ఆకారంలో తయారుచేసిన అరల్లో ఈ బ్యాగ్‌లను ప్రదర్శనకు ఉంచడం ఒక విశేషం. ఈ మ్యూజియం రూపకర్త హెంద్రిక్జ్. వివిధరకాల బ్యాగులు కొనడం ఆమెకు అలవాటు. అలా ఒకసారి క్రీ.శ 1870 కాలానికి చెందిన బ్యాగు ఆమె కంటపడింది. దాంతో పురాతన బ్యాగులను సంపాదించాలన్న కోరికతో ప్రపంచ వ్యాప్తంగా దొరికే వింతబ్యాగులను, పురాతన బ్యాగులను సేకరించింది. వాటిల్లో 16వ శతాబ్దం బ్యాగులు కూడా ఉన్నాయి. అలా వేలాది బ్యాగులు పోగుపడ్డాయి. బ్యాగుల సేకరణపట్ల ఆమెకున్న ఆసక్తే 2007 లో ఇలా మ్యూజియం ఏర్పాటుకు తోడ్పడింది.

### టాయిలెట్స్ మ్యూజియం

ఇదెక్కడి విడ్డూరం అనుకుంటున్నారా? ఈ టాయిలెట్స్ మ్యూజియం ఎక్కడో కాదు మనదేశంలోనే ఉంది. పరిశుభ్రత విషయంలో, టాయిలెట్స్ శుభ్రం చేసే కార్మికులకు కృతజ్ఞతా భావం ప్రకటించేందుకు స్వచ్ఛంద సేవకుడు బిందేశ్వర్ పాఠక్ ఈ టాయిలెట్స్ మ్యూజియం ఏర్పాటు చేశారు. ప్రపంచంలో ఉన్న భిన్న రకాలైన టాయిలెట్ డిజైన్స్‌ను ఈ మ్యూజియంలో చూడవచ్చు. దాదాపు 4500 సంవత్సరాల కాలం నుంచి ఇప్పటి వరకు టాయిలెట్స్ పరిణామక్రమ చరిత్రను ఈ మ్యూజియంలో మనం కళ్ళారా చూసి అర్థం చేసుకోవచ్చు. రాజులు, మహారాజులు వాడిన టాయిలెట్స్‌ను కూడా ఇక్కడ ప్రదర్శిస్తున్నారు. అంతేకాదు ఆ టాయిలెట్ చరిత్రకు సంబంధించిన వివరణ కూడా ఉంటుంది. 2013లో ఈ టాయిలెట్ మ్యూజియంకు అవార్డు కూడా లభించింది. దేశ విదేశీ పర్యాటకులు ఈ టాయిలెట్ మ్యూజియాన్ని నిత్యం సందర్శిస్తారు. సింగపూర్‌లో



## ఆవాలకూ ఓ మ్యూజియం



ప్రపంచంలో మిగితావారి కన్నా అమెరికన్లకు ఆవాలంటే ఎక్కువ ఇష్టం. వారు ఆవాలమీద ఉన్న ఇష్టంతో జాతీయ ఆవాల దినోత్సవం కూడా జరుపుకుంటారు. అమెరికాలోని మిడిల్టన్ నగరంలో ఆవాల మ్యూజియం ఉంది. నేషనల్ మస్టర్డ్ మ్యూజియంగా పిలిచే ఈ మ్యూజియంలో 60 దేశాల నుంచి దాదాపు 5,600 రకాల ఆవాలను వాటితో తయారు చేసే పదార్థాలను ఇక్కడ దాచారు. ప్రతిరోజు ఉదయం పది నుంచి సాయంత్రం ఐదు వరకు ప్రదర్శనకు ఉంచుతారు. సంవత్సరంలో నాలుగైదు రోజులు మాత్రమే ఈ మ్యూజియముకు సెలవులు ఉంటాయి!

కూడా ఇలాంటి మ్యూజియం ఏర్పాటు చేయాలని చూస్తున్నారట.

### సముద్రగర్భంలో..

ఏకంగా సముద్ర గర్భంలో మ్యూజియం ఏర్పాటు చేశారు. తొలిసారిగా ఐరోపా ఖండ తీరంలో మొదటిసారిగా సముద్ర గర్భంలో మ్యూజియం ఏర్పాటైంది. ఒక బ్రిటీష్ కళాకారుడు తొలిసారిగా ఈ ఆలోచనకు రూపుదిద్దాడు. క్లానర్ ద్వీపాలకు సమీపంలో అట్లాంటిక్ సముద్రంలో ఈ మ్యూజియమ్ ఏర్పాటైంది. దాదాపు 70 శిల్పకళా ఖండాలను సముద్రం అడుగుభాగానికి తరలించాడు. స్కూబా డైవింగ్ పరికరాలు ధరించి ఈదుకుంటూ సముద్ర గర్భానికి వెళ్ళి ఈ మ్యూజియం సందర్శించాలి. ఇలాంటి మ్యూజియం మనదేశంలో కూడా నిర్మించాలన్న ఆలోచనలో ఉన్నారు. ఆ ప్రయత్నం విజయవంతం కావాలని ఆశిద్దాం.

### బ్యాడ్ ఆర్ట్ మ్యూజియం

మంచి మంచి పెయింటింగ్‌లను ఒక చోట పేర్చి మ్యూజియంగా తయారు చేయడం సాధారణ విషయం. కానీ అమెరికాలోని ఆ మ్యూజియంలో మాత్రం మీరు మంచి పెయింటింగ్స్‌ను కానీ ఫోటోగ్రాఫ్స్ కానీ అస్సలు చూడలేరు. ఎందుకంటే ఆ మ్యూజియం, బ్యాడ్ ఆర్ట్‌కి సంబంధించింది. దీన్నే మోబా అని కూడా పిలుస్తారు. బాగాలేని పెయింటింగ్స్‌ను మాత్రం ఎందుకు ఎంకరేజ్ చేయకూడదు? ప్లేస్ అనే ఆలోచనతో రూపుదిద్దుకున్న మ్యూజియం ఇది. మీరు ఎంత చెత్తగా పెయింటింగ్ వేస్తే అంత మంచి ప్లేస్ ఈ మ్యూజియంలో మీకు లభిస్తుందన్నమాట!! సో ఈసారి ఎప్పుడైనా మంచి పెయింటింగ్ వేయలేక పోయినందుకు ఏమీ బాధపడకండేం ఈ మ్యూజియంలో ఏమైనా చోటు దొరుకుతుందేమో చూడండి!

### అతి పెద్ద రైలు మ్యూజియం

ప్రపంచంలోనే అతిపెద్ద రైల్ మ్యూజియం సేక్రిమెంటోలో ఉంది. లక్ష చదరపు అడుగుల విస్తీర్ణం గల ఈ మ్యూజియంలో 21 రైలింజన్లు అనేక రైలు పట్టాలు, ఇంకా రైలుకు సంబంధించిన 46 రకాల వస్తువులను చూడవచ్చు. 1862 కాలం నాటి ఐరన్‌హార్స్‌గా పిలిచే రైలింజన్లు ఇక్కడ చూడచ్చు. వేసవిలో సందర్శకులు ఆవిరితో నడిచే ఇంజన్ రైలులో ఆరు మైళ్ళ దూరం 40 నిమిషాల్లో ప్రయాణించవచ్చు. 1981లో మొదలైన ఈ మ్యూజియం పిల్లల్నే ఎక్కువగా ఆకర్షిస్తోంది. 1878 లో నిర్మించిన విక్టోరియన్ విల్లా భవంతి పర్యాటకులకు మరో ఆకర్షణ. కాలిఫోర్నియా గవర్నర్లు 13 మంది నివసించిన ఈ భవంతి పర్షియన్ కార్పెట్లు, ఇటాలియన్ చలువరాతి ఫైర్ ప్లేసెస్‌తో ఫ్రెంచ్ అద్దాలు, షాండ్లియర్స్‌తో ఎంతో విలాసవంతంగా ఉంటుంది.











### మనదేశంలోనూ ఉందోచ్

మనదేశంలో ఉన్న కొత్త రకం మ్యూజియములలో రైలు మ్యూజియం ఒకటి. ఢిల్లీలో 70వ దశకంలో ప్రారంభించిన ఈ మ్యూజియం దేశ రైల్వేల చరిత్ర మొత్తాన్నీ తెలియచేస్తుంది. తొలినాటి ఆవిరి ఇంజన్ మొదలు నేటి ఎలక్ట్రికల్ ఇంజన్ వరకు అన్ని రకాల రైలు ఇంజన్లు ఇక్కడున్నాయి. పటియాలా మహారాజు వాడిన మోనో రైలు మొదలు, బ్రిటీషర్లు వాడిన రైళ్ళు, బ్రిటన్‌రాణి కోసం ప్రత్యేకించిన రైలు అన్నీ ఇక్కడే మనం చూడవచ్చు. ఈ రైలు మ్యూజియంలో చాలా అరుదైన రైళ్ళు ఉన్నాయి. ఒకనాటి మోనో రైలు ఇప్పటికీ విజయవంతంగా పనిచేస్తుంది. ప్రపంచంలో అత్యంత పురాతన రైలు ఇంజన్ ఫెయిరీ క్వీన్! కేవలం మన భారత రైలు మ్యూజియంలోనే ఈ క్వీన్ పరుగులిడుతోంది. 1912లో నిర్మించిన మారిస్ ఫైర్ ఇంజన్‌తో పాటు రైలు వ్యవస్థ, పనితీరు గురించిన పూర్తి సమాచారాన్ని ఇక్కడ చూడగలం.

## శిరోజాల మ్యూజియం



జుట్టు సేకరించి వాటితో సవరాలు, విగ్గులు తయారు చేయడం, వ్యాపారం చేయడం లాంటి విషయాలు చాలా మందికి తెలుసు. జుట్టుకు ఉన్న ప్రాధాన్యం తెలుసుకున్నారు కాబోలు అక్కడ శిరోజాల మ్యూజియం ఏర్పాటు చేశారు. ఈ మ్యూజియం కప్పాడోసియాలో ఉంది. ఒక చీకటి గుహలో ఉంటుంది శిరోజాల మ్యూజియం. 30 యేళ్ళ క్రితం స్థాపించిన ఈ మ్యూజియంలో ప్రపంచ వ్యాప్తంగా 16 వేల మంది మహిళల శిరోజాలు సేకరించి ఈ గుహలో ప్రదర్శనకు ఉంచారు.

### శిశువుల పిండాల మ్యూజియం

ఇప్పుడు చదివే మ్యూజియం గురించి వింటే మాత్రం ఒళ్లు గగుర్పొడవక మానదు. ఈ మ్యూజియం రష్యాలో ఉంది. వైకల్యంతో చనిపోయిన శిశువుల పిండాలను, గర్భస్థంలోనే చనిపోయిన పిండాలను సేకరించి వాటిని వెనిగర్‌లో నిల్వచేసి ప్రదర్శనకు పెడతారు. ఈ మ్యూజియం చూడడానికి వచ్చినవాళ్లందరూ భయపడకుండా తిరిగి వెళ్ళే ప్రశ్నే లేదు.

### ముళ్ల కంచె మ్యూజియం

ముళ్లకంచెలు అంటే రక్షణ వలయం అనేది మనందరికీ తెలిసిందే. అలాంటి ముళ్ల కంచెలన్నింటినీ ఒకచోట చేరిస్తే ఎలా ఉంటుంది? అనిపించింది కాబోలు. అమెరికాలో ఏకంగా ముళ్ళకంచెల మ్యూజియం ఏర్పాటు చేశారు. ఇక్కడ 2500 కంటే ఎక్కువ వివిధ ఆకారాలలో ఉన్న ముళ్లకంచెలు ఉంటాయి.

- నివేదిత



# నిండు నూరేళ్ళు

-సింహప్రసాద్ సెల్: 98490 61668



**'విజ్జీ! ఇలారా!' తన బిజినెస్ రూంలోంచి పిలిచారు నాన్న.**

**ఆయన స్వరంలో ఏదో తేడా ఉంది.**

**తలాడించి ఎదురుగా ఉన్న అమ్మవంక చూశాను. భయాందోళనలతో కంపిస్తోంది.**

**ఏదో జరిగి ఉంటుందని అర్థమైంది. మెల్లగా అడుగులేస్తూ వెళ్ళాను.**

**నా వెనుక డోర్ మూసుకుపోయింది. ఆ రూంలో నాన్న బిజినెస్ విషయాలే చర్చిస్తారు. వ్యాపార సంబంధిత మీటింగులే జరుగుతాయి. నన్నందులోకి రమ్మన్నారంటే మ్యాటర్ సీరియసే అయ్యుంటుందనుకున్నాను.**

డాడీకి ఎదురుగా కూర్చున్నాను.

సిగరెట్ వెలిగించి గాఢంగా పొగ పీల్చి వదిలారు. ఆయన టెన్షన్‌గా ఉండటం చూసి విస్తుబోయాను.

"నీ గురించి చాలా గొప్పగా ఊహించుకున్నాను బేబీ. నీ కేలిబర్ చూసి ఫ్రెండ్స్‌కి గర్వంగా చెప్పేవాణ్ణి. నీ లైఫ్ మార్వలెస్‌కి మరోపేరు కావాలని కలలు కనేవాణ్ణి. నీ గురించి ఎంతో ఉన్నతంగా ఆలోచిస్తోంటే.. నువ్విలా లెట్‌డౌన్ చేస్తావని నా వరస్ట్ డ్రీమ్స్‌లో కూడా ఊహించలేదు".

"మీరు నొచ్చుకునే పని నేనిప్పుడేం చేశాను డాడీ?"

"ఆ పాండురంగని ఎందుకు కాదన్నావ్? ఐ వాంట్ ఫ్యాక్ట్స్!"

"నేను కాదనడం ఏవిటి? వాళ్ళే వద్దన్నారుగా!"

"వద్దనేట్టు చేశావు. ఎందుకంటే నువ్వింకెవరో గొట్టంగాణ్ణి లవ్ చేస్తున్నావు గనుక. ఆ ముక్క ముందే కక్కి ఉంటే నా పరువు బజార్నపడేది కాదు. ఆ సంఘటనతో నా సర్కిల్లో నేనెంత పలచనయ్యానో నువ్వు ఊహించలేవు".

"సారీ డాడ్. అప్పుడు నాకెలాంటి దురుద్దేశం లేదు".

"నమ్మమంటావ్?"

"అబద్ధం ఆడాల్సిన అగత్యం నాకు లేదు"

"మరి దీన్నేమంటావు?"

ఒక ఫోటోని నా మీదకి విసిరారు.

అది విహాన్‌తో కలిసి నేను తీసుకున్న సెల్ఫీ.

### జరిగిన కథ

ఏడు నెలల క్రితం వివాహం జరిగినా విహాన్ జ్ఞాపకాలను మరిచిపోలేదు విజ్జీ. ఇంతలోనే ఆత్మహత్య చేసుకోబోతున్నట్టు ఆమెకు మెసేజ్ ఇస్తాడు విహాన్. అతన్ని రక్షించే ప్రయత్నంలో భర్తను కూడా లక్ష్యపెట్టకుండా అర్ధరాత్రి పూనే నుండి హైదరాబాద్ వెళ్ళేందుకు ఎయిర్‌పోర్ట్‌కు చేరుకుంది విజ్జీ. ఆమె ఆలోచనలు గతంలోకి జారుకున్నాయి. ఒక పబ్‌లో పనివాడుగా విజ్జీకి పరిచయమవుతాడు విహాన్. విహాన్‌ని పెళ్ళిచేసుకోవాలని నిశ్చయించుకుని అతడికి తన ప్రేమను వ్యక్తం చేస్తుంది విజ్జీ. ఆ తర్వాత....

ఫ్రెండ్స్ డే నాడు ఫేస్‌బుక్‌లో పెట్టాను. దాన్నెవరో ప్రింటు వేయించి డాడీకి పంపారు. ఎవరు? సుధారాణి?

ఎవరైతేనేం, నా పని ఈజీ చేశారు.

"మనది రిచ్‌క్లాస్. అతడిది నేల క్లాస్. సినిమాల్లో రిచ్‌క్లాస్ అమ్మాయి ఆటోవాణ్ణో టాక్సీడ్రైవర్నో ప్రేమించి పెళ్లాడేస్తుంది. దాంతో శుభం కార్డు వేసేస్తారు. ఆ తర్వాత వాళ్ళేమయ్యారు, ఎలా బ్రతికారు అని సినిమా వాళ్ళు చెప్పరు. చూపించరు. పోనీ ఆ సినిమా తీసిన వాళ్ళు గాని రాసిన వాళ్ళు గాని నటించినవాళ్ళు గాని తమింటి అమ్మాయి అలా చేస్తే అక్షింతలేసి ఆశీర్వదిస్తారా? ఛస్తే చెయ్యరు. నానా రాద్ధాంతం చేస్తారు. కేసులు పెట్టి మరీ హింసిస్తారు. అలాంటి చాలా వ్యవహారాలు నువ్వు పేపర్లలో చదివే ఉంటావు. విజ్జీ! నీ మేలుకోరి చెబుతున్నా. ఊహకీ వాస్తవానికీ మధ్యగల తేడాని నువ్వు తెలుసుకోవాలి బేబీ" అనునయంగా నచ్చచెప్పే ధోరణిలో చెప్పారు నాన్న.

కాని నా చెవులకేం ఎక్కడం లేదు.

"నేను అర్థం చేసుకోగలను" దృఢస్వరంతో చెప్పాను.

"ఏం అర్థమైంది? ఇతగాడు నిన్నటిదాకా ఓ బౌన్సర్. అంటే మన ఇంటిగేటు దగ్గర నిలబడి మనం వెళ్ళేటప్పుడు వచ్చేటప్పుడు సలాములు చేసే ఆఫ్ట్రాల్ సెక్యూరిటీ గార్డు లాంటివాడు. ఇవాళ రేడియోలో సొల్లుకార్చే జస్ట్ ఓ వాగుడు కాయ.."

మధ్యలో అందుకున్నాను. "రేపటి టీవీ నటుడు. ఎల్లుండి సినీ హీరో".

మిర్రి చూశారు. "అయితే బాగానే నమ్మించి బుట్టలో వేసుకున్నాడు".

"ఈ నమ్మకం అతడి శక్తిసామర్థ్యాల మీద! అతడు సాధించబోయే విజయాల మీద!"

"కూల్‌కూల్.. చర్వేరు క్రియవేరు. కష్టపడినంత మాత్రాన అంతా కలిసొచ్చేస్తుందను కోవడం పొరబాటు. నేనెందుకింత స్ట్రెస్ చేస్తున్నానో అర్థం చేసుకో. కారులో తిరిగే నీకూ కాలి నడక నడిచే అతడికీ కుదరదు. వాడు పది జన్మలెత్తినా మనస్థాయిలో సగానికి కూడా రాలేడు.

"నా బిజినెస్ క్లిక్ అయితే మాది కార్ల స్థాయి అవదూ?"

"అందుకు నేను పెట్టుబడి పెట్టాలి. సపోర్టుగా నిలవాలి. రేపెప్పుడో పబ్లిక్ ఇష్యూకెళితే నా పరపతి ఉపయోగించాలి. ఇవేవీ లేకపోతే టేకాఫే ఉండదు. రెక్కల్లేని పక్షిలా చతికిలపడుతుంది నీ వ్యాపారం!

తీక్షణంగా చూశాను. డాడీ దులిపేసుకున్నారు.

"కయ్యానికైనా వియ్యానికైనా సమఉజ్జీ ఉండాలి. ఇది నా మాట కాదు పెద్దల మాట. ఆడపిల్ల పెళ్లి కుటుంబ పరువు ప్రతిష్ఠలతో వంశమర్యాదలతో ముడిపడి ఉంటుంది. గుర్తుంచుకో".

"మీ వేదన, ఆలోచన అర్థం చేసుకున్నాను డాడీ. ప్రతి కన్న తండ్రి తన కూతురుని ప్రేమగా చూసుకునేవాడూ, కడదాకా చక్కని జీవితాన్ని ఇవ్వగలిగేవాడూ భర్తగా లభించాలని కోరుకుంటారు. మీరందుకు భిన్నం అనుకోను. విహాన్ ఆ కోరికకి సంపూర్ణ న్యాయం చేయగలడు డాడీ. విహాన్ అంటే నాకెంతో ఇష్టం. అలాగని అర్ధరాత్రి లేచిపోయి ఏ ఆర్య సమాజ్‌లోనో మేం పెళ్లి చేసుకోం. మీకిష్టం లేకుండా ఒక్కడుగు కూడా ముందుకేయను. ఐ లవ్యూ డాడ్. ఒక ఫాదర్ తమ సంతానం నుండి ఏమేం ఎక్స్‌పెక్ట్ చేస్తారో నేను గ్రహించగలను. మిమ్మల్ని డిజప్పాయింట్ చెయ్యను".

దిగ్భ్రమగా చూశారు నాన్న. ఆయన పెదాలు కంపిస్తున్నాయి. కాని వాటి మధ్య నుంచి మాటలు ఊడిపడటం లేదు.

బహుశా 'ఆరు నూరైనా అతడ్నే పెళ్లి చేసుకుంటాను' అని ఢంకా బజాయించి చెబుతాననీ, తిరుగుబాటు జెండా ఎగరేస్తాననీ భావించి ఉంటారు.

నా సమాధానాన్ని జీర్ణించుకోడానికి గబగబా సిగరెట్ ఊద సాగారు.

"నాకు ఊహ తెలిసినప్పట్నుంచీ నాక్కావలసినవన్నీ అడక్కుండానే అమర్చారు. అవసరాని కన్నా అధికంగా చేశారు. ఇప్పుడు నోరు తెరచి అర్థిస్తున్నాను. నాకు విహాన్ అంటే ఇష్టం డాడీ! అతడితో నా జీవితాన్ని పంచుకోవాలనుకుంటున్నాను. నా కోరిక మన్నిస్తారనీ అతడితో నా పెళ్లి జరిపిస్తారనీ నా ఆశ. నమ్మకం. కాదూ కూడదు అంటే నేనేమీ సాహసాలు చెయ్యను.



అఘాయిత్యాలకి పాల్పడను. ఇలాగే ఉండిపోతాను. నా శక్తియుక్తుల్ని వ్యాపారం మీద కేంద్రీకరిస్తాను. మీ వారసురాల్ని అన్పించుకుంటాను. సో బాల్ మీ కోర్టులో ఉంది డాడీ. మీరెలాంటి నిర్ణయం తీసుకున్నా సరే. ఫైనల్ వర్డ్ మీదే డాడ్".

ఆయన స్థాణువై చూస్తుండిపోయారు.

గుండెలమీంచి భారం దిగిపోగా రిలీఫ్‌గా ఫీలవుతూ బయటికి నడిచాను.

"ఏమన్నారే" ఆదుర్దా పడుతూ అడిగింది అమ్మ.

"నా పెళ్లి గురించి మాట్లాడాం. అంతా డాడీ నిర్ణయానికి వదిలేశాను.

నిలువెత్తు ఆశ్చర్యమయింది అమ్మ!

•••

"నువ్వు లైట్ తీస్కున్నావు గాని సమస్యలొస్తాయని ముందే ఊహించాను" అన్నాడు విహాన్.

"వస్తే రానీ, పరిష్కరిద్దాం. సమస్యల నించి తప్పించుకునే వాళ్ళు కాదు, వాటిని సమర్థవంతంగా ఎదుర్కొనేవాళ్ళే విజయం సాధిస్తారు" ధీమాగా అన్నాను.

"కాదనటం లేదు. కాని ఆ క్రమంలో ఆ సంఘర్షణలో నలిగి పోతామేమోనని నా భయం".

"వజ్రాలు మెరవాలంటే రాపిడి కావాలి. బంగారం శుద్ధి కావాలంటే నిప్పులో కాలాలి. మంచితనం రాణించాలంటే కష్టాలు ఎదుర్కోవాలి. సమస్యలు మానసిక శక్తిని పెంచుతాయి. మనమేంటో మనశక్తి ఏపాటిదో మనకి తెలియ జెబుతాయి".

"సరే లెటజ్ వెయిట్.."

"మన నిరీక్షణ తప్పక ఫలిస్తుంది. అప్పటిదాకా ఎప్పట్లా మన పని మనం చేసుకుంటూ ముందుకు పోతాం. డాడీ తన నిర్ణయం చెప్పేవరకూ మనం ఒత్తిడికి గురవడం అనవసరం కదా!"

సాలోచనగా తలాడించాడు.

మరోవారం గడిచింది. ఇంట్లో ఎలాంటి మార్పూ లేదు.

నాన్న ఇదివరకుకన్నా అభిమానంగా చూస్తున్నారు. పెళ్లి సంబంధాలు చూడటమూ మానేశారు. బహుశా ఆయన మాటే నాకు వేదవాక్కు అని చెప్పడంతో నా మీద గురి కుదిరిందేమో! ఆయన్ని త్రోసి రాజనని భరోసా చిక్కి ఉండొచ్చు.

ఏమైతేనేం మెల్లగా అయితేనేం మంచు కరుగుతోంది.

అది సానుకూల మార్పు అని నాకు నమ్మకంగా ఉంది.

విహాన్ గురించి నాకూ మా నాన్నకూ జరిగిన సంభాషణంతా ప్రాంజలికి చెప్పకుండా ఉండలేకపోయాను.

"వావ్! గ్రేట్! హీరోలా బిహేవ్ చేశావే. ఇంత తెలివి, తెగువ నీకెలా వచ్చాయే?" అని ఆశ్చర్యపడింది.

తలచుకుంటే నాకూ అలాగే అన్పిస్తోంది. అంతా ఆశ్చర్యంగా ఉంది.

"నువ్వు గ్రేట్. నీ ప్రేమ గ్రేట్. బ్రేవ్ మై డియర్ ఫ్రెండ్. ఈ సందర్భాన్ని సెలబ్రేట్ చెయ్యాల్సిందే. పార్టీ ఇవ్వాల్సిందే" పట్టుబట్టింది.

"తాగి ఊగే పార్టీ ఇవ్వను".

"నీ బౌన్సర్ ఉన్నాడుగా మనల్ని ప్రొటెక్ట్ చెయ్యడానికి".

"అప్పుడంటే పబ్‌పార్టీకి కాదన్లేక పోయాను. ఇప్పుడు కాదనే అంటున్నాను".

"సరే ఎక్కడో అక్కడ ఇయ్యి. స్పెషల్‌గా మరపురానిదిగా ఉండాలి సుమ".

"విహాన్‌తో మాట్లాడి చెబుతాను".

"అప్పుడే మొదలైందా అయ్యగారి పెత్తనం"

"పెత్తనం కాదు అవగాహన, అన్యోన్యత".

ఇంతింత కళ్ళతో చూస్తోంటే విహాన్‌తో మాట్లాడాను. "రెడీ, గో ఎహెడ్" అన్నాడు. సుధారాణిని పిలవడానికి ఫోన్ చేస్తే కట్ చేసింది. నా మీద పీకల దాకా కసీ కోపం ఉండి ఉంటాయి. రమ "ఇప్పుడు ఎక్కడికీ రాలేనే. ప్లీజ్ నన్నొదిలేయండి" అంది నీరసంగా.

**విహాన్ ఒక సాధారణ బౌన్సర్ అనీ, అతడితో ప్రేమ కలాపాలు సాగిస్తోందనీ విజ్జీ తండ్రికి తెలిసిపోయింది. అతడామెను పిలిచి నిలదీశాడు. అతడితో ప్రేమ మన స్టేటస్‌కు తగినది కాదని హెచ్చరించాడు. కానీ ధీరవనితలా నిలబడి ధైర్యంగా సమాధానమిచ్చింది విజ్జీ. తండ్రిని ఎదిరించలేదామె. అతడి ఇష్టం వచ్చినట్టే చెయ్యమని సూచించింది. కానీ మరో విషయం కూడా అతడికి చాలా సూటిగా వెల్లడించింది. ఏమిటది?**

"అలా మాట్లాడుతున్నావేంటి? హెల్త్ ప్రోబ్లమా?"

"డిప్రెషన్‌లో ఉన్నాను.."

అదిరిపడ్డాం. ఎప్పుడూ నవ్వుతూ చలాకీగా ఉండే రమకి కుంగుబాటు?

"ఇప్పుడే నేనూ, ప్రాంజలీ బయల్దేరి వస్తున్నాం. ధైర్యంగా ఉండు".

"మా నాన్నకి తెలిస్తే కొంపలంటుకుంటాయి".

"తెలీకుండా మ్యానేజ్ చేస్తాంలే ".

అరగంటలో వెళ్ళిపోయాం. మమ్మల్ని చూసి రమ కలవర పడింది. పది లంఖణాలు చేసిన దానిలా ఉన్న ఆమెని చూసి మేం ఖంగుతిన్నాం.

"సడన్‌గా నీకేవయ్యిందే? నీకు డిప్రెషనేంటి?"

"ష్..." వాళ్ళనాన్నకి వినిపించిందేమోనని భయపడుతూ లోపలికి చూసింది. పిమ్మట గుండెలమీద చేతులు పెట్టుకుని నిట్టూర్చింది. నోటి మీద వేలు పెట్టుకుని నిశ్శబ్దంగా ఉండమని సైగ చేసింది.

ఇంట్లోకెళ్ళి ఏవోపేపర్లు పట్టుకొచ్చి మమ్మల్ని టెర్రెస్ మీదకి తీసుకెళ్ళింది.

"ఆ పేపర్సేమిటి? ఎవడైనా బ్లాక్ మెయిల్ చేస్తున్నాడా?" ఆందోళనోత్కంఠతమై అడిగాను.

"నా చెల్లెలు లలిత రాసిన లెటర్స్..."

అయోమయంగా చూశాం. వాటిని మా చేతుల్లో పెట్టి ముఖం తిప్పుకుని మౌనంగా ఉండిపోయింది. బహుశా కళ్ళు తుడుచుకుంటూ ఉండి ఉండొచ్చు. ఎంత బాధ కాల్చేస్తోందో!

లలిత ఓ కార్పొరేట్ కాలేజీలో ఎమ్‌సెట్‌కి లాంగ్ టర్మ్ కోచింగ్ తీసుకుంటోంది.

క్రితంసారి మెడిసిన్లో నాలుగు వేల చిల్లర ర్యాంకు వచ్చింది. సీటురాలేదు. ఈసారి ఎలాగైనా మెడిసిన్ సీటు చేజిక్కించుకోవాలని రిపీట్ చేయిస్తున్నారు.

24 గంటలూ అదే ధ్యాసలో ఉండాలని రెసిడెన్షియల్లో చేర్చారు.

వారం రోజుల్లో ఎమ్‌సెట్ ఎగ్జామ్ ఉంది.

ఆ ఉత్తరాల నిండా తనెంత ఒత్తిడికి గురవుతోందో వర్ణించింది లలిత.

సరిగ్గా నిద్ర పట్టడం లేదనీ, పీడకలలు పీడిస్తున్నాయనీ పేర్కొంది.

హాస్టల్లో అస్తమానూ చదువు చదువు అని చంపుకు తింటున్నారనీ, ఆవులించినా, ఉదయమే నిద్ర లేవకపోయినా స్కేళ్ళతో కొడుతున్నారనీ రాసింది. అసలు రిలాక్స్ అవడానికి సమయమే ఇవ్వట్లేదుట.

## అనసూయ ఎంత డిమాండ్ చేస్తోందంటే....



అక్షరాలా నలభై లక్షల రూపాయలట! సినిమాలో తను చేయాలంటే రెమ్యునరేషన్ కింద నలభై లక్షలు డిమాండ్ చేస్తుండడంతో ఆమెతో చేద్దామనుకున్న నిర్మాతలు ఈ ఫిగర్ విని బైట నుంచి బైటే వెళ్ళిపోతున్నారట! అనసూయ రెండు బ్లాక్ బస్టర్ సినిమాల్లో నటించినా, అందులో ఆమె గొప్పతనమేమీ లేదు అన్న సంగతి తెలిసిందే! ఆ సినిమాల విజయానికి బోలెడు కారణాలున్నాయి. అనసూయ మాత్రం కారణం కాదు అన్నది దర్శకనిర్మాతల గట్టినమ్మకం. పెళ్ళయి ఇద్దరు పిల్లలు ఉన్న అమ్మకి నలభై లక్షలు ఇవ్వడం కన్నా ఆమెకన్నా యంగ్ హీరోయిన్లు ఇరవై లక్షలకే వస్తుండడంతో చాలా మంది మిగతావారి వైపు చూస్తున్నారు. దాంతో 'క్షణం' తరువాత అనసూయ ఇంత వరకూ ఏ సినిమాకీ సైన్ చేయలేదు. ఇప్పటికైనా పద్ధతి మార్చుకుంటే అవకాశాలు వస్తాయి లేకపోతే టీవీషోలకే పరిమితం కావలసి వస్తుందని సినీ జనాలు అంటున్నారు.

ఒక కామిక్ బుక్ చూడటం, టీవీలో సినిమా చూడటం, గార్డెన్లో పది నిమిషాలు కూర్చోవటం దేనికీ అనుమతించటం లేదుట. క్లాసుకీ, స్టడీ రూమ్‌కీ అతుక్కుపోవలసి వస్తోందని బాధపడింది. అన్నం సహించడం లేదనీ, ఈ చదువులూ చట్టుబండలూ ఎగ్గొట్టేసి పారిపోయి వచ్చేయాలన్పిస్తోందని పేర్కొంది.

కాని తన తండ్రి రూపాన్నీ, తన మీద పెట్టుకున్న ఆశల్నీ గుర్తుచేసుకుని భరిస్తున్నానంది. నిప్పుల మీద కూర్చున్నట్టూ, అమ్ములశయ్య మీద పవళించినట్టూ తన పరిస్థితి ఉందని వివరించింది.

చాలాచోట్ల అక్షరాలు అలుక్కుపోయాయి. బహుశా కన్నీటి బొట్లు రాలిపడి ఉండొచ్చు!

ప్రతి వాక్యంలో ప్రతి అక్షరంలో లలిత పడుతోన్న వేదన, అనుభవిస్తోన్న క్షోభ కళ్ళకు కడుతోంది. ఆ లేత వయస్సు పిల్లని అంత ఒత్తిడికి, నరక యాతనకి, టార్చర్‌కి ఎందుకు ఎందుకు గురి చెయ్యాలి? మెడిసిన్లో సీటు కోసమేనా? అదే అంతిమమా? దానితో సమానమైనవి, అంతకంటే విలువైనవి లేనేలేవా?

ఎందుకలా ఆలోచించరు? ఎందుకు శల్యసారధ్యం చేస్తారు?

"పద" ఒక నిర్ణయానికొచ్చి అన్నాను.

"ఎక్కడికే?" కీచుగొంతుతో అరిచింది రమ.

"కాలేజీ హాస్టల్‌కెళ్ళి లలితని తీసుకొచ్చేద్దాం"

"వచ్చే ఆదివారమే ఎగ్జామ్. సరిగ్గా అయిదు రోజులున్నాయంతే".

"ఏం ఫర్లేదు. ఇంటి దగ్గర చదువుకుని రాస్తుంది.

"మా నాన్నకి తెలిస్తే చంపేస్తారు".

"లలిత నీకు రాసిన ఈ ఉత్తరాలని మీ నాన్నకి చూపించావా?"

తల అడ్డంగా ఊపింది. "చూపిస్తే నన్ను, దాన్నీ చంపేస్తారు. నాన్నకి చెప్పుకోలేక నాకు రాసింది".

"చాలా పెద్దతప్పు చేశావు రమా. వీటిని చూసుంటే కూతురి క్షోభ అర్థమయ్యేది. ఏ తల్లీ ఏ తండ్రీ తమ పిల్లలు గానుగమరలో చెరకులా నలిగిపోతోంటే చూస్తూ కూర్చోరు. పద వెళ్దాం.." రమ రెక్క పట్టుకుని లాగాను.

"రభస అవుతుందే ప్లీజ్. ఈ గొడవ వదిలెయ్యవే" అర్థించింది.

"ఏమీ అవ్వకుండా చూసే పూచీ నాది. చెప్పేలా చెబితే అర్థం చేసుకోలేనంత మూర్ఖులు కాదు మీ పేరెంట్స్. కమాన్ రా చెబుతా.."

"వాళ్ళింటి గొడవలో మనం అనవసరంగా తల దూరుస్తున్నామేమోనే" ఇబ్బంది పడిపోతూ అంది ప్రాంజలి.

"ఇది వాళ్ళగొడవా వీళ్ళగొడవా కాదు. ఒక టీనేజ్ అమ్మాయి బతుకు భవిష్యత్తు".

మేడ మీంచి కిందికి దిగివచ్చి ఇంట్లో కెళ్ళాం.

"అంకుల్, మీతో కొంచెం మాట్లాడాలి. అర్జంట్.." తిన్నగా రమా వాళ్ళ నాన్న దగ్గరికెళ్ళి అన్నాను.

"రమ గురించా? లవ్‌ఎఫైర్ అయితే నాతో మాట్లాడక్కర్లేదు. నేను వాటికి బద్ధవ్యతిరేకిని" ముఖాన గంటు పెట్టుకున్నారు.

"లలిత గురించంకుల్"

"దానికేం, నిక్షేపంలా చదువుకుంటోంది. వెయ్యిలోపు ర్యాంక్ కొట్టడం ఖాయం. ఎంబీబీఎస్‌లో సీటు కొట్టడం డబుల్ ఖాయం. నీకు తెలుసో లేదో అది చదువుల సరస్వతి. ఇంటర్లో 99.1% తెచ్చుకుంది తెలుసా!

## మూడు కోట్లు వదులుకుంది!



ఇంత మొత్తం వదులుకుంది రింగుల జుత్తు బ్యూటీ తాప్సీ. చెన్నయ్‌కి చెందిన ఓ కంపెనీ తన వార్షికోత్సవం సందర్భంగా ఓ అరగంట డ్యాన్స్ చేస్తే మూడు కోట్లు ఇస్తామంటూ తాప్సీకి ఆఫర్ చేసింది. ఇంత మొత్తం అనేసరికి తాప్సీకి కూడా బోలెడంత ఆశ కలిగింది. అయితే ప్రస్తుతం తాప్సీ బాలీవుడ్‌లో రెండు సినిమాల షూటింగ్‌లతో బిజీగా ఉంది! వాటికి ఒక్కరోజు కూడా డుమ్మా కొట్టలేని పరిస్థితి. ఓ పక్క మూడుకోట్లు ఆశపెడుతున్నా, విధిలేని పరిస్థితుల్లో వాళ్ళకి 'సారీ' చెప్పాల్సి వచ్చిందట! అయినా ఆశ చావక ఇప్పటికీ ఓ రోజు షూటింగ్ బ్రేక్ కోసం ప్రయత్నిస్తూనే ఉందట!

గర్వంగా చెప్పారు. మీసాలు లేవు గాని ఉండి ఉంటే మెలేసేవారే.

"అద్సరే గాని ప్రస్తుతం తీవ్రమైన ఒత్తిడికి గురవుతోంది. అది ఎంత మాత్రం మంచిది కాదు.."

"అది అల్లాటప్పా చదువుకాదు. పోటీ చదువు. ఆ మాత్రం ప్రెజర్ ఉంటుంది. ఉండాలి. అప్పుడే రేయింబవళ్లు చదువుతారు".

"మీ కర్థమయ్యేలా ఎలాచెప్పాలో తెలీడం లేదు. డిప్రెషన్‌కి లోనవుతోంది అంకుల్..."

నా స్వరం హెచ్చేసరికి "నా బిడ్డకేవయ్యింది" అంటూ లోపల్నుంచి ఆందోళన పడుతూ వచ్చింది రమ తల్లి.

"ఈ పిల్లకాకుల మాటలకేంటే. చదువుల గురించి వీళ్ళకేం తెలుసనీ. ఊరికే టీ కప్పులో తుఫాను సృష్టించేస్తున్నారు. వీళ్ళని నేను పంపిస్తాను గాని నువ్వు లోపలికెళ్ళి వంట పని చూడు. త్వరగా ఇంత పిండాకూడు నా మొఖాన కొట్టు. అవతల ట్రెయిన్‌కి టైమవుతోంది. అరగంటలో బయల్దేరితే గాని అందుకోలేను." భార్యమీద కేకలేసి మా వంక విసుగ్గా అసహనంగా చూశారు.

"చూడమ్మాయ్. మా లలిత గురించి నాకు బాగా తెలుసు. ఎంత ఒత్తిడిపెడితే అంత శ్రద్ధగా చదువుతుంది. చిన్నప్పట్నుంచీ దాని పద్ధతంతే. కళ్ళాలు బిగించి ఉంచాను గనుకే టెన్త్‌లోనూ, ఇంటర్లోనూ అన్నేసి మార్కులొచ్చాయి. అందుకే నిన్నరాత్రి దానికి ఫోన్‌చేసి ఆఖరి అస్త్రం ప్రయోగించాను తెలుసా?"

ఎంతో తెలివైన అభినందనీయమైన పని చేసినట్టు ఫోజు కొడుతూ గర్వంగా నవ్వారు.

"ఏంచేశారు?" భయంతో నిలువునా కంపించి పోతున్నాను. రమ అయితే ఏకంగా ఏడుపు అందుకుంది. ప్రాంజలి గుటకలు మింగసాగింది.

"సీటొచ్చే ర్యాంకు తెచ్చుకోకపోతే ఇక తన మొఖం నాకు చూపించొద్దన్నాను. అదేమందో చెప్పనా? తప్పకుండా తెచ్చుకుంటానని ఒట్టు పెట్టుకుంది!"

"తప్పు చేశారంకుల్! చాలా పెద్దతప్పు... కాలిన పెనం మీద నీళ్ళు చిలకరించారు..!"

కన్నీళ్ళని అదుపు చెయ్యలేక తల్లకిందులైపోతూ లలిత రమకి రాసిన ఉత్తరాలని ఆయన చేతిలో పెట్టాను.

నా వంకా, రమ వంకా సందేహంగా చూసి వాటిని తిరగేశారు.

మేం గుండెల్ని ఉగ్గబట్టుకుని చూస్తోంటే ఆయన చప్పరించేశారు.

"వీటికోసం బెంబేలు పడిపోతున్నారా? మీరు నిజంగానే పిచ్చివాళ్ళు. మూడ్ బాగాలేనప్పుడు ఎవరైనా సరే తమ మనోభావాలు ఇతరులకు చెప్పుకుని మనస్సు తేలిక చేసుకోవాలనుకుంటారు. ఆ కాలేజీలో అలాంటివి చెప్పకూడదు. చెప్పినా ఎవరూ వినరు. కొందరు డైరీలో రాసుకుంటారు. మా లలిత, అక్కకి ఇలా లెటర్స్ రాసి గుండె భారం దించుకుంటోంది. ఇది ఒక రకమైన ఊరట. అవుట్ లెట్. ఇందులో కంగారు పడాల్సింది పిసరంత కూడా లేదు.."

విస్మితులమయ్యాం. వెర్రిగా చూశాం. ఈయనెలాంటి మనిషో అర్థం కాకుండా ఉంది!

"మీరు చూస్తూ ఉండండి. మీ కళ్ళముందే మా లలిత డాక్టరవుతుంది. రెండు చేతుల్తో సంపాదిస్తుంది. మంచి పేరు ప్రఖ్యాతులు తెచ్చుకుంటుంది. ఫలానా కుటుంబరావు గారి అమ్మాయి అవటాన్ని జనం చెప్పుకుంటారు. అప్పుడు మీ అందరికీ ఫ్రీ ట్రీట్‌మెంట్ ఇమ్మని మా లలితకి చెబుతాన్లే.." ఆనందోద్వేగంతో ఊగిపోతూ చెప్తూ పోతున్నారు.

మాకు నోట మాట రావట్లేదు. చేష్టలు దక్కి చూస్తుండిపోయాం.

గుమ్మంలో కొచ్చి ఆయన మాటలు విన్న రమ తల్లి కళ్ళ నిండా ఆనంద బాష్పాలు!

ఇంతలో ఆయన సెల్ మోగింది. మేం ఉలిక్కిపడ్డాం.

డిస్‌ప్లే వంక చూసి, 'నా మాట సత్యం. లలితా వాళ్ళ కాలేజీనుంచే ఫోన్..." అంటూ సెల్‌ని చెవికానించు కున్నారు.

కుటుంబరావుగారి ముఖంలో గబగబా రంగులు మారాయి. కన్నీళ్ళు వరద కట్టాయి. బోరున హోరున ఏడుస్తూ తల బాదుకుంటూ నేలమీద పడి దొర్లసాగారు. సెల్ చేజారిపోయింది.

ఘోరమేదో జరిగి ఉంటుందనుకుని ఆయన భార్య లబోదిబోమంది.

క్షణకాలం మ్రాన్పడిపోయాం. ఏదో తెలీని విషాదం మమ్మల్ని ఊపెయ్యసాగింది. మా భయాలు నిజమయ్యాయేమోనని వణికిపోయాం.

అదురుతున్న గుండెల్తో సెల్‌ని చేతుల్లోకి తీసుకున్నాను. లైను కట్టయింది. ఆ నెంబరుకే మళ్ళీ చేశాను.

"వాట్ హేపెన్డ్?"

"లలిత రాత్రి హాస్టల్ రూంలో ఫ్యాన్‌కి చున్నీ వేలాడదీసుకుని ఉరిబోసుకుంది"

కన్నీళ్ళు తుడుచుకునే ప్రయత్నం చేయకుండా,

"ఎనీ హోప్?" అడిగాను.

"అంతా అయిపోయింది..."

"సూసైడేనా లేక..!"

"సూసైడ్ నోట్ రాసింది. తనని చేసినట్టు ఏ విద్యార్థినీ భరించలేని ఒత్తిడికి గురి చేయొద్దని పేరెంట్స్‌కి విజ్ఞప్తి చేసింది. త్వరగా రండి. పోలీసులు శవాన్ని పోస్టుమార్టంకి తీసుకెళ్తామంటున్నారు.."

ఆ పైన నాకేమీ వినిపించలేదు.

"ఏడవండి. ఇంకా ఇంకా ఏడవండి. కుళ్ళికుళ్ళి ఏడవండి. జీవితాంతం కృంగి కృశిస్తూ ఏడవండి. లలిత ఎప్పటికీ ఎప్పటికీ మీకు తన ముఖం చూపించదు. ఎందుకో తెలుసా? మీరు దాని కలల్ని కసబిసా తొక్కేశారు. దాని బంగారుభవిష్యత్తు మీద యాసిడ్ పోసి తగుల బెట్టేశారు. ఒక చిన్నారి పొన్నారి బతుకుని, పచ్చని నిండు జీవితాన్ని మీ మూర్ఖత్వంతో బలి తీసుకున్నారు. అందుకే అందుకనే మీలాంటి తల్లిదండ్రుల ముఖాలు చూడదు.."

దుఃఖోద్ధృతిని కంట్రోలు చేసుకోలేక హిస్టీరిక్‌గా మారిపోయాను.

●●●

లలిత ఆత్మహత్య నన్ను షాక్‌కి, తీవ్ర మనస్తాపానికి గురి చేసింది.




పండంటి జీవితాన్ని చక్కగా పండించుకోక అత్యాశల వెంట, దురాశల వెంట ఎందుకు పరుగు పందాలు పెడతారో పెట్టిస్తారో అర్థం కాలేదు. దేవుడిచ్చిన బతుకుని అర్ధాంతరంగా ఎందుకు అంతం చేసుకుంటారో బోధపడలేదు.

నా ఆలోచనలు పుట్టడం ఏవిటి గిట్టడం ఏవిటి సాధించేదేవిటి కోల్పోయేదేవిటి అన్న ప్రశ్నల వైపు మళ్ళాయి. అక్కడ్నుంచి వేదాంతపు, వైరాగ్యపు భావనలు చుట్టుముట్టాయి.

ఒక రకమైన నైరాశ్యంలో కొట్టుకుపోయాను.

వారం పదిరోజుల దాకా ఎవరితోనూ కలవలేదు. గదిలోంచి బయటికి రాలేదు. ఏ విషయమూ పట్టించుకోలేదు.

నేను వేరు, నా లోకం వేరు అన్నట్టుగా ఉండిపోయాను. ఆఖరికి విహాన్ కాల్స్‌కి కూడా బదు లివ్వలేదు.

నా ధోరణి చూసి ఇంట్లో వాళ్ళంతా కలవరపడ్డారు. కంగారు పడ్డారు.

ప్రేమలో మోసపోయి ఉంటానని విశ్వసించారు. భయపడ్డారు.

"ప్రేమ పొద్దున్న పూసి రాత్రికి రాలిపోయే పువ్వులాంటిది. మర్నాటికి మరో కొత్తపూవు వస్తుంది. కొత్త ప్రేమ పుట్టు కొస్తుంది. దాని గురించి నువ్వు మదన పడొద్దు. మనికి ఏది దక్కితే దాన్ని స్వీకరించి ఆనందించడం తృప్తిపడటం నేర్చుకోవాలి..' అంటూ పాఠం చెప్పింది అమ్మ.

"మగాళ్ళంతా మాయగాళ్ళే. మోసగాళ్ళే. అందే వరకూ చుట్టూ కుక్కలా చొంగ కార్చుకుంటూ తిరుగుతారు. అందకపోయినా, ఇంకో కొత్తబొమ్మ కన్పించినా విదిలించేస్తారు. వాళ్ళని సీరియస్‌గా తీసుకోకు. నీకేంటే బంగారు బొమ్మవి. నీకోసం కుబేరుడో, కుబేరుడి కొడుకో దిగి వస్తారు" లెక్చరిచ్చింది వదిన.

"బోల్డ్‌లైఫ్ ఉండగా ఇప్పుడీ ప్రేమ గోలేంటీ. ఆ జ్ఞాపకాల్ని తుడిచిపారెయ్" అన్నాడు అన్నయ్య చాలా ఈజీగా.

"ఎదురు దెబ్బలు తగుల్తుంటాయి మరి. మోసగాళ్ళు కొట్టేవి మరింత బాధిస్తాయి. మరచిపోవాలి. అంతా మన మంచికే అనుకోవాలి. నీ కంపెనీ వెబ్‌సైట్ డిజైన్ చూశాను. చాలా బాగా చేయించావు. ఫీచర్లు బావున్నాయి. మిగతా పనులు స్టార్ట్ చెయ్" ఉత్సాహ పరచాలని చూశారు నాన్న.

వారి అభిమానానికి కరిగిపోయాను. జరిగిందంతా వివరించాను.

తేలిగ్గా విశ్వసించారంతా.

కాని జరక్కూడనిదేదైనా జరిగితే నేను సూసైడ్ చేసుకుంటానేమోనని బెదిరారు. విచిత్రంగా అందరి ప్రవర్తనల్లోనూ మార్పువచ్చింది. ఇదివరకెప్పుడూ లేనంత ప్రేమ ఒలకబోస్తున్నారు.

మెల్లగా ఆ విషాదపు 'షెల్' లోంచి బయట పడ్డాను. మునుపటి విజ్జీనయ్యాను.

"విజితా! ఆ మధ్య నువ్వు ఎవరో సెక్యూరిటీ అతన్ని ఇష్టపడ్డాననో ఇష్టపడుతున్నాననో చెప్పావుగా. ఇప్పటికీ ఆ ఇష్టం అలాగే ఉందా మారిందా!" భోజనాల బల్ల దగ్గిర నాన్న ప్రశ్నించారు.

తెల్లబోయాను. రోషం పొడుచుకొచ్చింది.

"అతడు సెక్యూరిటీ గార్డు కాదు. ఒకప్పుడు బౌన్సర్. నిన్న ఆర్జే. ఇవాళ టీవీ యాక్టర్!"

'బతకడానికెన్నో చేస్తుండాలి. తప్పుదుకదా. ఇంతకీ నా ప్రశ్నకి సమాధానం ఇవ్వలేదు".

"ఇది వరకుకన్నా ఎక్కువ ఇష్టపడుతున్నాను".

"సరే, అయితే మేం కూడా ఇష్టం పెంచుకుంటాం. రేపో ఎల్లుండో లంచ్‌కి పిలిచి మాకు పరిచయం చెయ్యి..."

నాన్న కూల్‌గా చెప్పేసరికి నా చెవుల్ని విశ్వసించలేకపోయాను. చేతిమీద గిల్లుకుని చూశాను. అయినా ఇంకా సందేహ శకలం మిగిలే ఉంది.

"మీరు.. మీరు నిజంగానే అంటున్నారా డాడీ??" ఒళ్ళంతా చిత్రమైన భావనతో పులకించిపోతోంటే అడిగాను. మనస్సు బృందావనమై చిందులేస్తోంది!

అమ్మ, వదిన కూడా స్థాణువులై చూశారు. అన్నయ్య అభావంగా ఉండిపోయాడు.

"ఇది జోక్ చేసే విషయమా. మీరు మా మాట వినరు. మేమే మీ దార్లోకి రావాలి. మీ ఆనందం కోసం వచ్చేస్తాం".

ఏదోనాటికి ఒప్పుకుంటారనుకున్నాను గాని ఇంత త్వరగా ఓకే చెబుతారని ఊహించలేదు. అదీ తనంతట తాను ప్రసక్తి తెచ్చి, బహుశా లలిత ఘటన ప్రభావం చూపిందేమో. ఏమైతేనేం మేం లక్కీ!

"థాంక్యూ డాడ్ థాంక్యూ..." భోం చేస్తున్న సంగతి మరచి నాన్న అన్నం చేతిని చేతిలోకి తీసుకుని గుంజేశాను.

"మరీ ఇంత సంబరమా. కాస్త పెళ్లి దాకా అట్టిపెట్టు..." నవ్వారు.

"ఓ... యూ ఆర్ గ్రేట్ డాడ్. మా డాడీ గ్రేట్...!" మళ్ళీ చిన్న పిల్లనై నాన్న జుట్టు చెరిపేశాను. ఆ పైన అన్నం ముద్ద పెట్టమని మారాం చేస్తూ నోరు తెరిచాను.

"అల్లరి పిల్ల" అంటూ ఓ ముద్ద నా నోట్లో పెట్టారు.

"ఇది అమృతమే డాడీ. ఇక నేను దేవకన్యని" పరమానంద పడిపోతూ అన్నాను.

నాన్న మురిసిపోయారు. "యా. అమృతం తాగిన ఏకైక మనిషిని".

"మీ నాన్న తత్వమే అంత. నచ్చితే అమృతం, నచ్చకపోతే కోలాహలం. ఎప్పుడేది ఎవరికి పంచుతారో ఆయనక్కూడా తెలీదు" నవ్వుతూ అంది అమ్మ.

ఇంకా ఏదో అనబోయింది గాని నాన్న చురుగ్గా చూసేసరికి గమ్మునుండి పోయింది.

"విహాన్‌ని రేపు పిలిచేస్తాను డాడీ, మీరు ఫ్రీయేనా?"

"ఆలస్యం అమృతం విషం అన్నారు. పిలిచెయ్".

నా గదిలోకి పరుగెత్తుకెళ్ళి విహాన్‌కి ఫోన్ చేశాను.

"షూటింగులో ఉన్నాను. తర్వాత మాట్లాడతాను.." అతి నెమ్మదిగా చెప్పాడు.

"నువ్వేం మాట్లాడొద్దు. నేను చెప్పేది విను చాలు. మా డాడీ గ్రీన్ సిగ్నల్ ఇచ్చేశారోచ్"

"ఈజిట్!"

"యస్ ఇటీజ్. నువ్వు రేపు మా ఇంటికి లంచ్‌కి వస్తున్నావు. దట్సాల్" అని చెప్పి లైన్ కట్ చేశాను.

సంతోషం పట్టలేక పురివిప్పిన మయూరి నయ్యాను. మామిడి చిగురు తిన్న కోయిలనయ్యాను. సందెకాడ కొండ గాలినయ్యాను. పున్నమి నాటి సంద్రమయ్యాను.

ఆడాను. పాడాను. చిందులేశాను.

సృష్టిలోని ఆనందమంతా నా బాహువుల మధ్య ఇమిడి పోయినట్టు అనుభూతిస్తూ ఆనందోద్విగ్నమై ఉప్పొంగి పోయాను.

సేదదీరాక ప్రాంజలికీ రమకి, సుధకీ ఇతర స్నేహితులకీ ఫోన్లు చేసి చెప్పాను. మా డాడీది ఎంత పెద్ద మనస్సో, ఎంత గ్రేట్ పర్సనో ఏకరువు పెట్టాను.

నేను, విహాన్ కలిసి ఉన్న ఫోటోని ఫేస్‌బుక్, వాట్సాప్‌లో పేస్ట్ చేసి 'కాబోయే నా శ్రీవారు' అని క్యాప్షన్ పెట్టాను.

క్షణక్షణానికీ లైక్‌లు హనుమంతుడి తోకలా పెరిగి పోతుంటే ఎవరెస్ట్ ఎక్కినట్టు ఫీలయ్యాను.

ఇది నా జీవితంలో మధురమైన రోజు!

**(ఇంకా వుంది)**



# మల్లెల మాధుర్యం

**మల్లెపువ్వును చూస్తే మగువ కురులు దాసోహం చేస్తాయి. నిండు పున్నమి జాబిలి సైతం మల్లెల అందాల ముందు వెలవెల బోతుంది. ఆ పరిమళానికి లోకం సలాం చేస్తుంది.**

తొలివలపు గిలిగింతల్ని తలపించే కుసుమాలు మల్లెలు. మధురమైన ఆ పరిమళం సోకగానే మది సన్నాయి గీతం ఆలపిస్తుంది. మోహన రాగం పలికిస్తుంది. వలపు వాన కురి పిస్తుంది. అతివలను మురిపించే మల్లెపువ్వుకు కవులేనాడో పట్టం కట్టేశారు. మల్లెపువ్వు మన మనసులను రంజింపజేయడమే కాదు, మల్లెలకు భౌతిక, మానసిక వైద్య ప్రయోజనాలెన్నో ఉన్నాయి ఆవేంటో ఓ లుక్కేద్దామా!

## వేసవిలో ప్రకృతి వరం

మండు వేసవిలో మల్లెలే మనసును మురిపించే సాధనాలు. పగలంతా ఎండ వేడిమితో నరకం చూసే మగువలకు పొద్దుకుంగే సమయానికి తెల్లని మల్లెల మాలలు మైమరపించే ఆ పరిమళాలనందిస్తాయి. దాన్ని ఆస్వాదిస్తూంటే, ఆహా! స్వర్గమంటే ఇదేకదా అనిపిస్తుంది.

## సౌందర్య సాధనం

మగువల కురులెప్పుడూ మల్లెలకు దాసోహమే! మల్లెల శోభ మరే పూలతోనూ సాధ్యం కాదంటారు. మల్లెలు కేవలం ఓ సౌందర్య సాధనమే కాదు, కురులకు ఎంతో మేలు చేస్తాయి.

రోజంతా శ్రమ చేసి అలసిన కనురెప్పలపై కొద్దిసేపు మల్లెపువ్వులు ఉంచితే కంటికి చలువనిస్తాయి.

ఎండిన మల్లెలు, కాసిని మెంతులు కలిపి నూరి ఆ చూర్ణాన్ని తలకు పట్టిస్తే చుండ్రు సమస్య తగ్గడమే కాదు, జుట్టు కూడా పట్టుకుచ్చులా మెరిసిపోతుంది.

మల్లెపువ్వులను కొబ్బరినూనెలో వేసి రాత్రంతా నానబెట్టి, ఆ తర్వాత బాగా మరగబెట్టి తలకు పట్టిస్తే కేశాలు ఆరోగ్యంగా ఉండటమే కాదు, మాడుకు చల్లదనాన్నిస్తుంది.



మల్లెపూలను ఫేస్‌ప్యాక్‌గా కూడా వాడుకోవచ్చు. మల్లెపువ్వులను పేస్టుగా చేసి కొద్దిగా పాలు కలిపి, నెమ్మదిగా మసాజ్ చేసుకోవాలి. ఆ తర్వాత ముల్తానా మట్టి, గంధం, తేనె అరచెంచా చొప్పున కలిపి ప్యాక్ వేసుకోవాలి.

మల్లెపూల రసం తీసి, గులాబీ పువ్వుల రసం, గుడ్డులోని పచ్చసొన రెండేసి చెంచాల చొప్పున కలిపి ముఖానికి రాస్తే ముఖం మృదువుగా కాంతిమంతంగా మెరిసిపోతుంది.

## ఆరోగ్యానికి ఎంతో మేలు

మల్లెపూలలో విటమిన్ సి పుష్కలంగా ఉంటుంది. అందువల్ల పలు ఔషధాలలో మల్లెపువ్వులు వాడుతున్నారు.

### జాస్మిన్ టీ

చైనా, జపాన్లో జాస్మిన్ టీ చాలా పాపులర్. మరగబెట్టిన నీళ్లలో తాజా మల్లెమొగ్గలు, ఒక చెంచా టీపొడి వేసి ఓ ఐదు నిమిషాలు ఉంచాలి. తరువాత దాన్ని వడకట్టి పటికబెల్లం లేదా తేనె వేసుకుని తాగవచ్చు. రక్తంలో చక్కెర శాతాన్ని అదుపులో ఉంచుతుంది జాస్మిన్ టీ. మధుమేహ వ్యాధిగ్రస్తులకు ఈ టీ ఎంతో మంచిది. రక్తంలో కొలెస్ట్రాల్‌ను అదుపులో ఉంచుతుంది. అందువల్ల హృద్రయ సంబంధ వ్యాధులను, పక్షవాతాన్ని రానీయదు. వ్యాధినిరోధక శక్తిని పెంచుతుంది. లావు తగ్గాలనుకునే వారికి ఈ టీ ఎంతో మంచిది. జాస్మిన్ టీ నోట్లో పోసుకుని పుక్కిలిస్తే చిగుళ్ళ వ్యాధులు, దంతక్షయం రాకుండా కాపాడుతుంది. జలుబు, దగ్గు, అలర్జీల నుంచి ఉపశమనం కలుగుతుంది.

మల్లెపూల వాసన నాడీవ్యవస్థ మీద ప్రభావం చూపుతుంది.

శృంగారపరమైన కోర్కెలను పెంచుతుంది.

కండరాల నొప్పులు, కీళ్ళ నొప్పులను తగ్గిస్తుంది.

మొటిమల వల్ల వచ్చే మచ్చలకు మల్లె నూనె రాస్తే మచ్చలు చర్మం రంగులో కలిసిపోతాయి.

మల్లెల సువాసన నిద్రలేమిని దూరం చేస్తుంది.

## డిప్రెషన్ దూరం

అరోమాథెరపీలో, ఆయుర్వేదంలో మల్లెపూలను విరివిగా ఉపయోగిస్తారు. మానసిక ఆందోళనలు తగ్గిస్తుంది. జాస్మిన్ నూనెను లావెండర్ ఆయిల్‌తో కలిపి మసాజ్ చేసుకుంటే శరీర అలసటను తొలగించటమే కాక, డిప్రెషన్‌ను దూరం చేస్తుంది.

జాస్మిన్ ఆయిల్‌ను స్వీట్ ఆరెంజ్ ఆయిల్, బాదం నూనెతో కలిపి శరీరమంతా మసాజ్ చేస్తే స్ట్రెస్ నుంచి రిలీఫ్ రావడమే కాకుండా ఆలోచనలు పదునెక్కుతాయి. అంతేకాదు, సానుకూల దృక్పథం కూడా ఏర్పడుతుందని చెబుతున్నారు అరోమా థెరపిస్టులు. మల్లెలు మైండ్‌నీ, ఫీలింగ్స్‌నీ ఆహ్లాదంగా ఉంచటానికి తోడ్పడతాయి.

## రొమాంటిక్ సెన్స్

శోభనం గదిని ప్రత్యేకంగా మల్లెలతో అలంకరిస్తారు. కారణం మల్లెల సువాసనలు రొమాంటిక్ భావాలను పెంచుతాయి. జాస్మిన్ నూనెకు శృంగార సమస్యలను తొలగించే గుణం ఉంది. మల్లెపూలు నీటిలో వేసుకొని గంట తర్వాత స్నానం చేస్తే హాయిగా ఉంటుంది. శరీరం మల్లెసువాసనలతో గుబాళిస్తుంది.

-లక్ష్మీనర్మద




**అన్న రావణుడు బహిష్కరించడంతో లంకను వదలివేశాడు విభీషణుడు. తన నలుగురు మంత్రులతో ఆకాశమార్గాన ప్రయాణించి, రామదండు విడిది చేసిన దక్షిణ సముద్రతీరానికి చేరుకున్నాడు. అక్కడ ఆకాశంలోనే నిలబడి వానరవీరులను శరణు కోరాడు. తన రాకను రామునికి తెలియజేయమన్నాడు. విభీషణుని రాకను తెలియజేసి, అతని శరణు వెనుక అనేక అనుమానాలను వ్యక్తపరిచారు వానరప్రముఖులు. హనుమ అందుకు భిన్నంగా మాట్లాడాడు. విభీషణునికి అభయం ఇవ్వడంలో ప్రమాదం లేదన్నాడు. అయితే తుది నిర్ణయం రామునిదే అన్నాడు.**

అంగీకరించలేనట్టుగా తల అడ్డంగా ఊపాడు సుగ్రీవుడు. అసహనంగా అన్నాడిలా.

"విభీషణుడు చెప్పేది ఎంత మాత్రమూ నాకు నమ్మబుద్ధి కావట్లేదు రామా! అతడు ముమ్మాటికీ రావణుని గూఢచారి అనే నా నమ్మకం. త్వరపడి ఆశ్రయం కల్పించామో అది విపరీత పరిణామాలకు దారి తీస్తుంది. అంటున్నానని మరోలా అనుకోకపోతే... మనం అంతా నిద్రపోతున్న వేళ ఆ విభీషణుడు నిన్నో, నన్నో, లేదంటే లక్ష్మణుణ్ణో పొట్టన పెట్టుకున్నా పెట్టుకుంటాడు. ఇదే అతని ఆలోచన అని నాకు గట్టిగా తోస్తోంది. అందుకని..."

"అందుకని?"

"ఆ నలుగురుమంత్రులు సహా విభీషణుణ్ణి సంహరించడం ఉత్తమం అని నా అభిప్రాయం." అన్నాడు సుగ్రీవుడు.

తప్పు అన్నట్టుగా కుడి చేతి చూపుడువేలుని పెదవులకు ఆనించాడు రాముడు. ఎంతసేపూ

# రాముని అభయం:రావణుని బలసంపత్తి

సుగ్రీవుడు, అంగదుడు, జాంబవంతుడు, మైందుడు, శరభాదులు వ్యక్తం చేసిన అభిప్రాయాలన్నిటినీ ఒకటికి పదిసార్లు గుర్తు చేసుకున్నాడు రాముడు. అలాగే హనుమ అభిప్రాయాలను కూడా ఆకళించుకున్నాడు. ఆ తర్వాత శరణాగత రక్షణపై పూర్వీకుల అభిప్రాయాలను కూడా జ్ఞప్తికి తెచ్చుకున్నాడు. తెచ్చుకుని ఓ దృఢ నిశ్చయానికి వచ్చాడు రాముడు. అప్పుడిలా అన్నాడు.

"మిత్రులారా! నా హితం కోరి, విభీషణుని గురించి మీ మీ అభిప్రాయాలను తెలియజేసినందుకు కృతజ్ఞుణ్ణి. ఇప్పుడు నా అభిప్రాయం కూడా దయచేసి వినండి.

నన్ను నమ్మి, శరణు కోరితే వారెక్కడ ఉన్నా వెతికి మరీ రక్షించడం నా అలవాటు. అలాంటిది నన్ను సమీపించి, నా శరణు కోరిన వ్యక్తిని నేను కాదనలేను. శరణు వేడిన వ్యక్తి సన్మార్గుడా? దుర్మార్గుడా? అన్నది నేను ఆలోచించను. శరణు వేడాడు. కాపాడడం నా బాధ్యత అనుకుంటాను."

సాహసోపేతమైన రాముని నిర్ణయానికి సుగ్రీవుడు ఆందోళన చెందాడు. పొంచి ఉన్న ప్రమాదాన్ని మిత్రుడు గ్రహించడం లేదని బాధ పడ్డాడు. కళవళంగా అన్నాడిలా.

"రామా! పెను ప్రమాదాన్ని ఎదుర్కోబోతున్న అన్నను విడిచి విభీషణుడు వచ్చాడిక్కడికి. అన్నకే సహకరించని వాడు, మనకు సహకరిస్తాడంటావా? అడిగాడని చూస్తూ చూస్తూ ఓ రాక్షసుణ్ణి చేరదీస్తావా? అభయం ప్రసాదిస్తావా? వద్దు రామా! వద్దు."

సుగ్రీవుని ఆందోళన వెనుక గల స్నేహ బంధాన్ని గమనించాడు రాముడు. అందుకు ఆనందించాడు. గర్వంగా నవ్వాడు. అన్నాడిలా.

"మిత్రమా! విభీషణుని శరణు వెనుక నాకు తోచిన కారణాలు నాకు ఉన్నాయి. వాటిని చెబుతాను విను.

సాధారణంగా రాజులు పొలిమేరలలోని ఇతర రాజులను శత్రువులుగా భావిస్తారు. అది అవకాశంగా తీసుకునే ఆ రాజుల దాయాదులు శత్రు రాజులను ఆశ్రయిస్తారు. విభీషణుడు నన్ను శరణు వేడడంలో ఇది ఒక కారణం. రెండో కారణం కూడా చెబుతాను విను. సహజంగా రాజులు, మంచి వారైన, తెలివైన దాయాదులను గౌరవిస్తారు. అయితే అధికారం చేజిక్కిన తర్వాత వారిని అంతగా గౌరవించరు. పైగా ఆ దాయాదులను అణగదొక్కేందుకు ఎక్కువగా ప్రయత్నిస్తారు. రావణుడు ఈ కారణంగానే విభీషణుణ్ణి బహిష్కరించాడని నా అనుమానం."

రాముని తర్కం బాగానే ఉంది. అయినా విభీషణుడు అనుమానాస్పదుడేనన్నది సుగ్రీవుని నమ్మకం. ఆ భావం అతని కళ్ళల్లో ప్రతిఫలించడాన్ని గుర్తించాడు రాముడు. అడిగాడిలా.

"రాక్షసుల్లో మాత్రం దూరదృష్టి కలవారు ఉండరా మిత్రమా? హనుమ చెప్పినట్టు విభీషణుడు రాజ్యం కోరి మనల్ని ఆశ్రయిస్తున్నాడేమో! చూద్దాం... రానీ! కలవనీ ముందు."

**శరణుజొచ్చిన విభీషణుడు, అతడి నలుగురు మంత్రులకు అభయం ప్రకటించాలన్న రాముని అభిప్రాయంతో విభేదించాడు సుగ్రీవుడు. వారిని సంహరించడమే ఉత్తమం అని అన్నాడు. విభీషణుడే కాదు, అతని రూపంలో ఉన్న రావణుడైనా శరణుజొచ్చినవానికి నేను అభయం ప్రకటించానని చెప్పు అన్నాడు రాముడు. అందుకు సుగ్రీవుడు సమ్మతించాడా? లేక స్నేహధర్మానికి విరుద్ధంగా ప్రవర్తించాడా?**

మిత్రధర్మంతో తన మీద ప్రేమతోనే సుగ్రీవుడి ఆలోచన సాగుతోంది. ఒక వైపుగానే ఆలోచిస్తున్నాడతను. రెండో వైపు ఆలోచించట్లేదనుకున్నాడు రాముడు. సుగ్రీవుణ్ణి ఒప్పించేందుకు ప్రయత్నించాడిలా.

"మిత్రమా! విభీషణుడు దుష్టుడైనా కాకపోయినా ఏమరపాటు లేక నిద్రిస్తున్న నన్నుగానీ, నా వారినిగానీ అతడేమీ చెయ్యలేడు. నేను ప్రగల్భాలు పలకడం లేదు. నేనే గనుక తలచుకుంటే... ఈ విశ్వంలోని దేవ యక్ష రాక్షస దానవ పిశాచ గణాలన్నిటినీ ఒక్క నిముషంలో హతమార్చగలను."

"రామా" చేతులు జోడించి నమస్కరించాడు సుగ్రీవుడు.

"నాకు ఆ సంగతి తెలుసు." అన్నాడు.

"శరణాగత రక్షణ గురించి కణ్వమహర్షి కుమారుడు కండుడు ఏమన్నాడో తెలుసా?" అడిగాడు రాముడు. చెప్పసాగాడిలా.

"దీనుణ్ణి. రెండు చేతులూ జోడించి నమస్కరించి శరణు వేడుతున్నాను, రక్షించండి అంటే... శత్రువునైనా క్షత్రియుడు కాపాడి తీరాలి. అతని కోసం ప్రాణాలు అర్పించాలి. అర్పించనిపక్షంలో ఆ క్షత్రియుడు మహాపాపాత్ముడౌతాడు. అంతేకాదు ఇహలోకంలో వీర్య విక్రమాలు నశించి, దుష్కీర్తిని మూటగట్టుకుని, పరలోకంలో నానా హింసలూ అనుభవిస్తాడు." అన్నాడు రాముడు.

అయ్యయ్యో అని ఆందోళన చెందాడు సుగ్రీవుడు. ఆ భావాన్ని లెంపలు వేసుకుని వ్యక్త పరిచాడు.

"కండుడి ప్రబోధాన్ని అనుసరించే నేను విభీషణునికి అభయం ఇస్తున్నాను." అన్నాడు రాముడు.

"ఈ ధర్మానికి కట్టుబడిన ఓ పక్షిగాథ కూడా వినిపిస్తాను. విను." అన్నాడు సుగ్రీవునితో. చెప్పసాగాడిలా.

"తన పెంటిని వలపన్ని పట్టుకున్న కరకు బోయవాణ్ణి ఆదుకున్న ఓ మగపావురం కథ ఈనాటికీ నన్ను ప్రభావితుణ్ణి చేస్తోంది. వానలో తడిసి,



చలికి వణకిపోతూ మగపావురం ఉన్న చెట్టు దగ్గరగా వచ్చి నిలిచాడు బోయ. తన పెంటిని పట్టుకున్న వేటగాడని అతన్ని అసహ్యించుకో లేదు పావురం. పైగా అతన్ని అతి థిగా భావించింది. అతని కోసం కట్టెలు రగిల్చి మంటను చేసింది. కాచుకుని చలిబాధను తీర్చు కున్నాడు బోయ. ఆకలి అన్నాడు. ఆకలి బాధను తీర్చేందుకు అగ్నిలో దూకి అతనికి ఆహారమైంది.

చిన్న పక్షి, ఒకనొక పావురమే శరణాగత రక్షణకు ఆత్మత్యాగం చేయగా లేనిది, ఇక్ష్వాకుల వంశంలో పుట్టి, దశరథమహారాజు కొడుకునై ఉండి, ధర్మరక్షణకు పాటు పడుతున్న నేను, శరణన్న వాణ్ణి కాదని పొమ్మన లేను. అది నాకు బాధాకరం."

"మిత్రమా" జలదరించాడు సుగ్రీవుడు. రాముని వ్యక్తిత్వానికి వణకిపోయాడు.

"ఒక్కమాట చెబుతాను విను సుగ్రీవా! ఎవరైనా సరే! నీ వాణ్ణి అంటూ నన్ను ఒక్కసారి శరణు కోరితే అతన్ని అనుక్షణం రక్షించడం నా వ్రతం. విభీషణునికి నేను అభయం ప్రకటించడం నీకు ఇష్టం లేకపోవచ్చు. కాని ప్రకటించకుండా ఉండలేని నా బలహీనతని క్షమించు." అన్నాడు రాముడు. సుగ్రీవుని చేతులు పట్టుకున్నాడు. విల విల్లాడిపోయాడు సుగ్రీవుడు. రామా రామా అంటూ రాముణ్ణి గట్టిగా కౌగిలించుకున్నాడు. అతని వెన్ను నిమిరాడు. కాసేపటికి తేరుకున్నాడు సుగ్రీవుడు. చేతులు కట్టుకుని నిలిచాడు. తాను తెలియజేసిన ప్రమాణాలనీ, తన ప్రతిజ్ఞావ్రతాన్నీ ఆకళించుకుని సుగ్రీవుడు ఎలాంటి అనుమానాలకూ లోను కావట్లేదని గ్రహించాడు రాముడు. సన్నగా నవ్వాడు. చెప్పాడిలా.

"మిత్రమా! చర్చోపచర్చలతో ఇప్పటికే కాలాతీతం అయింది. ఇక ఏమాత్రం ఆలస్యం కూడదు. స్వయంగా నువ్వే వెళ్ళి విభీషణునికి నేను అభయం ప్రకటించానని తెలిపి తీసుకుని రా."

అయినా కదల్లేదు సుగ్రీవుడు. ఏదో అనుమానం అతన్ని ఇంకా తొలుస్తున్నట్టుగా నిల్చున్నాడు. గమనించాడది రాముడు. అన్నాడిలా.

"అతను విభీషణుడు కాదు, ఆ రూపంలో ఉన్న రావణుడైనా నేను అభయం ప్రకటించానని చెప్పు. వెళ్ళు! వెళ్ళి తీసుకుని రా."

ఆ మాటలకు నిలువునా కదలిపోయాడు సుగ్రీవుడు. కరగిపోయాడు. చేతులు రెండూ జోడించి నమస్కరించాడు రాముడికి.

"ధర్మమూర్తీ! రామప్రభో! లోకంలో ధర్మరక్షణకే నువ్వు జన్మించావు. ధర్మరక్షణకోసమే రాజ్యాన్నీ, సర్వసౌఖ్యాలనీ వదులుకున్నావు. నీ మాటలు నన్నే కాదు, ఇక్కడున్న వానరవీరులందరినీ ఆశ్చర్య చకితుల్ని చేస్తున్నాయి.

రామా! విభీషణుడు దుష్టుడు కాదనీ, పరిశుద్ధుడనీ నా అంతరాత్మ నాకు ఇప్పుడు చెబుతోంది. అతని ముఖంలోనూ, కళ్ళల్లోనూ, గొంతులోనూ ఎందులోనూ వంచన ఛాయలు లేవు. నేటి నుండి అతను మన సఖుడు. మనతో సమానుడు. మనలో ఒకడు." అన్నాడు సుగ్రీవుడు.

మెచ్చుకోలుగా చూశాడతన్ని రాముడు.

"ఇదిగో! ఈ క్షణమే అతన్ని నీ దగ్గరకు తీసుకుని వస్తున్నాను." అన్నాడు సుగ్రీవుడు. ఆకాశం వైపు చూశాడు. ఎగిరి మంత్రులసహా విభీషణుడు నిలిచిన స్థలానికి చేరుకున్నాడు. వారిని ఆహ్వానిస్తూ అన్నాడిలా.

"విభీషణా! నీకూ, నీ మంత్రులకూ రాముడు అభయం ప్రసాదించాడు. రండి."

కిందికి మంత్రులసహా నడచి వస్తున్న విభీషణునికి ఎదురేగాడు రాముడు. వారిని ఆహ్వానిస్తున్నట్టుగా చేతులు జాచాడు. పరుగున వచ్చి రాముని కౌగిలిలో ఒదిగిపోలేదు విభీషణుడు. భక్తిగా శిరస్సు వంచి పాదాభివందనం చేశాడతనికి.

"రామా! అన్న చేసిన పరాభవం భరించలేక ఆస్తుల్నీ, ఆప్తుల్నీ వదులుకుని, నిన్ను శరణు వేడాను. ప్రభూ! నువ్వు గాక నాకు వేరు దిక్కులేదు. నా జీవితాన్ని నీ అధీనం చేస్తున్నాను. నీ ఇష్టం. నన్ను పాల ముంచినా నీట ముంచినా అది నీ ప్రసాదంగానే భావిస్తాను." అన్నాడు విభీషణుడు.

వంగి, విభీషణుని భుజాలు పట్టి, అతన్ని లేవనెత్తాడు రాముడు. సమీపంగా కూర్చోబెట్టుకున్నాడు. అతిథిమర్యాదలు చేశాడు. అప్పుడు అడిగాడు.

"విభీషణా! రావణుడు, అతని ఆప్తుల బలాబలాలు గురించి మాకు తెలియజెయ్యి. ఇప్పుడది అత్యవసరం."

"తప్పకుండా" అన్నాడు విభీషణుడు. చెప్పాడిలా.

"రామా! రావణునికి నరులన్నా, వానరులన్నా భయం లేదు. అందుకు వారిని మినహాయించి, సకల భూతకోటితో చావులేకుండా బ్రహ్మదేవుడి నుండి వరాన్ని పొందాడు.

రావణుని తర్వాతి వాడు కుంభకర్ణుడు. నాకు చిన్నన్న. మహాపరాక్రమవంతుడు. ఇంద్రుని ఎదిరించిన వీరుడు.

రావణుని పెద్ద కొడుకు ఇంద్రజిత్. అతను తండ్రితో సమానమైనవాడు. సమానవిక్రమం కలిగిన వాడు. అతని కవచాన్ని ఛేదించడం అసాధ్యం. అతను ఆకాశంలో ఎవరికీ కనబడకుండా యుద్ధం చేయగల సమర్థుడు. అంతేకాదు, ఆ పరాక్రమశాలి యుద్ధసమయంలో వరశక్తితో అగ్నిదేవుణ్ణి ఆరాధిస్తాడు. ఆరాధించి ఆతని కరుణతో రథ పతాక ధనుస్సులను అందుకుని అజేయంగా నిలుస్తాడు.

ఇక రావణుని సైన్యాధ్యక్షుడు ప్రహస్తుని గురించి నేను ప్రత్యేకించి చెప్పనవసరం లేదు. అతని గురించి హనుమ ఈపాటికి మీకు చెప్పే ఉంటాడు. కైలాసంలో కుబేరుని సేనాపతిని ఓడించిన శూరుడతడు. వీరితో పాటు మహోదర, మహాపార్శ్వ, అకంపనులనే సేనాపతులు దిక్పాలకులను జయించిన వారు. అలాగే కామరూపులూ, పరాక్రమవంతులైన రాక్షసులు లంకలో లక్షల మంది ఉన్నారు."

విభీషణుడు చెప్పిన ప్రతి మాటనీ, పేరునీ గుండెల్లో లిఖించుకున్నాడు లక్ష్మణుడు. సుగ్రీవుడు కంఠపాఠం చేశాడు. మిగిలిన వానరవీరులు కూడా రావణుని బలాబలాలు గురించి స్పష్టంగా తెలిసిన వారై ఊపిరి పీల్చుకున్నారు.

-అరణి




మే 11 నుంచి
మే 17 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



### మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

ఇంక్రిమెంట్లు, పెట్టుబడులు, విద్యా విషయాలు, ప్రేమానుబంధాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం ఇంటి అవసరాల కోసం నిధులు సర్దుబాటవుతాయి. 12,13,14 తేదీల్లో పొదుపు పథకాలు లాభిస్తాయి. ప్రియతముల కోసం ఖర్చులు అధికం. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 15,16 తేదీల్లో వైద్యం, పరిశ్రమలు, సేవల రంగాల వారికి శుభప్రదం. వృత్తి, వ్యాపారాల్లో అదనపు ఆదాయం సమకూరుతుంది. విందుల్లో పాల్గొంటారు. 17న ఆర్థిక అంశాలకు సంబంధించిన సమావేశాలు ఫలిస్తాయి. శ్రీవారు, శ్రీమతి వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది.



### వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

బదిలీలు, మార్పులు, వృత్తి, వ్యాపారాలు, పెట్టుబడులకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధవారం విద్యార్థులు లక్ష్యాలు సాధిస్తారు ఒక సమాచారం ఉల్లాసం కలిగిస్తుంది. 12,13,14 తేదీల్లో బదిలీలు, మార్పులు చేర్పులు అసౌకర్యం కలిగిస్తాయి. రియల్ ఎస్టేట్, రిటైల్ రంగాల వారికి శుభప్రదం. ఇంట్లో శుభ పరిణామాలు సంభవం. 15,16 తేదీల్లో ప్రేమానుబంధాలు బలపడతాయి. పెట్టుబడులు, పొదుపు పథకాలు లాభిస్తాయి. చిన్నారులు, ప్రియతముల విషయంలో శుభపరిణామాలు సంభవం. 17న వృత్తి, వ్యాపారాల్లో అదనపు ఆదాయం కోసం ప్రయత్నిస్తారు.



### మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

విద్య, ప్రయాణాలు, గృహారంభ, ప్రవేశాలు, ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం దీర్ఘకాలిక పెట్టుబడులు లాభిస్తాయి. 12,13,14 తేదీల్లో కాంట్రాక్టులు, అగ్రిమెంట్ల విషయంలో జాగ్రత్తలు పాటించాలి. విద్యార్థులు పట్టుదలతో కృషి చేసి సత్ఫలితాలు సాధిస్తారు. 15,16 తేదీల్లో కుటుంబ సభ్యుల వ్యవహారాలపై దృష్టి సారిస్తారు. రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి శుభప్రదం. దూరప్రయాణాలకు అనుకూలం. 17న సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. ప్రేమానుబంధాలు బలపడతాయి.



### కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, వేడుకలు, విద్యా విషయాలు, బదిలీలు, సమావేశాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం సమావేశాలు, పెట్టుబడులకు సంబంధించి కీలక నిర్ణయాలు తీసుకుంటారు. 12,13,14 తేదీల్లో ఆర్థిక వ్యవహారాల్లో ఆచితూచి వ్యవహరించాలి. తొందరపాటు నిర్ణయాల వల్ల నష్టపోతారు. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. 15,16 తేదీల్లో ఆర్థిక వ్యవహారాలు ప్రోత్సాహకరం. విద్యార్థులకు శుభప్రదం. సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. వేడుకల్లో పాల్గొంటారు. 17న బదిలీలు, వేడుకలకు అనుకూలం. రియల్ ఎస్టేట్ రంగం వారికి ప్రోత్సాహకరం.



### సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

కీలక నిర్ణయాలు, ఇంక్రిమెంట్లు, వృత్తిపరమైన సమావేశాలు, వేడుకలకు ఈ వారం అనుకూలం. బుధవారం రాజకీయ, సినీరంగాల వారు ఉన్నత పదవులు అందుకుంటారు. 12,13,14 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో అంచనాలు తప్పే అవకాశం ఉంది. పెద్దల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. కొత్త ప్రాజెక్టుల గురించి ఆలోచిస్తారు. 15,16 తేదీల్లో ఇంక్రిమెంట్ల విషయంలో సానుకూల సంకేతాలు అందుకుంటారు. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. పెద్దల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. పెట్టుబడులు లాభిస్తాయి. 17న సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం.



### కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

ఉన్నత విద్య, దూరప్రయాణాలు, వృత్తి, వ్యాపారాలు, బృందకార్యక్రమాలకు ఈ వారం ప్రోత్సాహకరం. బుధవారం ఆర్థిక విషయాల్లో లక్ష్యాలు సాధిస్తారు. సమావేశాలు ఫలిస్తాయి. 12,13,14 తేదీల్లో సమావేశాల్లో మాటపడాల్సి వస్తుంది. రాజకీయ సినీరంగాల వారు పట్టుదలతో లక్ష్యాలు సాధిస్తారు. 15,16 తేదీల్లో ప్రయాణాలు, చర్చలకు ప్రోత్సాహకరం. సమావేశాలు, వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు. సంకల్పం ఫలిస్తుంది. 17న ఆర్థిక విషయాల్లో మీ అంచనాలు ఫలిస్తాయి. పెట్టుబడులకు సంబంధించిన సమాచారం సేకరిస్తారు.



### తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

ఆర్థిక సంస్థలతో పనులు, ఆర్థిక వ్యూహాలు, బృందకార్యక్రమాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధవారం పెద్దల సహకారంతో ఆర్థికపరమైన లక్ష్యాలు సాధిస్తారు. ఆరోగ్యం మెరుగవుతుంది. 12,13,14 తేదీల్లో పెట్టుబడుల విషయంలో ఆచితూచి వ్యవహరించాలి. ఆర్థిక విషయాల్లో సన్నిహితుల సహకారం లభిస్తుంది. షాపింగ్ ఉల్లాసం కలిగిస్తుంది. 15,16 తేదీల్లో ఆరోగ్యం మెరుగుపడుతుంది. ఆత్మావలోకనం చేసుకుంటారు. ధార్మిక కార్యక్రమాల్లో పాల్గొంటారు. దీర్ఘకాలిక పెట్టుబడులకు అనుకూలం. 17న కొత్త ఆలోచనలు స్ఫురిస్తాయి. రుణప్రయత్నాలు ఫలిస్తాయి.



### వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

వేడుకలు, శుభకార్యాలు, సినీ, రాజకీయ విషయాలు, ఆరోగ్య అంశాలకు ఈ వారం అనుకూలం. బుధవారం బంధుమిత్రులతో వేడుకల్లో పాల్గొంటారు. 12,13,14 తేదీల్లో వేడుకల్లో పెద్దల నుంచి మాటపడాల్సి వస్తుంది. వృత్తి, వ్యాపారాల్లో సన్నిహితుల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. 15,16 తేదీల్లో ప్రత్యర్థులపై విజయం సాధిస్తారు. వివాహాది శుభకార్యాల్లో పాల్గొంటారు. పందాలు, పోటీల్లో విజయం సాధిస్తారు. 17న వారసత్వ విషయాలు లాభిస్తాయి. ప్రియతములతో దూరప్రయాణాలకు ఏర్పాట్లు చేసుకుంటారు.



### ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, ఆరోగ్యం, స్పెక్యులేషన్స్, వేడుకలు, ప్రేమానుబంధాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం ఆరోగ్యం మెరుగవుతుంది. బీమా, పెన్షన్ వ్యవహారాలు ఒక కొలిక్కి వస్తాయి. 12,13,14 తేదీల్లో వృత్తిపరమైన సమావేశాల్లో పాల్గొంటారు. లక్ష్య సాధనకు ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది. చర్చలు ఫలిస్తాయి. 15,16 తేదీల్లో వైద్యం, హోటల్, రిటైల్ రంగాల వారికి ప్రోత్సాహకరం. ఉద్యోగ, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది. 17న బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు.



### మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

వృత్తిపరమైన నిర్ణయాలు, ఆర్థిక విషయాలు, విద్య, ఆరోగ్య అంశాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం ప్రేమానుబంధాలు బలపడతాయి. భాగస్వామి వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. 12,13,14 తేదీల్లో పొదుపు పథకాల విషయంలో ఆలోచించి నిర్ణయం తీసుకోవాలి. ప్రియతముల ఆరోగ్యం పట్ల శ్రద్ధ అవసరం. డిపాజిట్లపై మంచి ప్రతిఫలం అందుకుంటారు 15,16 తేదీల్లో ప్రియతములకు సంబంధించిన ఒక సమాచారం ఉల్లాసం కలిగిస్తుంది. విద్యార్థులు లక్ష్యాలు సాధిస్తారు. వేడుకల్లో పాల్గొంటారు. ప్రయాణాలకు అనుకూలం. 17న వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరంగా ఉంటుంది.



### కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

వేడుకలు, గృహోపకరణాలు సేకరణ, ఉన్నత విద్య, ప్రేమానుబంధాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం బదిలీలు, మార్పులు చేర్పులకు అనుకూలం. 12,13,14 తేదీల్లో వివాహాది శుభకార్యాల్లో పాల్గొంటారు. భాగస్వామి వైఖరి ఆవేదన కలిగిస్తుంది. గృహారంభ, ప్రవేశాలకు అనుకూలం. 15,16 తేదీల్లో కుటుంబ సభ్యుల ఆరోగ్యం మెరుగుపడుతుంది. రియల్ ఎస్టేట్, గృహనిర్మాణ రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. రుణాలు మంజూరవుతాయి. 17న ఉన్నత విద్యా విషయాలకు అనుకూలం. సమావేశాలకు ఏర్పాట్లు చేస్తారు.



### మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

వృత్తిపరమైన సమావేశాలు, కుటుంబ వ్యవహారాలు, బదిలీలు, వేడుకలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం విద్యార్థులు లక్ష్యాలు సాధిస్తారు. ఒక శుభవార్త అందుకుంటారు. 12,13,14 తేదీల్లో వృత్తి, వ్యాపారాలకు సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు. చర్చలు, సమావేశాల్లో నిదానం పాటించాలి. 15,16 తేదీల్లో శుభవార్త అందుకుంటారు. శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. చర్చలు, సమావేశాలు ఫలిస్తాయి. 17న పెట్టుబడులకు సంబంధించిన కీలక సమాచారం అందుకుంటారు.

నవ్య






# అనుష్క నెంబర్‌వన్

దక్షిణాదిన హీరోయిన్ ఓరియెంటెడ్ సినిమాలకి అనుష్క పెట్టింది పేరు. ఆ అభిప్రాయం సినీ రంగంలోనే కాదు, ప్రేక్షకుల్లోనూ బలంగా ఉంది. అందుకే అనుష్క మోస్ట్ డిజైరబుల్ విమెన్‌గా ఎంపిక అయింది. హైదరాబాద్‌లో నిర్వహించిన ఓ సర్వేలో చాలా మంది ఇచ్చిన సమాధానం ఇది! అనుష్కకు దక్కిన ఈ గౌరవానికి కొందరు అసూయపడి 30 సంవత్సరాల వయస్సులో 'మోస్ట్ డిజైరబుల్ విమెన్' ఏమిటి? అని విమర్శిస్తుంటే, అనుష్క మాత్రం అవేమీ పట్టించుకోను అంటోంది. ఇదంతా ప్రేక్షకులకు తన మీద ఉన్న అభిమానం తప్ప తన వయస్సును చూసి కాదని తేల్చిపారేస్తోంది.



# సుకుమార్‌కి డైరెక్టర్లు కరువు?

అదేంటి? సుకుమారే పెద్ద డైరెక్టర్ కదా? ఆయనకి డైరెక్టర్లు దొరక్క పోవడం ఏమిటి? అన్న అనుమానం వస్తోంది కదా! సుకుమార్ నిర్మాతగా మారి 'కుమారి 21 ఎఫ్' నిర్మించిన సినిమా ఎంత పెద్ద హిట్టో అందరికీ తెలిసిందే! ఆ సినిమా విజయం అంతా సుకుమార్ ఖాతాలోకి వెళ్ళిందే తప్ప డైరెక్టర్ పేరు ఎవరూ తలుచుకోను కూడా తలుచుకోలేదు. ఆ సినిమా తరువాత సుకుమార్ మరో సినిమా నిర్మించాలని తలపెట్టినా చిన్న డైరెక్టర్లు ఎవ్వరూ ముందుకు రావడం లేదట! సినిమా కోసం తాము ఎంత కష్టపడినా అదంతా సుకుమార్ ఖాతాలోకి వెళ్ళి తాము జీరో అయ్యే ప్రమాదం ఉంది కనుక ఆయన సినిమా చేయక పోవడమే మంచిదని చాలా మంది అనుకుంటున్నారట! దాంతో సుకుమార్ కన్నుకి దొరక్కుండా తప్పించుకుంటున్నారట.

# ఆ హీరో జాతకం ముందే తెలిసిందట!



తెలుగు, తమిళ భాషలలో దూసుకుపోతున్న హీరో సూర్య జాతకం చిన్నతనంలోనే ఓ జ్యోతిష్కుడు చెప్పాడట! ఈ విషయాన్ని సూర్య ఓ ఇంటర్వ్యూలో చెప్పుకొచ్చాడు. చిన్నతనంలో తమ ఇంటికి ఓ జ్యోతిష్కుడు వచ్చాడనీ, ఆయన తను పెద్దయ్యాక హీరో అవుతానని చెబితే తమ ఇంట్లో ఎవరూ నమ్మలేదని తెలిపాడు. దానికి కారణం చిన్నతనంలో తను బాగా చురుకుగా ఉండేవాడు కాదట! తన తమ్ముడు కార్తి మాత్రం ఏ విషయంలోనైనా చాలా చురుగ్గా ముందుకు దూసుకుపోయేవాడట! దాంతో ఆ జ్యోతిష్కుడు పొరపాటున తన తమ్ముడి పేరు బదులు తన పేరు చెప్పి ఉంటాడని అందరూ అనుకున్నారట! కానీ ఇప్పుడు మాత్రం ఆ జ్యోతిష్కుడు పొరపడలేదనీ, తామే పొరబడ్డామనీ తెలుసుకున్నారట!



# రోజుకి నలబై గుడ్లా?

ఒక హీరో రోజుకి నలబై గుడ్లు, రెండు కిలోల చికెన్ తింటున్నాడట. ఇలా తింటున్నాడంటే ఆ వ్యక్తి భీమసేనుడి తమ్ముడు అనుకుంటే పప్పులో కాలేసినట్లే! అతగాడు పేరున్న హీరో. చాలా మంది ఇష్టపడే కోలీవుడ్ హీరో ఆర్య! ఆర్యకి తెలుగులోనూ మంచి క్రేజ్ ఉంది. ఓ సినిమా కోసం అడవి మనిషిలా తయారవుతున్నాడు ఆర్య. ఇందుకోసమే ఇంత భారీగా తింటున్నాడు. తిండితోనే ఆగకుండా జిమ్‌లో కష్టపడి తన ఆకారాన్ని అడవిమనిషిలాగా మార్చుకుంటున్నాడు. ఆర్య ఇంతలా కష్టపడుతున్న ఈ సినిమాకి ఇంత వరకూ పేరు పెట్టలేదు. పాత్రల కోసం, ప్రేక్షకుల కోసం హీరోలు ఎంత కష్టమైనా పడతారనడానికి ఆర్య మంచి నిదర్శనం అంటున్నారు తమిళ తంబిలు.

# చేతకానితనాన్ని చేతబడి అంటున్నారు

## -కంగనా రనౌత్

అందమైన రూపం లేదు... నలుగురినీ ఆకట్టుకునే భాషా చాతుర్యం లేదు. అయినా బాలీవుడ్ 'క్వీన్' అయింది. అలాగని ఆమె జీవితం వడ్డించిన విస్తరో, పూల పాన్పో కాదు. ఎక్కడో మారు మూల ప్రాంతం నుంచి బాలీవుడ్‌కి వచ్చి అక్కడ నిలదొక్కుకోవడానికి కంటికి కనిపించని శత్రువులతో పెద్ద యుద్ధమే చేసింది. ఈ పాటికే ఆమె ఎవరో... ఆమె పేరేమిటో తెలిసిపోయి ఉంటుంది. ఆమె మరెవరో కాదు. గత కొన్ని రోజులుగా అందరినోళ్ళల్లో నానుతున్న కంగనా రనౌత్. ప్రేమించామన్నవారూ, స్నేహం నటించిన వారూ మాటల తూటాలు వదులుతుంటే కొండంత బాధను కడుపులో దాచుకుని, పైకి నవ్వుతూ కనిపిస్తున్న కంగనా రనౌత్‌తో...

---

**హృతిక్‌రోషన్‌తో వివాదం ముగిసినట్టేగా?**

పేపర్లకు ఎక్కి రచ్చ చేసుకోవలసిన వివాదం కాకపోయినా పరిస్థితుల కారణంగా మా వివాదం పెద్ద గొడవ కింద మారింది. మా ఇద్దరికీ సన్నిహితులైన వారు కల్పించుకుని మా వివాదాన్ని సెటిల్ చేశారు. ఇక నుంచీ దీనిమీద ఎలాంటి ప్రకటనలూ ఇవ్వకూడదని నిర్ణయించుకున్నాం.

**వివాదం ఎందుకు వచ్చింది?**

ముగిసిపోయిన వివాదాన్ని తిరిగి కెలకడం ఎందుకు? చెప్పానుగా పరిస్థితులు అలా వచ్చాయని.

**మీరు చేతబడులు చేస్తారంటూ హీరో అధ్యాన్ సుమన్ అంటున్నాడు?**

నేను ఎంత మారుమూల ప్రాంతం నుంచి వచ్చినా చేతబడులు చేసే దానిలా కనిపిస్తున్నానా? ఆ హీరో చెప్పగానే నమ్మేస్తారా? నేను పూజలు, చేతబడులు చేశానని అంటున్నారుగా? మరి ఆ విషయం నా చుట్టుపక్కల ఉండే కొందరికైనా తెలిసే అవకాశం ఉంటుందిగా? అలాంటివి చేస్తే వారు ఊరుకుంటారా? ఇంత చిన్న విషయం కూడా ఆ హీరోగారికి తట్టలేదెందుకో నాకు అర్థం కాలేదు.

**ఆయన సినిమాల ఫ్లాప్‌లకి మీ పూజలే కారణమంటున్నాడుగా?**

ఆయన సినిమాలు ఫ్లాప్ అవుతున్నాయంటే లోపం ఆయన నటనలో ఉండాలి. దాన్ని కప్పిపుచ్చుకోవడానికి నేనేదో పూజలు చేశాననీ, అందుకే తన సినిమాలు ఫ్లాప్ అయ్యాయని కట్టుకథలు చెప్పడం ఎందుకు? తన చేతకానితనాన్ని కప్పిపుచ్చుకోవాలని చూసే వాళ్ళే ఇలాంటి కహానీలు వినిపిస్తారు.

**వాస్తవానికి ఇలాంటి పూజలను మీరు నమ్ముతారా?**

నేను భగవంతుడిని తప్ప మరెవ్వరినీ నమ్మను. పూజించను. విజయం అయినా, అపజయమైనా మనం చేసే పనిద్వారా, మన కష్టం ద్వారా మాత్రమే వస్తాయి తప్ప పూజలు గట్రా చేస్తే రావు.

**పరిశ్రమలో ఎవరి మీదా రాని ఆరోపణలు మీమీద రావడానికి కారణం?**

నాకు ఎలాంటి బ్యాక్ గ్రౌండ్ లేకపోవడం. నన్ను ఎవరు ఏమన్నా ఏ సెలబ్రిటీ జోక్యం చేసుకోరు అన్న ధీమా! వారితో అలా మాట్లాడిస్తోంది. బాలీవుడ్‌లో హీరోయిన్ల గురించి చులకనగా మాట్లాడతారు. ముఖ్యంగా నాలాంటి వారి గురించి అయితే ఇక చెప్పనక్కర్లేదు. ఇక్కడ నిలదొక్కుకునే క్రమంలో నేను చాలా మందికి చెడ్డ అయ్యాను. కొందరు అయితే నన్ను చూసి ముఖం తిప్పుకుని వెళ్ళి

పోయేటంత ద్వేషం కూడా పెంచుకున్నారు.

**మిమ్మల్ని సమర్థిస్తున్న దర్శకులు కూడా ఉన్నారుగా?**

నా గురించి తెలిసిన వారు, నాతో పనిచేసిన దర్శకనిర్మాతలు ఈ సమయంలో నాకు అండగా నిలబడ్డారు. ఒక్క థాంక్స్‌తో వారి రుణం తీర్చుకోలేను.

**పది సంవత్సరాల సుదీర్ఘ ప్రయాణంలో ఎదురైన అనుభవాలు?**

పురుషాధిక్యత కలిగిన బాలీవుడ్‌లో నిలదొక్కుకోవడానికి పెద్ద యుద్ధమే చేయాల్సి వచ్చింది. ఇన్ని సంవత్సరాల తరువాత నాకంటూ ఓ గుర్తింపు వచ్చింది. మూడు సార్లు జాతీయ అవార్డు వచ్చినప్పుడు కూడా 'కంగనాకు అవార్డు ఎలా ఇస్తారంటూ' కొందరు గొడవ చేశారు. ప్రారంభంలో ఇలాంటి మాటలు వింటే బాధనిపించేది. ఇప్పుడు వాటిని పట్టించుకోవడం మానేశాను. ప్రస్తుతానికి బాలీవుడ్‌లో నా జర్నీ హ్యాపీగా సాగిపోతోంది. బాగా ప్రాముఖ్యం ఉన్న సినిమాలే వస్తున్నాయి. ఇక్కడికి వచ్చిన కొత్తల్లో నాకు ఇంగ్లీష్ మాట్లాడడం వచ్చేది కాదు. హిందీ కూడా కొద్దిగా తడబడే దాన్ని. దీన్ని అడ్వాంటేజ్‌గా తీసుకున్నారు చాలా మంది. అన్ని కష్టాలను అధిగమించి ఈరోజు ఈస్థాయి చేరుకున్నాను. ఇది నా స్వయంకృషి.

**పది సంవత్సరాలలో ఇబ్బంది పడిన సందర్భం?**

ఇబ్బంది అని కాదు. రొమాంటిక్ సన్నివేశాలలో కాస్త ఇబ్బంది పడతాను. సీరియస్‌గా ఉండే పాత్రలు చేయడం నాకు ఈజీగా అనిపిస్తుంది. అలాగే నవ్వించడం కూడా కష్టమే! నేను చేసిన సినిమాలలో అన్ని రకాలు ఉన్నాయి. ఒక్కసారి వెనక్కి తిరిగి చూసుకుంటే, నేనేనా ఈ పాత్రలు చేసింది అని కూడా అనిపిస్తూ ఉంటుంది.

**బాలీవుడ్ హీరోయిన్లలో మీరే ఎక్కువ రెమ్యునరేషన్ తీసుకుంటారట?**

నా సక్సెస్‌ను చూసి ఇస్తున్న మొత్తం అది. పారితోషికం విషయంలో నేను ఎవర్నీ డిమాండ్ చేయను. నాకెంత ఇవ్వాలో నా దర్శకనిర్మాతలకు బాగా తెలుసు.

**తెలుగులో కేవలం డబ్బు కోసమే నటించారన్న అపవాదు గురించి?**

నేనే కాదు ఎవరైనా డబ్బు కోసమే నటిస్తారు. ఇక్కడ డబ్బులు తీసుకోకుండా నటించే ఉదారులు ఎవ్వరూ లేరు. నేను హిందీలో చేసినా, తెలుగులో చేసినా డబ్బు కోసమే సినిమాలు చేశాను. తెలుగులో చేసిన సినిమాతో వచ్చిన డబ్బుతో నాకు నచ్చిన కారు కొనుక్కున్నాను. అది తప్పు కాదే! ఎవర్నీ మోసం చేయలేదు. ఎవరి దగ్గరా దొంగతనం చేయలేదు. నా డబ్బుతో కారు కొనుక్కుంటే ఇంత రాద్ధాంతం ఎందుకో నాకు అర్థం కావడం లేదు.

**తెలుగులో చేయకపోవడానికి కారణం?**

నచ్చిన సినిమా రాలేదు. కొన్ని సినిమాలు వచ్చినప్పుడు నేను హిందీ సినిమాల షూటింగ్‌లతో బిజీగా ఉన్నాను. దాంతో ఆ సినిమాలను వదులుకోవలసి వచ్చింది.

**బాలీవుడ్ హీరోయిన్లతో మంచి సంబంధాలు లేవంటారు ఎందుకలా?**

లేదు. అందరితో చక్కగా ఉండడానికే ప్రయత్నిస్తాను. కానీ నాకు ఇంగ్లీష్ అంత బాగా రాదనీ, ఫ్యాషనబుల్ ఉండననీ కొందరు నన్ను దూరం పెడుతుంటారు. అలాంటి వారితో నేను ఎంత బాగా ఉండాలని ప్రయత్నించినా, వారు నన్ను దూరం పెడుతున్నారు. పై నుంచి నేను సరిగా ఉండననీ నా మీద నిందలు. ఈ రంగంలో ఇలాంటి నిందలు చాలా మామూలే! కాకపోతే నామీద కొద్దిగా ఎక్కువ అంతే!

**బాలీవుడ్‌లో ఇష్టపడే హీరోయిన్లు?**

చాలా మందే ఉన్నారు. సోనమ్ ఫ్యాషన్ నాకు నచ్చుతుంది. అలాగే దీపిక డ్రస్సులు బాగుంటాయి. విద్యాబాలన్ చీరకట్టు అంటే చాలా ఇష్టం. చాలామంది హీరోయిన్లను ఇష్టపడతాను.

**ఈ మధ్య మీరు లావెక్కడానికి కృషి చేస్తున్నట్టున్నారు?**

మొదటినుంచి నాది చిన్న పర్సనాలిటీ! కొద్దిగా బరువుపెరిగితే బాగుంటుందన్న ఉద్దేశంతో ఆ దిశగా కృషి చేస్తున్నాను.

-చిన్ని





## ఆ సినిమాకి చార్మి నిర్మాతా?

మహేష్ బాబు హీరోగా పూరీ జగన్నాథ్ 'జనగణమణ' సినిమా చేయబోతున్న సంగతి తెలిసిందే! వాస్తవానికి ఈ టైటిల్‌ను చార్మి తన నిర్మాణ సంస్థ పేరు మీద రిజిస్ట్రేషన్ చేయించిందట! పూరీ ఎటూ నిర్మాణం జోలికి పోకూడదని నిర్ణయానికి వచ్చాడు కనుక ఈ సినిమా చార్మి నిర్మించబోతోందన్న వార్తలు బాగా హల్‌చల్ చేస్తున్నాయి. ఈ సినిమాను చార్మి నిర్మిస్తుందా? లేక టైటిల్‌ను మాత్రమే చార్మి నుంచి తీసుకుంటున్నారా? అన్న విషయాలు క్లారిఫై కావలసి ఉంది. ఒక వేళ ఈ సినిమా చార్మి నిర్మిస్తే మహేష్‌తో సినిమా నిర్మించిన తొలి హీరోయిన్ అవుతుందని టాలీవుడ్ జనాలు అంటున్నారు.



# ఇంటర్వ్యూ

# నా అనుభవం నాకు సినీ పాఠం నేర్పింది

**-గౌతమి**

**చికుబుకు చికుబుకు రైలే అదిరెను దీని స్టైలే....అనే పాటలో తన డాన్స్‌తో పిల్లల నుంచి యువతీయువకుల వరకు అందరినీ అలరించి సంచలనం సృష్టించిన నటి గౌతమి. సినీజీవితంలో కుటుంబ చిత్రాలకే తాను ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చానంటారామె. నటిగా ఎన్నో అవార్డులతోపాటు, రెండో ఇన్నింగ్స్‌లో కాస్ట్యూమ్ డిజైనర్‌గా తనకంటూ ప్రత్యేక స్థానం సంపాదించుకున్నారు. రెండున్నర దశాబ్దాలుగా నూట ముప్పైకి పైగా చిత్రాల్లో నటించిన గౌతమి ఇంటర్వ్యూ....**

నేను శ్రీకాకుళంలో పుట్టాను. మా నాన్నగారు డాక్టర్ శేషగిరిరావు. అమ్మ డాక్టర్ వసుంధరాదేవి. హైస్కూల్లో ఉన్నప్పుడు ఎక్కువగా నాటికల్లో నటించేదాన్ని. స్వంతంగా నాటికలు రాయడం, కథలు రాయడం... వంటి ప్రక్రియలపై చిన్నప్పటి నుండే నాకు ఆసక్తి. అదేవిధంగా ఫైన్ ఆర్ట్స్‌లో పాల్గొనేలా అమ్మానాన్న నన్ను బాగా ప్రోత్సహించేవారు. నేను చిన్నపిల్లగా ఉన్నప్పటి నుండే శాస్త్రీయ సంగీత కచేరీలకు హాజరై ఆసక్తిగా వినేదాన్ని. మంగళంపల్లి బాలమురళీకృష్ణగారి గాత్ర కచేరీ ఎక్కడ జరిగినా ఆ కార్యక్రమాలకు మా కుటుంబమంతా హాజరయ్యేవాళ్ళం. అలా శాస్త్రీయ సంగీతం పట్ల నాకు ఆసక్తి ఏర్పడింది. అన్ని లలిత కళల్లో పాల్గొనేదాన్ని. మరో ముఖ్య విశేషం ఏమిటంటే, పుస్తక పఠనం అంటే నాకు చాలా ఆసక్తి. మా ఇంట్లో అందరూ పుస్తక ప్రియులే. మా ఇంట్లో లైబ్రరీ కూడా ఉండేది. అందువల్ల అన్నిరకాల పుస్తకాలు నాకు అందుబాటులో ఉండేవి.

### దయామయుడు

విశాఖపట్నం గీతం ఇంజనీరింగ్ కాలేజీలో మొదటి సంవత్సరం చదువుతున్నప్పుడే సినిమాల్లో అవకాశాలు వచ్చాయి. సినిమాల్లో నటించాలని నేను ఏనాడూ కోరుకోలేదు. అనుకోలేదు. ఇంజనీరింగ్ కంప్లీట్ చెయ్యాలి, పై చదువులకు విదేశాలకు వెళ్ళాలనే పట్టుదల బాగా ఉండేది. కానీ అనుకోకుండా మా కజిన్ విజయ చందర్ గారు 'దయామయుడు' చిత్ర నిర్మాణం చేస్తూ అందులో నటించమని అడిగారు. మా అమ్మానాన్నా కాదనలేకపోయారు. ఏదో చిన్న రోల్ కదా చదువుకు ఎలాంటి ఆటంకం ఉండదనే ఉద్దేశంతో అంగీకరించారు. ఆ సినిమా షూటింగ్ పూర్తికాగానే, మళ్ళీ చదువుకోవచ్చులే అనుకుని నేను కూడా అంగీకరించాను.

### సినీ పాఠాలు

'దయామయుడు' చిత్రం ద్వారా ఏదో తెరమీద కనిపించాను తప్ప అది నాకు సంతృప్తిని ఇవ్వలేదు. కానీ పూర్తిస్థాయిలో సినిమాల్లోనే ఉండిపోవాలి అనుకుని ఆ చిత్రంలో నటించలేదు. కానీ విజయచందర్ గారు ఇచ్చిన ఈ అవకాశమే నా సినీ జీవితానికి ప్రేరణ అని చెప్పగలను. విజయచందర్‌గారితో పాటు నా సినీ కెరీర్‌లో ఎందరో ప్రముఖ దర్శకులు, నటుల దగ్గర చిత్ర పరిశ్రమలో ఏం చెయ్యాలి, ఏం చెయ్య కూడదు.. వంటి ఎన్నో విషయాలు తెలుసుకున్నాను. ముఖ్యంగా నా అనుభవం నాకు సినీ పాఠం నేర్పింది. తల్లిదండ్రుల ప్రోత్సాహం వల్ల కూడా నేను ఈ రంగంలో నిలదొక్కుకోగలిగాను.

### రజనీకాంత్‌తో హీరోయిన్‌గా

హీరోయిన్‌గా తమిళ చిత్రం ద్వారా వెండితెరకు పరిచయమయ్యాను. నేను నటించిన నా మొదటి చిత్రం 'గురుశిష్యన్'. ఇందులో రజనీకాంత్, ప్రభుగారు నటించారు. ఎస్.పి.ముత్తురామన్ దర్శకత్వంలో నిర్మించిన ఈ చిత్రంలో నాతోపాటు సీత, మనోరమ తదితరులు నటించారు. ఈ చిత్రంలో నటించడం ఎంతో అదృష్టంగా నేను భావిస్తాను. ప్రముఖ హీరో రజనీకాంత్‌గారి చిత్రంలో ఆయన సరసన నటించడం నేను ఎన్నడూ ఊహించని విషయం. 1988లో విడుదలైన ఈ చిత్రం సూపర్‌హిట్ కావడంతో నా కెరీర్ మలుపు తిరిగింది.



### ప్రముఖ హీరోలతో

'గురుశిష్యన్' చిత్రం తర్వాత ఇక 1987 నుండి 1997 వరకు రజనీకాంత్, కమల్‌హాసన్, విజయకాంత్, ప్రభు గణేశన్, కార్తీక్, అర్జున్, అరవిందస్వామి, మురళి, రామ్‌కీ, రెహమన్, శరత్‌కుమార్ లాంటి ప్రముఖ హీరోల సరసన హీరోయిన్‌గా అనేక చిత్రాల్లో నటించాను. ఇలా నటించడం నా పూర్వజన్మ సుకృతం. ఆ సమయంలో భానుప్రియ, ఖుష్బూ వంటి హీరోయిన్లతో పోటాపోటీగా నటించడం, అలా నేను నటించిన చిత్రాలన్నీ విజయవంతం కావడంతో నాలో నటించాలన్న కోరిక బలంగా నాటుకుంది. అపూర్వ సహోదరగళ్, రాజా చిన్న రోజా, దేవరమగన్, పనక్కారన్, పూరువిట్టు ఊరువంతా.. ఇలా ఈ చిత్రాలన్నీ విజయవంతంగా ప్రదర్శితమయ్యాయి.

### మలయాళ చిత్రం

సిబిమలయిల్ దర్శకత్వంలో మలయాళంలో నిర్మితమైన 'అబ్దుల్లా' చిత్రం నాకు మంచి పేరు తెచ్చింది. ఈ చిత్రంలో మోహన్‌లాల్, నేను నటించాం. ఇది నాకు బాగా పేరు తెచ్చిన చిత్రం. మోహన్‌లాల్ ప్రొడ్యూస్ చేసిన ఈ చిత్రంలో నిడుముడివేణుకు ఉత్తమ సహాయ నటుడుగా, ఎం.జి. శ్రీకుమార్‌కు ఉత్తమ గాయకుడిగా జాతీయ ఫిలిం అవార్డులు రావడం, ఉత్తమ సంగీత దర్శకుడుగా రవీంద్రన్‌కు కేరళ రాష్ట్ర ప్రభుత్వ అవార్డు రావడం ఒక ముఖ్యవిశేషం. ఇది ఆ రోజుల్లో చర్చనీయాంశమైంది. 1990లో విడుదలైన ఈ చిత్రం బ్రహ్మాండమైన విజయం సాధించింది.

అదేవిధంగా మరో మలయాళ చిత్రం 'ధ్రువం' నాకు మంచి పేరు తెచ్చిపెట్టింది. విక్రమ్ నటించిన మొదటిచిత్రం ఇది. 1993లో విడుదలైన ఈ చిత్రానికి దర్శకుడు జోషి. ఈ చిత్రంలో నాతోపాటు మమ్ముట్టి, జయరామ్, సురేష్‌గోపి, రుద్ర తదితరులు నటించారు.

### తెలుగులో హీరోయిన్‌గా

తెలుగులో హీరోయిన్‌గా నేను నటించిన తొలి చిత్రం 'గాంధీనగర్ రెండవ వీధి'. రాజేంద్ర ప్రసాద్ హీరో. పి.ఎన్.రామచంద్రరావు దర్శకత్వంలో నిర్మితమైన ఈ చిత్రంలో రంగనాథ్‌గారి కుమార్తెగా నటించాను. చంద్రమోహన్, వీరభద్రరావు, జయసుధ తదితరులు నటించారు. 1987లో విడుదలైన ఈ చిత్రం శత దినోత్సవం చేసుకోవడం, నా పాత్రకు మంచి పేరు రావడం, తెలుగు ప్రేక్షకుల హృదయాల్లో చోటు సంపాదించుకోవడం నా అదృష్టం. ఈ చిత్రం షూటింగ్ సమయంలో రంగనాథ్‌గారి దగ్గర నటిగా నేను ఎన్నో విషయాలు నేర్చుకున్నాను. ఎంతో ఓర్పుగా నాకు ఎన్నో విషయాలు చెప్పేవారు. అసలు ఆయన ఆత్మహత్య చేసుకోవాల్సిన అవసరం లేదు. ఆ విషయం నాకు దిగ్భ్రాంతి కలిగించింది. ఎందుకు అలా చేశారో అస్సలు అర్థం కావడం లేదు. ఆయన ఆత్మకు శాంతి కలగాలని దైవాన్ని మనస్ఫూర్తిగా ప్రార్థిస్తున్నాను.



గాంధీనగర్ రెండవ వీధి చిత్రం తర్వాత నాకు తెలుగులో ఆఫర్లు వచ్చాయి. ముందుగా ఈ చిత్రాన్ని సత్యాన్ అంతికడ్ పేరిట మలయాళంలో తీశారు. తర్వాత తమిళంలో కూడా అన్నానగర ముదల్‌తెరు పేరిట నిర్మించారు.

### శ్రీనివాస కల్యాణం

తెలుగులో నా రెండవ చిత్రం శ్రీనివాస కల్యాణం. 1987లో విడుదలైన ఈ చిత్రం బాక్సాఫీస్ హిట్. కోడి రామకృష్ణగారి దర్శకత్వంలో వచ్చిన ఈ చిత్రంలో హీరో వెంకటేష్. భానుప్రియ, వై.విజయ, మోహన్ బాబు, గొల్లపూడిమారుతీరావు, ప్రసాద్‌బాబు తదితరులు నటించారు. ఈ చిత్రం తర్వాత ఎంతోమంది దర్శకులు నా కాల్‌షీట్లు అడిగారు. కానీ అందరికీ ఎలా ఇవ్వగలను? దాంతో చాలా ఆఫర్లు మిస్ చేసుకున్నాను.

### హిందీ చిత్రాలు

నేను హిందీలో నటించిన చిత్రాలన్నీ హిట్ అయ్యాయి. ప్యార్ హువా చోరీ చోరీ, జనతాకీ అదాలత్, హైవాన్, ఆద్మీ, అప్పురాజా, త్రిమూర్తి, తీస్రాకౌన్, నకాబ్ చిత్రాల్లో నటించాను. కొందరు హిందీ దర్శకులకు సైతం నేను కాల్ షీట్లు ఇవ్వలేకపోయాను. అది కొంత బాధ అనిపించింది. ఆచితూచి ఎంతవరకు చేయగలనో అంతవరకే కాల్‌షీట్లు ఇచ్చాను.

### బాలు మహేంద్ర అభినందన

ప్రముఖ దర్శకుడు బాలు మహేంద్రగారికి పరిశ్రమలో ఒక ప్రత్యేక గౌరవం ఉంది. ఆయన దర్శకుడు మాత్రమే కాదు, లిటరరీ ఎడిటర్, సినిమాటోగ్రాఫర్, స్క్రీన్ రైటర్, ఫిలిం ఎడిటర్.. ఇలా విభిన్న కోణాల్లో ప్రతిభ చాటుకుని ఎన్నో జాతీయ రాష్ట్ర ప్రభుత్వ అవార్డులు అందుకున్నారాయన. 'నువ్వు ఇంత బాగా నటిస్తావనుకోలేదు, నీకు మంచి భవిష్యత్తు ఉంది' అంటూ ఆయన నన్ను అభినందించారు. షూటింగ్ జరుగుతున్న ప్రదేశానికి ప్రత్యేకంగా వచ్చి కలిసి ఆయన నన్ను అభినందించారు. ఇది నా సినీ జీవితంలో మరిచిపోలేని సంఘటన. ఆయన అభినందనలే నా ఎదుగుదలకు ఊపిరి పోశాయి.

### క్షత్రియ పుత్రుడు

దేవరమగన్ తమిళ చిత్రం నుండి క్షత్రియ పుత్రుడు చిత్రాన్ని డబ్ చేశారు. ఈ చిత్రంలో శివాజీగణేశన్, కమల్ హాసన్ నా నటనను ఎంతగానో కొనియాడారు. ఈ చిత్ర దర్శకుడు భరత్. తెలుగులో కంటే తమిళంలోనే ఈ చిత్రం బాగా సూపర్‌హిట్ అయ్యింది.

నేను నటించిన తమిళ టీవీ సీరియల్ 'అభిరామి' నాకు మంచి పేరు తెచ్చింది. ప్రస్తుతం తెలుగు మలయాళంలలో రూపొందుతున్న 'మనమంతా' చిత్రంలో నటిస్తున్నాను. జాతీయ ఫిలిం అవార్డు పొందిన చంద్రశేఖర్ యేలేటి దర్శకత్వంలో కొర్రపాటి శాయి ఈ చిత్రాల్ని ప్రొడ్యూస్ చేస్తున్నారు.

### క్రమశిక్షణకు మారుపేరు

ఆనాటి నటులు క్రమశిక్షణకు మారుపేరు. అప్పటి నటీనటులకు తగ్గట్టుగానే మంచి చిత్రాలు వచ్చాయి. ఇప్పుడు కూడా అద్భుతమైన చిత్రాలు వస్తున్నాయి. కానీ ఆనాటి తరానికీ, ఈనాటి తరానికీ పోలిక భావ్యం కాదు. ఆనాడు అందుబాటులో ఉన్న పరికరాలతో అద్భుత ప్రయోగాలు చేసి నాణ్యమైన చిత్రాలు అందించారు. ఈనాడు కూడా ఎన్నో ప్రయోజనాత్మకమైన కుటుంబ చిత్రాలు తీస్తున్నారు. బాహుబలి, రుద్రమదేవి, మగధీర, అరుంధతి, బొమ్మరిల్లు లాంటి చిత్రాలు లేటెస్ట్ టెక్నాలజీ ఉపయోగించి తీసిన చిత్రాలే. ఆనాటి నటీనటులు కనిపిస్తే గౌరవంగా చేతులెత్తి నమస్కరించాలనిపిస్తుంది. ఇప్పటి నటీనటులు ఈ కాలానికి అనుగుణంగా ఉన్నారు. మార్పు సహజం. బిజీ బిజీగా ఉండటం సహజం. ఏ కళాకారుణ్ణీ అగౌరవపరచవల్సిన పనిలేదు. కళాకారులంతా బాగుండాలి. అప్పుడే సినీ పరిశ్రమ పచ్చగా కళకళలాడుతూ ఉంటుంది.

### అవార్డులు

'నమ్మఊరు పూవత్తై' చిత్రంలో నా నటనకు గాను 1990 తమిళనాడు ప్రభుత్వ ప్రత్యేక అవార్డు లభించింది. నీపతి నాన్‌పతి తమిళ చిత్రానికిగాను 1991 ఫిలిమ్ ఫేర్ అవార్డు, ఉత్తమ నటనకు సినిమా ఎక్స్‌ప్రెస్ అవార్డు లభించింది. 1999 తర్వాత కాస్ట్యూమ్ డిజైనర్‌గా చిత్ర పరిశ్రమలోకి రీ ఎంట్రీ ఇచ్చిన తర్వాత కమల్‌హాసన్‌గారి 'దశావతారం' చిత్రానికిగాను బెస్ట్ కాస్ట్యూమ్ డిజై.నర్‌గా అవార్డు అందుకున్నాను.

**కె.హరనాథ్, 9703542598**

# ఇవన్నీ నిజాలే!

✡ చైనా రాజధాని నగరం బీజింగ్‌లో ట్రాఫిక్ కార్యకలాపాలు కనిపెట్టేందుకు కోటి సీసీ కెమేరాలు ఉన్నాయి! లండన్‌లో ఏ ప్రాంతంలోంచి బయలుదేరినా ప్రతివ్యక్తి కనీసం 20 చోట్ల సిసీ కెమెరాల్లో రికార్డవుతాడు!

•••

✡ కాలిఫోర్నియాలోని మౌంట్ పాలిమార్‌లో భారీ టెలిస్కోప్ ఉంది. అది ఎంత పెద్దదంటే 40 వేల మైళ్ళ దూరంలో వెలిగించి ఉన్న కొవ్వొత్తిని చూడవచ్చు!

### అయ్యో పాపం!

✡ 1840-1963 మధ్య అంటే 23 సంవత్సరాల వ్యవధిలో అమెరికా అధ్యక్ష పదవికి ఎన్నికైన ఏడుగురు, పదవిలో ఉన్న సమయంలోనే మరణించారు. విలియం హెన్రీ హారిసన్, అబ్రహాం లింకన్, జేమ్స్ ఎ.గార్‌ఫీల్డ్, విలియం మెక్ కిన్లే, వారెన్ జి.హార్డింగ్, ఫ్రాంక్లిన్ డి రూజ్వెల్ట్, జాన్ ఎఫ్. కెన్నడీ అలా మరణించినవారే.

•••

✡ ప్రపంచవ్యాప్తంగా ఎల్లప్పుడూ అత్యధికంగా అమ్ముడయ్యే పుస్తకం బైబిల్.

•••

✡ నూతన కల్పనలు చేసే పరిశోధకుడు థామస్ ఎడిసన్ (1847-1931) మరణించిన మర్నాడు అక్టోబరు 19న న్యూయార్క్ టైమ్స్ పత్రిక నాలుగున్నర పేజీలు ఆయన గురించే ప్రచురించింది.

•••

✡ పూర్వకాలం ఒక ఇంటిని ఎవరైనా కొనుగోలు చేస్తే పాత యజమాని కాలిబూటును కొత్త యజమానికి ఇచ్చేవారు. ఇలా ఇవ్వడాన్ని చట్టబద్ధమైన ఒప్పందంగా భావించేవారు.

•••

✡ వియన్నా స్టేట్ ఒపెరా హౌస్ నిర్మాణం పూర్తయిన తర్వాత 1869లో చాలా భయంకరమైన విమర్శలు వెల్లువెత్తాయి. ఆ విమర్శలు భరించలేక ఆ నిర్మాణశిల్పుల్లో ఒకరు ఉరివేసుకుని ఆత్మహత్య చేసుకోగా, మరొకరు షాక్‌తో మరణించారు.

•••

✡ కొన్ని పుట్టగొడుగులు చీకట్లో మాత్రమే ఎదుగుతాయి.

•••

✡ టర్కీలో ఒక మనిషి తన జ్ఞాపకశక్తితో ఆరు గంటల సమయంలో ఖురాన్‌ను 6,666 రకాలుగా గానం చేశాడు.

•••

✡ నీటి గుర్రం (హిప్పోపోటమస్) పొట్ట పది అడుగుల పొడవు ఉంటుంది.

•••

✡ ప్రపంచంలోని కొన్ని ప్రాంతాల్లో పెద్ద బాతులు గొర్రెల కాపరులుగా పనిచేస్తాయి. అందుకోసం వాటికి తగిన శిక్షణ ఇస్తారు.

### పేదవాడి పండు

✡ నిజానికి బనేమా అని పిలిచే అరటిపళ్ళు ఆఫ్రికాలో వృద్ధి చెందినప్పటికీ వాటి జన్మస్థానం మాత్రం తూర్పు ఆసియా, ఓసియానా ప్రాంతాలే. ధాన్యం పంట సాగుకంటే పురాతనకాలం నుంచీ అరటి పండు ఉంది. ప్రపంచ ఆర్థిక వ్యవస్థ మార్కెట్లనూ అరటి పండునూ వేరు చేసి చూడలేం. అప్పటికీ ఇప్పటికీ పేదవాడి ఆకలి తీర్చేదీ, చవగ్గా దొరికేదీ అరటిపండు మాత్రమే.

-చిన్నారి

# నవ్య సుధామ పదగారడి-261

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| * | * | 1 | 2 | | 3 | | 4 | * |
| * | 5 | * | | * | | * | * | * |
| 6 | | | * | 7 | * | 8 | | * |
| * | | * | 9 | | | * | 10 | 11 |
| 12 | 11 * | 13 | | | * | 14 | * | * |
| 15 | 16 | 15 * | 17 | * | | * | 18 | * |
| * | 19 | | * | | * | 20 | * | |
| * | | * | 21 | * | 22 | * | * | * |
| * | * | 23 | | | | | * | * |

## ఆధారాలు

**అడ్డం**

1. స్వర్గము (6)
6. భూములను ఆక్రమించడం అక్రమంగా (3)
8. సినీనటి, నక్షత్రం (2)
9. క్రొవ్వు, మదము (3)
10. జన సమూహము, ఒక తెగగుంపు (2)
13. వంటిళ్ళను ధ్వంసం చేయాలి అన్న కవయిత్రి తెలుగులో (3)
15. పేనుగ్రుడ్డు (2)
17. బాపు శ్రీరామరాజ్యం సినిమా సీత (5)
19. ఇవి దంచితేనే బియ్యం వస్తాయి (2)
20. వెలిగారము, నాట్యస్థానము (3)
23. టాయిలెట్‌కు తెలుగుపేరు! (5)

**నిలువు**

2. మేఘం (2)
3. శుభము, మేలు - కసి లేని 'కల సిగ్గు'లో వుంది (2)
4. కుమ్ము, సూర్యుని గుఱ్ఱము (4)
5. మత్తు (3)
7. భూమి (5)
9. కోరిక (3)
11. కాగితం సైజుకు వ్యవహారం (2)
12. పార్వతి (2)
14. నేర్పు, గోడ కట్టుపని (3)
16. క్షురకర్మ (3)
18. గొడవ, అల్లరి (3)
21. దోచితిని (2)
22. ఇష్టం సినిమాతో తెలుగు తెరకు వచ్చిన హీరోయిన్ సంతోషం భాను! (2)

### పదగారడి-260 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| మే | డే | | టొ | గూ | ర్ | | టెం | క |
| నా | | వృ | | డు | | గ | | వ్వం |
| | బు | ద్ధు | డు | | దా | హ | ము | |
| పొ | | డు | | ప | | ము | | పి |
| ల | క్ష | | కొ | బ్బ | రి | | శా | రి |
| ము | | అ | | ము | | ఈ | | క్ష |
| | మో | ర్కు | లు | | గృ | ధ్ర | ము | |
| బె | | డు | | కా | | ము | | శ్లే |
| రెం | పె | | కొ | ను | క | | గ్రీ | ష్మం |

Printed and Published by **VEMURI RADHAKRISHNA,** Managing Director, on behalf of Aamoda Publications Pvt. Ltd., Plot No.76, Aswani Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad-500 033. Ph.(040) 23558233/44, Fax No.23558288. Printed at Aamoda Press, R.S.No.191/3, Ward No.43, Donka Road, Patamata, Vijayawada 520 010, Reg.No.: APTEL/2004/12594. Editor: **A.N.JAGANNADHA SARMA**

# ఆ లోటు తీరింది

## -రాశీఖన్నా



**టాలీవుడ్‌లో సక్సెస్ ఫ్లాప్‌లతో సంబంధం లేకుండా సినిమాలు చేసుకుంటూ పోయే హీరోయిన్ల జాబితాలో రాశీఖన్నా పేరు ముందుగా చెప్పుకోవాలి. రకూల్, తమన్నాలు కూడా ఈ కోవకు చెందిన వారే అయినా వీరి ద్దరి ఖాతాలో ఒకటి రెండు హిట్ సినిమాలన్నా ఉన్నాయి. అదే రాశీ విషయానికి వస్తే 'ఊహలు గుసగుసలాడే' దగ్గర్నుంచి ఇప్పటి వరకూ సక్సెస్ అనే మాట ఆమెను ఊరిస్తూనే ఉంది. అయినా సినిమాలు చేసుకుంటూ పోతూనే ఉంది. ఈ రహస్యం ఏమిటో ఆమె మాటల్లోనే....**

---

**'సుప్రీమ్'లో మొదటిసారి కామెడీ క్యారెక్టర్ చేసినట్టున్నారు?**

నిజమే. ఇప్పటి వరకూ చేయని పాత్రే! ఇందు కోసం కామెడీ సినిమాలు చాలా చూశాను. కామెడీ చేయడం ఎంత కష్టమో తెలిసి వచ్చింది. ఈ పాత్ర చేసిన తరువాత నా మీద నాకు నమ్మకం పెరిగింది. ఈ సినిమాలో నాది కామెడీ పోలీస్ క్యారెక్టర్.

**సక్సెస్ లోటు తీరినట్టుంది?**

నిజమే! టాలీవుడ్‌కి వచ్చినప్పటి నుంచీ ఈ మాట అందని పండులా ఊరిస్తూనే ఉంది. నా సిని మాలు కమర్షియల్‌గా సక్సెస్ సాధించలేకపోయినా, ఫ్లాప్ అని అనిపించుకోలేదు. దాదాపు అన్ని సిని మాలూ యావరేజ్ టాక్‌నే తెచ్చుకున్నాయి. 'సుప్రీమ్'కి హిట్ టాక్ రావడంతో చాలా సంతోషంగా ఉంది.

**మెగా హీరో గురించి....**

నిజంగా తను మెగా హీరోనే! నటించే సమ యంలో ఎంత సీరియస్‌గా ఉంటాడో చెప్పలేను. సీన్ గురించి డైరెక్టర్ చెబుతుంటే వింటూ ఉండిపోతాడు. ఆ తరువాత తన స్టయి ల్‌లో నటించేస్తుంటాడు. డ్యాన్సుల్లో అతని స్పీడును అందుకోవడం కష్టమే!

**ఈ సినిమా కోసం సన్న బడినట్టున్నారు?**

చిన్నతనంలో నేను చాలా బొద్దుగా ఉండేదాన్ని. సిని మాల్లోకి వద్దామను కున్నప్పుడు బరువు చాలా వరకూ తగ్గి ఆ తరువాత సినిమాల్లోకి వచ్చాను. సినిమా సినిమాకీ బరువు తగ్గుతూనే ఉన్నాను. అందంగానే కాదు ఆరోగ్యపరంగా కూడా బరువు తగ్గడం చాలా మంచిది. అయితే ఎంత బరువు తగ్గాను అన్నది మాత్రం చూసుకోను. అలా చూసుకుంటూ బరువు తగ్గితే గ్లో తగ్గి పోతుందని నా అభిప్రాయం.

**రవితేజతో రెండవసారి చేస్తున్నట్టున్నారు?**

'బెంగాల్ టైగర్' చేస్తున్న సమయంలోనే రవితే జగారు చెప్పారు. నా తరువాతి సినిమాలో కూడా నువ్వే చేయాలని అన్నారు. అప్పుడు ఆయన సీరి యస్‌గా అన్నారని అనుకోలేదు. కానీ ఆయన తన మాటను నిలబెట్టుకున్నారు. ఒక్క రవితేజగారితోనే కాదు గోపీచంద్ గారితో కూడా 'ఆక్సిజన్' సినిమాలో నటిస్తున్నాను. ఆయనతో కూడా రెండవసారి చేస్తు న్నాను.

**బాలీవుడ్‌లో సినిమాలు చేయడం లేదు ఎందుకు?**

నేను అక్కడి నుంచే ఇక్కడికి వచ్చాను. ఇప్పు డప్పుడే అక్కడికి వెళ్ళే ఉద్దేశం లేదు. దక్షిణాది వారు ఇంత ప్రేమ చూపిస్తుంటే వీరిని వదిలి బాలీవుడ్‌కి వెళ్ళడం ఎందుకు? భవిష్యత్తులో ఎప్పుడైనా ఓ సినిమా చేస్తానేమో గానీ, అక్కడే సెటిల్ అయ్యే ఉద్దేశం, కోరికా నాకు లేవు.

**హైదరాబాద్‌లో ఇల్లు కొన్నా రట?**

ఇక్కడ సెటిల్ అయ్యే ఉద్దేశం ఉంది కాబట్టి ఇక్కడ కొనుక్కున్నాను. ఇప్పటికైనా అర్థమయ్యే ఉంటుంది. దక్షిణాదిని విడిచి వెళ్ళనని.

**కోలీవుడ్‌లో ఇంత వరకూ సినిమాలు చేసినట్టు లేరు?**

ఇటీవలి కాలంలో ఒకటి రెండు అవకాశాలు వచ్చాయి. కానీ వాళ్ళకి డేట్లు అడ్జస్ట్ చేయలేక పోయాను. త్వరలోనే ఓ సినిమా చేసే అవకాశం ఉంది.

**మీతో పనిచేసిన దర్శకుల గురించి....**

ఇప్పటి వరకూ నేను పనిచేసిన అందరి దర్శకు లలో అనిల్ రావిపూడి బాగా నచ్చారు. ఆయన స్టయిల్, హీరోయిన్లను అందంగా చూపించే విధానం బాగుంటాయి. అవకాశం వస్తే ఆయనతో మరో సినిమా చేయాలని ఉంది.

**ఖాళీ సమయాల్లో ఏం చేస్తారు?**

నాకు కవిత్వం అంటే చాలా ఇష్టం. చదవడం అన్నా, రాయడం అన్నా ప్రాణం. షూటింగ్‌లు లేని సమయంలో కవితలు రాస్తూ ఉంటాను. ఇప్పటి వరకూ చాలా కవితలు రాశాను. వాటన్నింటిని కలిపి ఓ పుస్తకంగా తెచ్చే ఆలోచన ఉంది. కొద్దిగా టైము దొరకగానే పుస్తకం పని ప్రారంభిస్తాను.

-కె. రామకృష్ణ



